# కవితాలోచనమ్

## సాహిత్య వ్యాసాలు



డా॥ రావి రంగారావు

# KAVITHALOCHANAM

Literary Essays

By

***Dr. RAVI RANGA RAO***

M.A.,M.Ed.,JDL.,DDE.,M.Phil,Ph.D.,SLET

LECTURER

A.J.COLLEGE OF EDUCATION

MACHILIPATNAM A.P. 521 001, INDIA.

☎ (08672) 21345

**SAAHITHEE MITHRULU**

MACHILIPATNAM

PUBLICATION NO : 21



| | | |
|---|---|---|
| FIRST PRINT | : | MAY 2001 |
| COPIES | : | 500 |
| PRICE | : | RS. 60/- |
| LIBRARY PRINT | : | RS. 100/- |

*FOR COPIES* :

☎ (08672) 21345

NARRA PRABHAVATHI

27-431, PATHA RAMANNA PETA

MACHILIPATNAM. A.P. 521 001, INDIA.

PRINTED AT :

BANDAR KALYANI PRESS,

MACHILIPATNAM.

# కృతజ్ఞతలు

లోచనం అంటే కన్ను. కవితాలోచనం అంటే కవిత్వం కన్ను కవిత్వాన్ని చూసే కన్నుగా, కవిత్వాన్ని చూపించే కన్నుగా కూడా భావించుకోవచ్చు. "కవితాలోచన(మ్)" అనగానే "ఆలోచన" కూడా స్ఫురిస్తోంది. కవిత్వంలోని లోతుల్ని ఆలోచించటం ద్వారా ఆవిష్కరించవచ్చు అనే వాస్తవాన్ని ఈ సంపుటి తేటతెల్లంచేస్తుంది. దాదాపు 20 సంవత్సరాలుగా నేను రాస్తూ వచ్చిన సాహిత్య వ్యాసాలలో ఎంపిక చేసిన కొన్ని వ్యాసాలివి. వాటిని ఈనాటికైనా ఓ సంపుటిగా పాఠకుల ముందుకు తీసుకురాగలుగుతున్నందుకు సంతోషిస్తున్నాను. ముఖ్యంగా "మచిలీపట్నం, సాహితీ మిత్రులు"కు ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

కవిత్వ విమర్శ అంటే - కవిత్వంలోని సందేశాల్ని, విశేషాల్ని, సొగసుల్ని పాఠకులు తేలిగ్గా గ్రహించటానికి సహాయపడే వివరణ అని నా భావన. కవిత్వాన్ని చదవాలనే ఆసక్తిని, శక్తిని పెంపొందించటానికి కవిత్వ విమర్శ తోడ్పడాలి. అందుకోసం కవిత్వ విమర్శకుడు సహృదయుడై కృషి చేయాలి. కవులపట్ల కాని, ప్రక్రియలపట్ల కాని అనవసరమైన ద్వేషం పనికి రాదు. విశాల దృష్టితో కవిత్వాన్ని అర్థం చేసుకోవడం విమర్శకుడి కర్తవ్యం. ఆ కర్తవ్యాన్ని పాటించాలనేదే నా ప్రయత్నం.

కవుల్లో రకరకాల కవులుండవచ్చు.. అభ్యుదయ కవులు, విప్లవ కవులు, దళిత కవులు... వగైరా. కాని విమర్శకుల్లో ఇన్ని రకాలు ఉండవలసిన పని లేదు. ఏరకం కవిత్వంలోనైనా ఆ కవిత్వ ఉద్దేశాల్ని, విలువల్ని చక్కగా గ్రహించి పాఠకులకు తెలియజెప్పే విశేషమైన సేవా బాధ్యత విమర్శకుడు స్వీకరించాలి. అంటే పాఠకుడికి, కవికి మధ్య విమర్శకుడు వారధి.

కవిత్వ విమర్శకుడుగా నేను ఎదగడానికి నన్ను ప్రోత్సహించిన ఆనాటి "భారతి" సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారికి ముఖ్యంగా కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఆ తరువాత "తెలుగు విద్యార్థి" సంపాదకులు శ్రీ కొల్లూరి కోటేశ్వరరావుగారికి ప్రత్యేక కృతజ్ఞతలు ప్రకటించుకొంటున్నాను. నేను అనేక వ్యాసాలు రాయటానికి ప్రముఖ సాహిత్య విమర్శకులు శ్రీ అద్దేపల్లి

# కవితాలోచనము

## సాహిత్య వ్యాసాలు





**డా॥ రావి రంగారావు**

ప్రచురణ
**సాహితీ మిత్రులు**
మచిలీపట్నం

# KAVITHALOCHANAM
Literary Essays

By
***Dr. RAVI RANGA RAO***
M.A.,M.Ed.,JDL.,DDE.,M.Phil.Ph.D.,SLET
LECTURER
A.J.COLLEGE OF EDUCATION
MACHILIPATNAM A.P. 521 001, INDIA.
☎ (08672) 21345

**SAAHITHEE MITHRULU**
MACHILIPATNAM

PUBLICATION NO : 21


FIRST PRINT : MAY 2001
COPIES : 500

PRICE : RS. 60/-

LIBRARY PRINT : RS. 100/-

*FOR COPIES* :
☎ (08672) 21345
NARRA PRABHAVATHI
27-431, PATHA RAMANNA PETA
MACHILIPATNAM. A.P. 521 001, INDIA.

PRINTED AT :
BANDAR KALYANI PRESS,
MACHILIPATNAM.

# కృతజ్ఞతలు

లోచనం అంటే కన్ను. కవితాలోచనం అంటే కవిత్వం కన్ను. కవిత్వాన్ని చూసే కన్నుగా, కవిత్వాన్ని చూపించే కన్నుగా కూడా భావించుకోవచ్చు. "కవితాలోచన(మ్)" అనగానే "ఆలోచన" కూడా స్ఫురిస్తోంది. కవిత్వంలోని లోతుల్ని ఆలోచించటం ద్వారా ఆవిష్కరించవచ్చు అనే వాస్తవాన్ని ఈ సంపుటి తేటతెల్లంచేస్తుంది. దాదాపు 20 సంవత్సరాలుగా నేను రాస్తూ వచ్చిన సాహిత్య వ్యాసాలలో ఎంపిక చేసిన కొన్ని వ్యాసాలివి. వాటిని ఈనాటికైనా ఓ సంపుటిగా పాఠకుల ముందుకు తీసుకురాగలుగుతున్నందుకు సంతోషిస్తున్నాను. ముఖ్యంగా "మచిలీపట్నం, సాహితీ మిత్రులు"కు ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

కవిత్వ విమర్శ అంటే - కవిత్వంలోని సందేశాల్ని, విశేషాల్ని, సొగసుల్ని పాఠకులు తేలిగ్గా గ్రహించటానికి సహాయపడే వివరణ అని నా భావన. కవిత్వాన్ని చదవాలనే ఆసక్తిని, శక్తిని పెంపొందించటానికి కవిత్వ విమర్శ తోడ్పడాలి. అందుకోసం కవిత్వ విమర్శకుడు సహృదయుడై కృషి చేయాలి. కవులపట్ల కాని, ప్రక్రియలపట్ల కాని అనవసరమైన ద్వేషం పనికి రాదు. విశాల దృష్టితో కవిత్వాన్ని అర్థం చేసుకోవడం విమర్శకుడి కర్తవ్యం. ఆ కర్తవ్యాన్ని పాటించాలనేదే నా ప్రయత్నం.

కవుల్లో రకరకాల కవులుండవచ్చు... అభ్యుదయ కవులు, విప్లవ కవులు, దళిత కవులు... వగైరా. కాని విమర్శకుల్లో ఇన్ని రకాలు ఉండవలసిన పని లేదు. ఏరకం కవిత్వంలోనైనా ఆ కవిత్వ ఉద్దేశాల్ని, విలువల్ని చక్కగా గ్రహించి పాఠకులకు తెలియజెప్పే విశేషమైన సేవా బాధ్యత విమర్శకుడు స్వీకరించాలి. అంటే పాఠకుడికి, కవికి మధ్య విమర్శకుడు వారధి.

కవిత్వ విమర్శకుడుగా నేను ఎదగడానికి నన్ను ప్రోత్సహించిన ఆనాటి "భారతి" సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారికి ముఖ్యంగా కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఆ తరువాత "తెలుగు విద్యార్థి" సంపాదకులు శ్రీ కొల్లూరి కోటేశ్వరరావుగారికి ప్రత్యేక కృతజ్ఞతలు ప్రకటించుకొంటున్నాను. నేను అనేక వ్యాసాలు రాయటానికి ప్రముఖ సాహిత్య విమర్శకులు శ్రీ అద్దేపల్లి

రామ్మోహనరావుగారి వ్యాసాలు నాకు మొదట్లో స్ఫూర్తి నిచ్చాయి. వారికి కూడా కృతజ్ఞతలు. ఆ తరువాత నేను అనేక వ్యాసాలు రాయటానికి కారకులైన ఆకాశవాణి విజయవాడ కేంద్రం ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ శ్రీమతి పి. కృష్ణకుమారి గారికి, శ్రీ నాగసూరి వేణుగోపాల్‌గారికి, నాచేత కవిత్వ ఉపన్యాసాలు ఇప్పించిన ప్రముఖ రచయిత, గ్రంథాలయ సమితి వ్యవస్థాపకులు శ్రీ దొండపాటి దేవదాస్‌గారికి, ఇంకా ఎందరో పత్రికా సంపాదకులకు, సాహితీ వేత్తలకు కూడా కృతజ్ఞతలు. నా సాహిత్య వ్యాసంగంలో నిరంతరం నన్ను ప్రోత్సహించే నా ప్రియ శిష్యుడు రాళ్ళబండి కవితాప్రసాద్‌కుకూడా కృతజ్ఞతలు చెప్పాలి. ఇంకా నాకు సహకరిస్తున్న మిత్రులెందరో ఉన్నారు. వారందరికీ కృతజ్ఞతలు.

మా ఆంధ్రజాతీయ బి. ఇడి. కళాశాలలో అప్పటి తెలుగుశాఖ అధ్యక్షులు కీ॥ శే॥ వేదాల నరసింహాచార్యులుగారు నాకెన్నో కవిత్వ విశేషాలు తెలియజేసేవారు. వారిని కూడా ఈ సందర్భంగా నేను శ్రద్ధతో స్మరించుకుంటున్నాను.

నా కవిత్వ వ్యాసాల్ని ఓ సంపుటిగా తేవాలని ఎప్పటినుంచో నన్ను ప్రోత్సహిస్తూ వస్తున్న ప్రముఖ విద్యావేత్త, ఆదర్శ అధ్యాపకురాలు శ్రీమతి దాసరి శారదాంబగారికి ఈ గ్రంథం అంకితం ఇవ్వటం ఔచిత్యం అని భావిస్తున్నాను. వారు మా అమ్మాయికి గురువర్యులు, నాకు గురుతుల్యులు. మాకుటుంబానికి శ్రేయోభిలాషి. వారి మమతానురాగాలకు మాటలలో కృతజ్ఞతలు చెప్పుకోలేను. మచిలీపట్నం లేడీయాంప్తిల్ బాలికల కళాశాల ప్రిన్సిపల్‌గారంటే ఇప్పటికీ ఎవరికైనా గుర్తొచ్చేది వారే.

"కవితాలోచనమ్" పేరెలా ఉందని అడగ్గానే బాగా ఆలోచించిన తరువాత బాగానే ఉందని ఆమోదించిన కృష్ణాజిల్లా సాహితీ మిత్రులు ప్రధాన కార్యదర్శి, సంస్కృత పండితులు, ప్రియ సోదరులు శ్రీ కె. వై. యల్. నరసింహాచార్యులుగారికి కూడా నా కృతజ్ఞతలు.

మీ
రావి రంగారావు

# నమస్కృతులు

యువతలోని సృజనాత్మక నైపుణ్యాల్ని వికసింపచేయటం, సామాజిక వికాసానికి తోడ్పడే సాహిత్య కార్యక్రమాలు నెల నెలా ఏర్పాటు చేయటం మచిలీపట్నం సాహితీమిత్రుల ముఖ్య లక్ష్యాలు. పాఠకులలో మంచి విలువల్ని పెంపొందింపచేసే మంచి సాహిత్యాన్ని ప్రచురించి చౌకగా అందించడం కూడా మా ఆశయమే. మా సంస్థ వ్యవస్థాపకులు, ప్రముఖ కవి డా॥ రావి రంగారావు రచించిన అవినీతి వ్యతిరేకోద్యమ కవిత్వం "రేజరులో సూర్యుడు", త్రిభాషా మినీ కవితల సంపుటి "అగ్గిపెట్టె", "సామాజిక హైకూలు", "తెల్లచీకటి" అనే బహుముఖీన కవితల సంపుటి ప్రచురించాము. మినీకవిత గురించి రాసిన వ్యాసాలు "మినీ కవిత - శిల్ప సమీక్ష", బాల సాహిత్యంలో విశేష రచన "పిల్లల్లో మినీ కవిత్వ రచనా నైపుణ్యాలు" కూడా ప్రచురించాము. కవిత్వం గురించి, కవుల గురించి వారు రచించిన కవిత్వ వ్యాసాలు ఎప్పుడో ప్రచురించాల్సివున్నా నిధుల కొరత వలన బాగా ఆలస్యమైంది. ఇప్పటికైనా వీటిని వెలికి తీసుకొని రాగలుగుతున్నందుకు మాకు ఆనందంగా ఉంది. ఈ గ్రంథాన్ని "మచిలీపట్నం సాహితీ మిత్రులు" ప్రచురణగా వెలువరించడానికి అంగీకరించిన రంగారావుగారికి మా కృతజ్ఞతలు. మా గ్రంథాలు ఆదరిస్తున్న పాఠక లోకానికి మా నమస్కృతులు.

**సాహితీ మిత్రులు,**
**మచిలీపట్నం**

బి. జ్ఞానేశ్వరరావు
**కన్వీనరు**

# వ్యాస సూచిక





సాహిత్య వనంలోంచి

కవిత్వ ఫలాల్ని తెచ్చి

పాఠక దేవుళ్ళకు సమర్పించుకునే

శబరిలాంటి వాడు

కవిత్వ విమర్శకుడు



విద్యార్థుల ఆరాధ్య దైవం

విజ్ఞాన తేజో రూపం

తీయని పలుకుల పాల కడలి

తెలుగు సరస్వతి నెచ్చెలి

**శ్రీమతి డి. శారదాంబగారికి ...**

- రావి రంగారావు

# మాతృభాష : సౌందర్యం

ప్రపంచమే సౌందర్యం, సౌందర్యమే ప్రపంచం. చూడగలిగిన మనసున్న వాడికి అంతటా సౌందర్యం అగుపిస్తుంది. ఒక చెట్టులో, ఒక మనిషిలో ... భాషలో కూడా సౌందర్యం ఉంది.

సౌందర్యాన్ని ప్రధానంగా రెండు రకాలుగా చెప్పవచ్చు. 1) బాహ్య సౌందర్యం 2) అంతస్సౌందర్యం.

చెట్టు పచ్చగా కళకళలాడుతూ అందంగా కనిపిస్తోంది. అది బాహ్య సౌందర్యం. అదే చెట్టు తినటానికి పండ్లిస్తూ, ఉండటానికి నీడనిస్తూ ప్రజలకు ఉపయోగపడుతుంది. ఇది అంతస్సౌందర్యం. అలాగే ఒక మనిషి చూడటానికి అందంగా కనిపిస్తూ ఉండవచ్చు. అది బాహ్య సౌందర్యం. ఆ మనిషి మంచి గుణాలు కలవాడై నలుగురికీ ఉపయోగపడుతుంటే అదే అంతస్సౌందర్యం.

ఈ రెండు రకాల సౌందర్యాలలోను ఏది గొప్పదనే అనుమానం కలుగవచ్చు. రోగికి రోగాన్ని తగ్గించే మందుబిళ్ళ ఎలాంటి పంచదార పూత లేకుండా మింగటానికి ఇస్తే ఆ చేదు భరించలేక కక్కేస్తాడు. అదే బిళ్ళకు పైన పంచదార పూత పూసి రోగికిస్తే చక్కగా మింగుతాడు. రోగం తగ్గుతుంది. బాహ్యసౌందర్యం కన్న అంతస్సౌందర్యం గొప్పదే కాని బాహ్య సౌందర్యం ఉన్నప్పుడే అంతస్సౌందర్యం ప్రజలకు బాగా చేరువ కాగలదనేది సత్యం. అంతస్సౌందర్యం లేని కేవల బాహ్య సౌందర్యం ప్రయోజనం సాధించలేదు.

బాషలోని సౌందర్యాన్ని కూడా ఇలాగే పరిశీలించవచ్చు. వ్యక్తులు మాట్లాడుతున్న రీతిలో, చదువుతున్న విధానంలో, రాస్తున్న శైలిలో సౌందర్యం గమనించవచ్చు. పద్యాలు, గేయాలు, నాటకాలు, కథలు, నవలలు, వ్యాసాలు, ఉత్తరాలు ... మొదలైన వివిధ ప్రక్రియల్లోను సౌందర్యం వుంది. ఇక్కడ కూడా సౌందర్యం బాహ్యసౌందర్యం, అంతస్సౌందర్యం అంటూ విడివిడిగా పరిశీలన చేయవచ్చు. భాషలోని సౌందర్య తత్త్వాన్ని స్పష్టంగా అర్థం చేసుకొనటానికే ఈ విభజనగాని ఆ రెండు రకాలు ఒకదాని కొకటి వ్యతిరేకమని ఉద్దేశం కాదు. రెండూ అవసరమే. రెండూ సౌందర్యమే.

## బాహ్య సౌందర్యం

భాషలోని బాహ్య సౌందర్యాన్ని మూడు అంశాలలో గమనించవచ్చు.

1. శబ్దాలంకారాలు, 2. లయ, 3. ఉపరితల భావం.

**1. శబ్దాలంకారాలు :** భాషలోని అలంకారాలు శబ్దాలంకారా లని, అర్థాలంకారా

లని రెండు రకాలు. శబ్దాలంకారంలో బాహ్య సౌందర్యం కనిపిస్తుంది. "మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు పోవునే మదనములకు" అన్నప్పుడు అందులోని మకార పునరావృత్తి వినటానికి ఇంపుగా వుంటుంది. దీనినే వృత్త్యనుప్రాస అలంకార మంటారు. "విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణు కృష్ణు" అనే పద్యపాదం కూడా ఇలాంటిదే.

"కమనీయ శుభగాత్రు, కంజాతదళనేత్రు, వసుధాకళత్రు, పావనచరిత్రు..." అనే పద్యపాదంలోని అంత్యానుప్రాస అలంకారం బాహ్యసౌందర్యమే.

"కొమ్మా! నామది గైకొమ్మా !" వంటి యమకం ... మొదలైన ఇతర శబ్దాలంకారాల్లోను కనిపించేది బాహ్య సౌందర్యమే.

**2. లయ :** పద్యాలు, గేయాలు, వచనగేయం మొదలైన ప్రక్రియల్లోని "లయ" కూడా బాహ్య సౌందర్యమే. పద్యాలలోని అక్షరగణాలు, గేయాలలోని మాత్రాగణాలు, వచన గేయంలోని వ్యాకరణగణాలు భావగణాలు పదగణాలవలన లయ సిద్ధిస్తుంది. వినటానికి ఇంపుగా ఉండే ఈ 'లయ'లో బాహ్య సౌందర్యం ఉంది.

***'నల్లనివాడు, పద్మనయనంబులవాడు, కృపారసంబు పై***
***జల్లెడువాడు, మౌళిపరిసర్పిత పింఛమువాడు, నవ్వురా***
***జిల్లెడు మోమువా డొకడు చెల్వల మానధనంబు దోచెనో***
***మల్లియలార ! మీ పొదలమాటున లేడుగదమ్మ చెప్పరే !"***

ఇది ఉత్పలమాల పద్యం. ప్రతి పాదంలోను 20 అక్షరాలతో భ, ర, న, భ, భ, ర వ - అనే గణాలున్నాయి. ఎలాంటి తడబాటు లేకుండా ధారాళంగా చదువుతూ వుంటే అందులో ఉత్పలమాల 'లయ' శ్రవణానందాన్ని కలిగిస్తుంది. భావం అర్థం కాకపోయినా అందులోని లయ బాగుందనిపిస్తుంది.

అలాగే గేయాల్లోని చరణాల్లో మాత్రాగణాల సమత ఉండటం వలన "లయ" వస్తుంది.

"ఎవరో / వస్తారని
ఏదో / చేస్తారని
ఎదురు / చూచి / మోస / పోకు / మా !
నిజం / మరచి / నిదుర / పోకు / మా"

మొదటి రెండు చరణాల్లో పదేసి (4+6) మాత్రలున్నాయి. మూడు నాలుగు చరణాల్లో పదునాలుగేసి (3+3+3+3+2) మాత్రలున్నాయి. సంగీత జ్ఞానం లేకపోయినా ధారాళంగా ఈ గేయాన్ని చదివినా చాలు ఆ నడకలోని సమత

కారణంగా వినటానికి ఇంపుగానే ఉంటుంది.

ఛందస్సు గురించి నేర్చుకొనేటప్పుడు సాధారణంగా హ్రస్వాక్షరాన్ని "లఘువు" అంటారని, దీర్ఘాక్షరాన్ని (ఇంకా మరికొన్నిటిని కూడా) "గురువు" అంటారని విని వుంటారు. అలాగే గేయాల్లో సాధారణంగా ఒక్కొక్క హ్రస్వాక్షరాన్ని ఒక మాత్రగా, ఒక్కొక్క దీర్ఘాక్షరాన్ని (మరికొన్నిటిని కూడా) రెండు మాత్రలుగా స్వీకరించవచ్చు. మాత్ర అంటే ఒక సెకను కాలం ఉచ్చరించబడే అక్షరం. గేయాలలోని ఈ మాత్రాగణాల కారణంగానే పద్యంలోకన్న గేయాల్లోని లయలో ఎక్కువ వైవిధ్యాన్ని గమనించ గలుగుతున్నాము.

వచన కవితల్లో కూడా "లయ" ఉంది. ఆ లయను అక్షరగణాలు, మాత్రాగణాలుగా గమనించటానికి వీలుకానిది. వచన కవితల్లో వ్యాకరణ గణాలు, భావ గణాలు, పదగణాలు అని విమర్శకులు విశ్లేషించి చూపించారు.

**"సీమటపాకాయ కెంత బడాయో**
**ఎర్రగా నాజూగ్గా వున్నానని !!**
**ఔటు కెంత గర్వమో**
**నీటుగా దీటుగా వున్నానని !!**
**ఆటంబాంబు కెంత ఔద్ధత్యమో**
**బలంగా బరువుగా వున్నానని !!**
**కాని పాపం !**
**వాటికి తెలియదు**
**అగ్గిపుల్లకు బానిసలమని,**
**సైజు కాదు -**
**తలకాయే ముఖ్యమని."** (విశాలాంధ్ర 9-11-'88)

ఈ వచన కవితలో 1, 3, 5 పాదాల్లో ఆశ్చర్యభావన సమాన లక్షణం. 2, 4, 6, 9, 11 పాదాల్లో ఉపభావాన్ని ముగించే రీతిలో సమాన లక్షణం. భావానుగుణంగా చదువుతున్నపుడు ఇందులోని భావలయ వలన వినటానికి ఇంపుగా వుంటుంది. ఈ విధమైన లయవలన పద్యంకన్న గేయంకన్న వచన కవితలో చాలా ఎక్కువ వైవిధ్యంతో కూడిన లయను గమనించవచ్చు. కవి ఆలోచనా రీతి, భావావేశం ప్రసరించటాన్ని బట్టి లయ మారుతూ ఉంటుంది.

**3.** ***ఉపరితల భావం :*** చివరలో చెపుతున్నా గట్టిగా గుర్తుపెట్టుకోవాల్సిన విషయం. ఆలోచించక ముందు అందే పై భావం అంతా కూడా భాషలోని బాహ్య సౌందర్యమే.

## అంతస్సౌందర్యం

మామూలుగా వినిపించే మాటలు బాహ్యసౌందర్యం. ఆ మాటల వెనుక దాగివున్న గంభీర భావాలు ఆలోచనకు చిక్కేవి అంతస్సౌందర్యం. అంతస్సౌందర్యం గ్రహించటానికి ఆలోచన అవసరం. అంతస్సౌందర్యం వున్న రచన కవిత్వమవుతుంది. మనిషి ఒక రచన చదివి అందులోని గంభీర భావాలు అవగాహన చేసుకుని ఆ చమత్కారానికి మురిసిపోయి ఆనందానుభూతి చెందినా, అన్యాయం మీద ధ్వజమెత్తినా, మానవత్వంతో ఆర్తుల్ని ఆదుకుంటున్నా - అన్నిటికి మూలకారణం రచనలోని అంతస్సౌందర్యం ప్రేరేపించటమే. ఈ అంతస్సౌందర్యం గ్రహించలేని వాడు నిజమైన ఆనందం సంపూర్ణంగా పొందలేడు. కేవలం వాడు జడుడిగానో, మూర్ఖుడిగానో, ఉన్మాదిగానో, గూండాగానో, స్వార్థపరుడిగానో మిగిలిపోతాడు.

అంతస్సౌందర్యానికి ఉదాహరణగా పెద్ద పెద్ద కావ్యాలదాకా వెళ్లే పని లేదు. అందరికీ తెలిసినదే. వేమన శతకంలోని పద్యం ఇది.

**"వేరు పురుగు చేరి వృక్షంబు చెఱచును.**

**చీడ పురుగు చేరి చెట్టు చెఱచు**

**కుత్సితుండు చేరి గుణవంతు చెఱచురా !"**

వేరు పురుగు, చీడపురుగు చెట్టును చెడగొట్టినట్లు దుర్మార్గులు మంచివాడిని చెడగొడతారనేది కనిపించే భావం. ఇది బాహ్యసౌందర్యం. ఇందులోని ఆటవెలది నడక కూడ బాహ్యసౌందర్యమే.

ఆలోచిస్తే అందే గంభీర భావాలు అంతస్సౌందర్యం. ఆలోచన ప్రశ్నలో నుండి మొదలవుతుంది. చీడపురుగు, వేరుపురుగు అని రెండు పురుగుల్ని చెప్పాల్సిన అవసరం ఏమిటనే ప్రశ్న నుండి విశేషభావాలు కదలటం ప్రారంభిస్తాయి.

సమాజంలోని దుర్మార్గులు వేరుపురుగుల్లాగా, చీడపురుగుల్లాగా రెండు రకాలు. పైకి దుర్మార్గుల్లాగా కనిపిస్తూ ద్రోహం చేస్తూ ఉండే రౌడీలు వగైరా చీడపురుగుల్లాంటివారు. పైకి మంచివాళ్లుగా మెత్తగా అందంగా కనిపిస్తూనే ప్రజలకు తెలియకుండా 'తెరచాటు భాగోతం' జరిపే కుటిల రాజకీయ నాయకులు వగైరా వేరుపురుగుల్లాంటివారు. చీడ పురుగుకన్న వేరు పురుగు ఎక్కువ ప్రమాదకరం. మామూలు రౌడీలకన్న కుటిల నాయకులే మరీ ప్రమాదం. వేరు పురుగు వలన చెట్టు మొత్తం నాశన మైనట్లే నాయకుల వలన దేశం మొత్తం సంక్షోభంలో పడిపోతుంది. అందుకే కవి వేరుపురుగును ముందే చెప్పాడు. అంతమాత్రాన

చీడపురుగును పట్టించుకోకుండా వున్నా ప్రమాదమే. రెండు రకాల దుర్మార్గుల్ని గురించి జాగ్రత్తపడాలనేదే కవి సందేశం.

వేరు పురుగుకు, రాజకీయ నాయకుడికి రంగులోను పోలికలున్నాయి. వేరు పురుగు తెల్లగా వున్నట్లే నాయకుడు కూడా శుద్ధఖద్దరు ధరిస్తాడు. శుభ్రమైన తెల్లబట్టలే తొడిగి మిలమిల మెరుస్తూ వుంటాడు ... సమాజం ఇలా రెండు రకాల దుర్మార్గుల ప్రమాదానికి లోనుగాకుండా వుండాలని వేమన హెచ్చరిస్తున్నాడు ... ఇంతేకాదు. ఆలోచించే అలవాటు వున్నవాడికి ఈ పద్యంలో చెట్టుకు గుణవంతునికి సామ్యాలు ... ఇంకా ఎన్నెన్నో విశేష భావాలు గోచరించవచ్చు. ఇలా ఆలోచించే కొద్దీ ఎన్నెన్నో గంభీర భావాలు అందుతూ వుంటే కలిగే ఆనందం వర్ణనాతీతం. బాహ్యసౌందర్యం వలన కలిగే ఆనందం తాత్కాలికమైతే ఈ ఆలోచనవల్ల కలిగే అంతస్సౌందర్య ఆనందం శాశ్వతమైనది. అందుకే దీన్ని "ఆలోచనామృతమ్" అన్నారు.

సాధారణంగా భాషలో అర్థాలంకారాలవలనే కాకుండా పదప్రయోగ నైపుణ్యం వలన కూడా రచనకు "లోతు" సిద్ధిస్తుంది.

రచనలు "ఆపాతమధురమ్, ఆలోచనామృతమ్"లా ఉండాలన్నారు పెద్దలు. ఏ రచనయినా ముందు బాగున్నదనిపించాలి. అదే 'ఆపాతమధురమ్' లేదా బాహ్య సౌందర్యం. తరువాత ఆలోచిస్తూ వుంటే అమృతంలాగా శాశ్వత ప్రయోజనం కలగాలి. అదే "ఆలోచనామృతమ్" లేదా అంతస్సౌందర్యం. సాధారణ వ్యక్తి బాహ్యసౌందర్యం దగ్గరే ఆగిపోతాడు. అసాధారణ వ్యక్తి ఆలోచనతో ముందుకు సాగుతాడు. అందుకే రెండు రకాల సౌందర్యం ఉన్న రచనలు అందరినీ ఆకర్షిస్తాయి.

ఇంతవరకు మచ్చుకు మాత్రమే ఒక పద్యానికి పరిశీలన జరిగింది. ఇలాంటి పద్యాలతో కూడిన ఎన్నో కావ్యాలు తెలుగు భాషలో ఎన్నో ఉన్నాయి. కేవలం కావ్యాలే కాకుండా ఎన్నో నాటకాలు, మరెన్నో నవలలు, ఎన్నెన్నో రచనలు అంతస్సౌందర్యంతో తొణికిసలాడుతున్నవి మన మాతృభాషలో ఉన్నాయి. కావ్యాల దాకా వెళ్ళవలసిన పనిలేదు. అంతస్సౌందర్యం వున్న ఒక వాక్యం చాలు ఆలోచించి అంతస్సౌందర్యం గ్రహించే అలవాటు పెంపొందించుకొనటానికి.

## మాతృ భాష ప్రాధాన్యం

సౌందర్యం గ్రహించటం నేర్చిన మనసుకు సదసద్వివేచక్షణ శక్తి ఎక్కువగా ఉండే అవకాశం ఉంది. మనిషికి మేధ, హృదయం అనేవి రెండూ చాలా ముఖ్యం. ఇందులో మేధ విజ్ఞానానికి సంబంధించినది. హృదయం సౌందర్యాన్ని గ్రహించటానికి

సంబంధించినది, విజ్ఞానాన్ని విశ్వమానవ కల్యాణానికి వినియోగించేది.

సోవియట్ కల్చరల్ ఫౌండేషన్ బోర్డు ఛైర్మను డి. లిఖాచెవ్ "Beauty saves the world. Beauty lies in the realisation of the fact that life is the greatest value" అంటారు. భాషలోని సౌందర్యం మనిషికి స్పందించే గుణాన్ని పెంపొందింపచేస్తుంది. వివిధ రసాలకు అనుగుణమైన చిత్తవైఖరుల్ని అర్థం చేసుకునే అవకాశం ఇస్తుంది. మానవత విలువల్ని సర్వోన్నతంగా భావించే సంస్కారాన్ని అందిస్తుంది. స్పందన, చైతన్యం, సంస్కారం, ప్రేమ, కరుణ, త్యాగం, సత్యం మొదలైన నిర్మల గుణాలు మనిషికి మాతృభాషలోని సౌందర్యాన్ని గ్రహించటం వలన పెంపొందుతాయి. మాతృభాషలోని అంతస్సౌందర్యం గ్రహించటం నేర్చిన తరువాతనే ఇతర భాషలలోని అంతస్సౌందర్యాన్ని గ్రహించే ప్రయత్నం జరుగుతుంది. ఇలా అంతస్సౌందర్యాన్ని గ్రహించే శక్తినే "సహృదయత" అంటారు. ఈ శక్తి కలవారు సహృదయులు.

ఆధునిక మానవుడు అణుబాంబులు విసిరి ప్రపంచాన్ని క్షణంలో భస్మీ పటలం చేసేటంతటి ఎక్కువ మేధను పెంచుకోగలిగాడు గాని తోటి మానవుని ఆకలిని గుర్తించి, సమస్యల్ని విశ్లేషించి పరిష్కారా లాలోచించి ప్రపంచ శాంతికి దోహదం చేసే హృదయం పెంచుకోలేకపోతున్నాడు. హృదయం ఉన్నవాడే అణువిజ్ఞానాన్ని గురించి అనంతమైన పరిశోధనలు జరిపి మానవ కల్యాణానికి తోడ్పడగలడు. హృదయం లేని మేధావి మానవ వినాశనానికి కారణ భూతుడవుతున్నాడు. ప్రపంచ వికాసానికి అత్యవసరమైన హృదయాన్ని పెంపొందించగలిగేది మాతృభాష, అందులోని ఉదాత్త రచనల అంతస్సౌందర్యం. ఏ దేశంలో భాషాసాహిత్యాల్ని నిర్లక్ష్యం చేస్తారో ఆ దేశాల్లో శాంతి ఉండదు, చైతన్యం ఉండదు, సుఖం ఉండదు. ఇది చారిత్రక సత్యం.

కేవలం విజ్ఞాన శాస్త్రాలు ఎంతగా ఉన్నతి కెక్కినా ప్రయోజనం ఉండదు. ఏ దేశంలో విజ్ఞాన శాస్త్రాలతోబాటు భాషా సాహిత్యాలకు కూడా అనంత గౌరవం వుంటుందో ఆ దేశంలో శాంతియుత నిర్మల జీవనం చోటు చేసుకుంటుంది. ఈ విషయాన్ని ఆధునిక విద్యావేత్తలు, మేధావులు గ్రహించి మాతృభాషా వికాసానికి కృషి చెయ్యాలి.

పరిపూర్ణ మానవుడిగా, ఉత్తమ పౌరుడిగా, చైతన్యమూర్తిగా ప్రజ్వలించే శక్తిగా మనిషిని మలిచేది మాతృ భాష. మనిషికి మూర్తిత్వాన్ని (Formation) ఇచ్చేది మాత, మూర్తిమత్వాన్ని (Personality) పెంపొందింపజేసేది మాతృభాష.

*(తెలుగు బోధనా ప్రదీపిక, 1985)*

# ఇది తెలుగు గడ్డ

కన్న తల్లిని ప్రేమించటం తెలిసిన వాడే స్వగ్రామాన్ని అభిమానించగలడు. స్వగ్రామాన్ని ప్రేమించిన వాడే రాష్ట్రాన్ని అభిమానించ గలడు. స్వరాష్ట్రాన్ని ప్రేమించిన వాడే దేశాన్ని అభిమానించ గలడు. స్వదేశాన్ని ప్రేమించిన వాడే ప్రపంచాన్ని అభిమానించగలడు. స్వరాష్ట్రం వారి అష్టకష్టాలు ఏ మాత్రమూ పట్టించు కోకుండా విశ్వమానవ సహోదరత్వం కావాలని కేకలు వేయటం రాజకీయ నాయకులకే చెల్లుతుంది.

భారత దేశంలో హిందీ తరువాత తెలుగు భాషే ఎక్కువ మంది మాట్లాడుతున్నారనే సంగతి చాలమంది తెలుగు వాళ్లకే తెలియక పోవటం దురదృష్టం. మన తెలుగు భాషను గురించి తెలుగు రాష్ట్రాన్ని గురించి అధికార భాషా సంఘం అధ్యక్షుడు డాక్టరు సి. నారాయణరెడ్డి "ఇది తెలుగు గడ్డ" అనే అద్భుత గేయం రాశారు. వయసు ముదురుతున్న కొద్దీ కవితా శక్తి ఇంకా ఇంకా పాకాన పడుతున్నదని చెప్పటానికి ఇటీవలి గజళ్ళు కూడా ముఖ్యమైన ఉదాహరణలే. ఆయన రాసిన ఈ గేయాన్ని గురించి పరిశీలిద్దాం.

**"ఇది తెలుగు గడ్డ, గాం**
**డ్రించు పులిబిడ్డ - ఈ**
**గొంతులో పిల్లి కూతొద్దురా - ఈ**
**గుండెలో గొర్రె దాటొద్దురా"**

కేవలం ఒక రాష్ట్రం గురించి పాడుకున్న గీతమే అని భ్రమింప చేస్తుంది కాని నిశితంగా ఆలోచిస్తే జాతీయ సమైక్యం పెంపొందించే సొగసు ఇందులో దర్శనమిస్తుంది. తెలుగు గడ్డ ఒకానొక పులిబిడ్డ మాత్రమే. భారతదేశం పులి లాంటిది. పులి కడుపున పిల్లి పుట్టదు. ఒక రాష్ట్రం పులిబిడ్డ అయితే మిగిలిన రాష్ట్రాలు కూడా అలాంటి పులి బిడ్డలే అవుతాయి.

తెలుగు జాతి వీర రసాన్ని ప్రేమించేదిగా ఉండాలి కాని పైకి వీరరసం లాగా కనిపిస్తూ, లోన అతిహీనమైన బలహీనతత్త్వం ఉండకూడదని కవి హృదయం. పులి, పిల్లి పైకి చూడటానికి కొన్ని పోలికలు కలిగివుంటాయి. కాని తత్త్వాలు వేరు. అలాగే తెలుగు వాడు పులిలాగా పైకి కనిపిస్తే చాలదు. పులి తత్త్వం కూడా తనకున్నదని నిరూపించుకోవాలి.

పిల్లి కూత మనిషికి అనారోగ్య లక్షణం. తెలుగు వీరులు హృదయాన్ని

చెడగొట్టుకోకుండా నిర్మలంగా వుండేలా చూసుకోవాలని అంతరార్థం. గొర్రె దాటు - అనటంలోను విశేషం ఉంది. గొర్రె అనవసరంగా తగాదాకు పరిగెత్తుతుంది. కాని పరిస్థితి విషమించగలదనిపిస్తే ఎగిరి పారిపోతుంది. ఇలాంటి గొర్రె దాటు భావాలు తెలుగు వాడి గుండెలో కలగ కూడదని, తలపడితే పులి లాగా తిరుగులేని పట్టు పట్టాలని సందేశం.

"ఇది తెలుగు పలుకు, కురి
సే తేనె చినుకు - ఈ
పలుకెపుడు నీరు గారొద్దురా - తీపి
చిలికితేనే చెవికి ముద్దురా"

తెలుగు పలుకు తేనె వలె మధురం. చినుకు ఎండిన క్షేత్రాల్లో చేరి పచ్చగా పంటలు పండిస్తుంది. అలాగే తెలుగు భాష. దీనిలోని సాహిత్య సంపద మిగిలిన భాషా వాఙ్మయాల కన్న ఎందులోను తీసిపోని ఆనందానుభూతుల్ని మనకే కాకుండా కొన్ని ఇతర జాతులకు కూడా పంచగలుగుతున్నది.

తేనె నీరు కారటం ఉత్తమ లక్షణం కాదు. అలా నీరు కారితే అది కల్తీదన్న మాట. మిశ్రమం వేరు, కల్తీ వేరు. మిశ్రమం గుణాన్ని పెంచవచ్చు కాని కల్తీ అనేది గుణాన్ని చంపుతుంది. ఆ విధంగా తెలుగు భాష గుణాన్ని పెంచుకోవాలి కాని పతనం కారాదని కవి కోరిక.

"ఇది తెలుగు తెలివి, రగి
లే నిప్పు కొలిమి - ఇది
ఎప్పుడూ మండుతుండాలిరా - బూది
కప్పినా ఉరుముతుండాలిరా"

తెలుగు తెలివి నిప్పు కొలిమి. అవసరమైనప్పుడల్లా కొలిమిని వాడుకోవాలంటే అది ఆరి పోకుండా ఊదుతూ రాజేస్తూ వుండాల్సిందే. సందేశాలు, అవగాహన మొదలైనవి తెలుగు వాడి తెలివిని ప్రకాశింప జేస్తూ వుండాలి. "బూది కప్పినా" అంటే సమస్యలు వచ్చినా ఎప్పటి కప్పుడు వాటిని తొలగించుకుంటూ నిత్య నూతనంగా తేజరిల్లుతుండాలి.

వంకర ఇనుమును, తుప్పు పట్టిన ఇనుమును సరిజేసేది కొలిమి. అలాగే వక్రభావాలను ఛాందసాలను కాల్చి జనతను సరిదిద్దుకుంటూ తెలుగు వాడు తెలివితో ముందుకు సాగాలి. నిప్పు కొలిమి ఉరుముతూ ఉండాలనటంలో ఎప్పటి కప్పుడు చైతన్యవంతంగా వుంటూ గర్జిస్తూ ఉండాలని కూడా స్ఫురిస్తోంది.

"ఇది తెలుగు కీర్తి. కది
లే కిరణమూర్తి - ఇది
సాగరాల్ దాటి పోయిందిరా - న
యాగరాల్ మీటి వచ్చిందిరా."

తెలుగు కీర్తి కిరణంలాగా అన్ని వైపులా విస్తరిల్లుతున్నది. మన తెలుగు భాషకు ఇతర దేశాలలో కూడ లభిస్తున్న గౌరవం సంతోషదాయకం. ప్రపంచ తెలుగు మహాసభలు మొదలైన కార్యక్రమాలు ఇందుకు దోహదం చేస్తున్నాయి. భారతీయ సంస్కృతి సూర్యబింబం అనుకుంటే అందులో నుండి వచ్చిన "కిరణమూర్తి మన తెలుగు కీర్తి" అనటంలో ఇతర భారతీయ భాషల్ని కూడా అలాంటి కిరణ మూర్తులుగానే భావించవచ్చు. ప్రాంతీయ దురభిమానం ఈ గేయంలో ఏ మాత్రం లేదని గట్టిగా చెప్పవచ్చు.

"ఇది తెలుగునాడి. ఆ
దే కూచిపూడి - ఇది
పేరిణిగ పదము తొక్కాలిరా - నవ
ప్రేరణకు లయలు కట్టాలిరా

"ఇది తెలుగు గీతి. త్యా
గయ గళ జ్యోతి - ఇది
మరి మరీ ప్రజ్వలించాలిరా - బాల
మురళులై ప్రస్తరించాలిరా"

కొన్ని కళలు తెలుగు గడ్డ మీద పుట్టి ఇతర దేశాలకు ఒరవడి దిద్దుతున్నాయి. ఎంతో ఉన్నతిని పొందుతున్నాయి. బాల మురళులై ప్రస్తరించాలనటంలో బాల మురళీ కృష్ణ ప్రతిభ స్ఫురిస్తోంది. "మురళి" అంటే "పిల్లన గ్రోవి" అనే కాకుండా "అశ్వగతి విశేషము" అని కూడా అర్థం. తెలుగు కళలు అలా వేగంగా విస్తరిల్లాలని భావన.

"ఇది తెలుగు జాతి. అపు
డప్పుడో కోతి - మన
తొలిరూపు గుర్తు చేస్తుందిరా - తిక్క
తలకెక్కి చిందు లేస్తుందిరా

"ఇది తెలుగు ప్రతిన. ఒక
టే దీని తపన - ఈ

రాష్ట్రం పురోగమించాలిరా - ప్రజల
రాజ్యం త్రివిక్రమించాలిరా"

ఆంధ్రు లారంభ శూరులనే పేరు మనకుంది. కోతి అనవసరమైన చోట్లలో కాళ్ళు పెట్టి ప్రాణాలు పోగొట్టుకున్న కథ మనకు తెలుసు. తెలంగాణా ఉద్యమం, ఆంధ్రోద్యమం అనే పేర్లతో మనుషుల్ని విడదీసే పనికిరాని వాటిల్లో మనం పాలు పంచుకోగూడదని చురక, తొలిరూపు గుర్తు చేస్తున్న దనటంలో ఇలాంటి పనులు ఆదిమ మానవుడు చేస్తే చేయవచ్చు. కాని ఆధునిక యుగ ఆంధ్ర వీరుడు చేయకూడదని సందేశం.

"తిక్క తలకెక్కిచిందు లేస్తుందిరా" అనటంలో చూడండి. తల అంటే తెలివి. వాడికి తల లేదు - అనే సందర్భంలో ఈ అర్థాన్నే గ్రహిస్తాము. తెలుగు వాడి తెలివిని జయించి అజ్ఞానం ఉన్నతాసనం వేసుక్కూర్చుంటున్నదని ఆవేదన. ప్రజల తెలివి త్రివిక్రమ స్వరూపంతో అజేయం కావాలి.

"పలుకులో పదునులో
గీతిలో రీతిలో
కీర్తిలో స్ఫూర్తిలో
కొస కొమ్మలను ఒడిసి పట్టాలిరా
కుళ్ళు బుద్ధులు పాతి పెట్టాలిరా"

కొస కొమ్మల్ని ఎక్కి కూర్చొనకూడదు. పడిపోతారు. వాటిని అదుపులో వుంచుకోవాలి. కుళ్ళుబుద్ధుల్ని లాగి పారెయ్యటం కాదు, పాతి పెట్టాల్సిందే. లేకపోతే అవి కంపుకొట్టటమే కాకుండా మంచి బుద్ధుల్ని కూడా చెడగొడతాయి. ముగింపులో మన జాతికి చక్కని పరిష్కార బోధన.

ముగింపులో గేయం నడక కూడా మారింది. ఇలా మారటం గేయం ముగింపుని సూచిస్తుంది కూడా. ఆద్యక్షర మైత్రి, అంత్యప్రాస ప్రతిభావంతంగా కూర్చబడినాయి. విశిష్ట నిర్మాణంతో పాటు అంతకన్న ముఖ్యమైన విశిష్ట భావాలను కూడా ఒకే ఒక్క గేయంలో ప్రతిపాదించగలిగిన సినారె అభినందనీయులు.

*(తెలుగు విద్యార్థి, ఫిబ్రవరి 1985)*

# ప్రథమ ప్రయోగకవి పఠాభి

కవిత్వాన్ని ప్రధానంగా మూడు రకాలుగా వర్గీకరించవచ్చు. మొదటిది ప్రభావ కవిత్వం. రెండవది ప్రసార కవిత్వం. మూడవది ప్రయోగ కవిత్వం.

జాతికి అవసరమైనప్పుడు నిర్మాణాత్మకమైన గొప్ప భావాలతో ముందుచూపుతో కొత్తదారిని చూపించగలిగేది ప్రభావ కవిత్వం. గురజాడ, శ్రీశ్రీ మొదలైన కవులు ప్రభావ కవులు. మరోమాటలో చెప్పాలంటే సాహిత్య చరిత్రలోని యుగకర్తలు ప్రభావ కవులన్న మాట.

ఇక ప్రసార కవిత్వం అంటే ఏంటో చూద్దాం. ప్రభావ కవిత్వం చూపిన దారిలో పయనిస్తూ ప్రజల్ని ఉత్సాహపరుస్తూ ముందుకు సాగే కవిత్వం ప్రసార కవిత్వం. దాశరథి, నారాయణరెడ్డి మొదలైన కవులు ప్రసార కవులు.

ఇక ప్రయోగ కవిత్వం మూడోది. భాషలో, ప్రక్రియలో, భావనలో కొత్తదనం కోరుకునే మనస్తత్వం గల కవులు కొందరుంటారు. నలుగురూ నడిచే బాటలో నడవటం కన్నా సొంతబాట ఏర్పాటు చేసుకోవటం వీరికి బాగా ఇష్టం. ఇలాంటి కవులు రాసే కవిత్వం ప్రయోగ కవిత్వం. "ఫిడేలు రాగాల డజన్" రచించిన పఠాభి అలాంటి ప్రయోగకవి. పఠాభి పూర్తిపేరు తిక్కవరపు పట్టాభి రామిరెడ్డి.

## ఫిడేలు రాగాల డజన్

ప్రయోగాలకు కాలం చెల్లిందని కొందరు విమర్శకులు అనటం న్యాయం కాదు. శాస్త్రవేత్తలు ఎన్నో ప్రయోగాలు చేస్తేనే ఒక గొప్ప ప్రయోజనం, ఒక కొత్త పరిశోధన జాతికి లభిస్తాయి. చేసిన ప్రయోగాలన్నీ అద్భుత ప్రయోజనాల్ని అందించలేక పోవచ్చు. అరుదుగా లభించే అద్భుత ప్రయోజనాల కోసం అనంతంగా ప్రయోగాలు చేస్తుంటారు శాస్త్రవేత్తలు. అలాగే కవిత్వంలో కూడ ప్రయోగ కవులు ప్రయోగాలు చేస్తుంటారు. అందులో మంచి ప్రయోజనాలుంటే తరువాత కవులు వాటిని ఉపయోగించుకొంటారు. ప్రయోగాలలో ఉపయోగం లేని వ్యర్థ పదార్థాలను వదిలేసుకొంటారు. కవిత్వంలో పఠాభి చేసిన ప్రయోగం "ఫిడేలు రాగాల డజన్" అనే కవితల సంపుటి తెలుగులో ముద్రింపబడిన తొలివచన కవితల సంపుటి.

ఈ ప్రయోగ కవిత్వం నిండా అన్నీ అద్భుతమైన విజయాలే లేకపోయినా కొన్ని మంచి ధోరణులు తరువాత కవులకు మార్గదర్శకమైనాయని చెప్పటంలో అసత్యం ఉండబోదు. ప్రయోగాలలోని నిర్మాణాత్మక అంశాలను వదిలి కేవలం చీకటి కోణాలను మాత్రమే దర్శించగలిగిన విమర్శకులు "ఫిడేలు రాగాల డజన్" కవితల్ని "రాగాల డజను కాదు, దీన్ని 'రోగాల డజన్' అనాలి" అని బెజవాడ రామచంద్రారెడ్డి ప్రభృతులు తొందరపడ్డారు.

1930 - 40 ల మధ్య భావకవిత్వం మీద తిరుగుబాటు చేసి కొత్త ప్రయోగాలు చేసిన కవులు శిష్ట్లా ఉమామహేశ్వరరావు, శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు, పఠాభి ముఖ్యులు. భావ ప్రధానంగా తిరుగుబాటు చేసిన వారు శ్రీశ్రీ, నారాయణబాబు. ఛందస్సు ప్రధానంగా తిరుగుబాటు చేసినవారు శిష్ట్లా, పఠాభి.

పఠాభిపై ఫ్రాయిడ్ ప్రతిపాదించిన సెక్సు ప్రభావం చాలా ఉంది. అలాగే వాల్ట్ విట్మన్ వచన గేయాలకు బాగా ప్రభావితుడైనాడు పఠాభి. ఇంకా పాశ్చాత్య సాహిత్యంలోని సర్రియలిజం ధోరణులు. పాశ్చాత్య కవుల చమత్కార "గమ్మత్తులు", పఠాభిని బాగా ఆకర్షించాయి. సీత, ఆ రోజు, నవ్యస్త్రీ, కామాక్షి కోక అనే నాలుగు కవితలలో ఎలాంటి అచ్ఛాదన లేని కామోద్రేకాన్ని వర్ణించాడు పఠాభి. ఈ నాలుగు కవితలే పఠాభిలోని మంచి లక్షణాల్ని చూడడానికి విమర్శకులకు అడ్డంగా నిలబడుతున్నాయి. "మతి చెడిన యువకుని ఉన్మత్త ప్రలాపాలు పఠాభి కవిత" అని కవి కోకిల దువ్వూరి రామిరెడ్డి విమర్శించారు. "సామాజిక చింతనమే రూపు మాసినపుడు వెలువడిన అహంభావ కవిత్వం"గా కె. వి. రమణా రెడ్డి పఠాభి కవిత్వాన్ని కొట్టి పారేశారు. కాని పఠాభి ప్రయోగాలకు ఆకర్షితులై పఠాభి కవితలలోని మంచి లక్షణాలను సాహితీ ప్రియులకు చక్కగా పరిచయం చేసినవారు ఆదర్శ సాహితీవిమర్శకులు ఆరుద్ర. అనుకరణ అసహ్యించుకొనే నవ కవిగా, కవిత్వంలో విచిత్ర సౌందర్యాన్ని ఆవిష్కరించే కొత్త కవిగా పఠాభిని శ్రీశ్రీ కూడా ప్రశంసించారు.

ఫిడేలు మన దేశానికి చెందిన వాద్యం కాదు. పాశ్చాత్యులది. ఆ ఫిడేలు మీద మన గాయకులు కర్నాటక సంగీతాన్ని చక్కగా పలికిస్తున్నట్లు, ఇంగ్లీషు కవితారీతుల్ని తెలుగులో ప్రదర్శించవచ్చనే ఉద్దేశంతో పఠాభి తన కవితల సంపుటికి "ఫిడేలు రాగాల డజన్" అని పేరు పెట్టి ఉంటారని నారాయణరెడ్డి భావన. "రాగాల డజన్" అంటే ఈ సంపుటిలోని పన్నెండు కవితలు. "విచిత్రమే సౌందర్యం, సౌందర్యమే విచిత్రం" అన్న ఆస్కార్‌వైల్డ్ అభిప్రాయాలకు దర్పణంగా నిలుస్తాయి.

"ఫిడేలు రాగాల డజన్"లో పఠాభి అంతవరకు ఆధిపత్యం చెలాయిస్తున్న గ్రాంథిక భాషపై తిరుగుబాటు చేశారు. ఛందస్సుపై తిరుగుబాటు చేశారు. సామాజిక దుస్థితుల్ని పట్టించుకోలేని అంతర్ముఖులైన కవులు రాస్తున్న భావకవిత్వం మీద తిరుగుబాటు చేశారు.

"నా యీ వచన పద్యాలనే దుడ్డు కర్రల్తో
పద్యాల నడుముల్ విరుగ దంతాను
చిన్నయసూరి బాల వ్యాకరణాన్ని

చాల దండిస్తాను ...

అనుసరిస్తాను నవీన పంథా, కానీ

భావకవిన్ మాత్రము కాను, నే

నహంభావ కవిని,"

అంటారు పఠాభి. మంచి పద్యానికి మరణం లేదు అనేది వాస్తవం. పద్యాల సంగతి అలా ఉంచితే ఈనాటి వచన కవితలలో కనిపించే అంతర్లయ, భావలయ, ఊపు, విరుపు మొదలైన గుణాలేవీ ఈ కవితలలో కనిపించవు. గ్రాంథిక రూపాలు, వ్యావహారిక రూపాలు చెట్టపట్టాల్ పట్టుకొని పోతుంటాయి. గ్రాంథిక భాషను ఎగతాళి చేయటానికే ఇలాంటి భాష వాడారు పఠాభి. "ఫిడేలు రాగం" అనే చివరి కవితలో అక్షరాలు రాయటంలో కూడా తిక్కవరపు వారు కొంత "తిక్క" మనస్తత్వాన్ని ప్రదర్శించారు. "అడ్డం తిరిగెన్ అవనీస్థలి" అన్న చరణంలో అవనీస్థలిలోని అక్షరాలను అడ్డం తిప్పి ముద్రించారు. అలాగే "తలక్రిందులైనది ధరణీతలమ్ము" అనే చరణంలో "ధరణీతలమ్ము" అక్షరాలను తిరగేసి ముద్రించారు. ప్రేమికులు అన్న పదాన్ని Premikulu అనే ఇంగ్లీషు భాషా వర్ణక్రమాన్ని అనుసరిస్తూ తెలుగులో పొల్లు అక్షరాలతో (ప్ర్ఏమ్ఇక్ఉల్ఉ) ముద్రించారు. వ్యక్తీకరణ వైచిత్రిమీద పఠాభికున్న మోజు ఎంత తీవ్రమైనదో ఈ ఉదాహరణలు నిరూపిస్తాయి. పఠాభిలోని ఈ చీకటి కోణాలను వదిలేసి తరువాత కవులకు మార్గదర్శకమైన మంచి లక్షణాలను పరిశీలించటం చాలా అవసరం.

తెలుగు కవిత్వంలో నగర జీవితాల చిత్రణ తొలిసారిగా ప్రవేశపెట్టినది పఠాభి. మన ప్రబంధాల్లో పురవర్ణన ఉండేది. మేడల్ని వేశ్యల్ని నాలుగు వర్ణాల వార్ని వర్ణించే వారే కానీ సామాన్యజనుల జీవిత చిత్రణ వాటిల్లో పెద్దగా కనిపించేది కాదు. పాశ్చాత్యుల నాగరికత ప్రభావంతో ఆధునిక విజ్ఞానం పెరిగిన కారణంగా మన దేశంలో నగర జీవితం యాంత్రికమైపోయింది. నగరం ప్రజలు కాలానికి బానిసలైపోయారు. "జాబిల్లి" అనే కవితలో మద్రాసు నగరంమీద కనిపించే చంద్రుణ్ణి జనం పట్టించుకోవటం లేదని చాలా కొత్తగా గమ్మత్తుగా వర్ణిస్తారు కవి.

"తగిలింపబడి ఉన్నది జాబిల్లి

చయినా బజారు గగనములోన ...

ఏమారి గూడ నీవంక ఎవ్వరూ

కడగంటి చూపయిన పరపరోసీ శశీ !"

బస్తీల్లో ఉండేవాళ్ళు చందమామను సంవత్సరానికి ఒకసారైనా చూస్తున్నారా అనేది అనుమానం. ఈ బస్తీలోని పిల్లలకు పుస్తకాల్లో చందమామ కనిపిస్తుంది

కానీ నిజంగా చందమామను చూసి ఉంటారని చెప్పలేము. నగరజీవితాన్ని పఠాభి వర్ణిస్తూనే బలిసిపోతున్న డబ్బు విలువను ఆనాడే దుయ్యబట్టారు.

ముఖరింపుచున్నది మా కర్ణాలలో
గుండియలందు గూడ, వెండి రూపాయి
ఘలం ఘలా శ్రావ్య సంగీతము కర్ణపేయముగా
నిన్ను పోగొట్టుకున్న రూపాయిలాగైనా భ్రమింపరే ఎవ్వారు నిజంగా ...

అంటూ చంద్రుణ్ణే అడ్డం పెట్టుకొని నగర ప్రజల డబ్బు గొడవ నిరసించారు. ఇంకా ఎలక్ట్రికు దీపాల కాంతుల్ని, ఎలక్ట్రికు అడ్వర్టయిజుమెంట్ల రంగు రంగుల ఉన్మాద నగ్న నృత్యాల్ని వర్ణించారు. మద్రాసులోకి చంద్రుడు దరిబేసి గ్రామస్తుడిలాగ దారి తప్పి వచ్చాడని, దేబిరిస్తున్న చంద్రుడి పట్ల సానుభూతి చూపించారు. నగరం కాలం స్పీడును కూడా అద్భుతంగా వర్ణించారు పఠాభి.

"నీవు మాత్రం పదిహేను రోజుల్లోన గాని
నీ రూపాన్నంతా మార్చుకోలేవు
చాలా కాలం, చాలా ఆలస్యం.
ప్రజాదృష్టిని ఆకర్షించటంలో,
మార్కట్లోని దుస్సాధ్య కాంపిటిషన్‌కు నీవు
తట్టుకోలేవు జాగ్రత్త సుమా"

అంటూ పెరిగిపోతున్న కాంపిటేషన్ ప్రపంచాన్ని ఆనాడే పఠాభి అక్షరబద్ధం చేశారు. ఇంకా పఠాభి మరీనా బీచ్‌ని గురించి, ఆక్వేరియం హోటళ్ళ గురించి "గోల్డు ప్లేకు పొగ కరల్సు" గురించి, అమెరికన్ కార్ల గురించి, అమెరికన్ స్త్రీల గురించి, శరీరాన్ని అమ్ముకొనే అభాగినుల గురించి వర్ణించారు.

సమాజంలోని వివిధ వృత్తుల్లో ఉన్న వారిని గురించి కవిత్వం రాయటం అనే ధోరణికి కూడా శ్రీకారం చుట్టిన ఘనత పఠాభిదే. "పోలీసు" అనే కవితలో నాలుగు రోడ్ల కూడలిలో ట్రాఫిక్ పోలీసు డ్యూటీని అద్భుతంగా వర్ణించారు. "భరతనాట్యం బాడుచున్న ప్రశాంత ప్రకాశ ముఖంబుతోటి నటర్షి చూడామణిలాగ..." పోలీసు కనిపించాడు పఠాభికి.

"ప్రచండాతి ప్రచండ ఘోరాతి ఘోర
తీవ్రాతి తీవ్ర తపస్సుం
జేయుచున్నాడో నిష్ఠతోడన్ ...
మహాశక్తి సంపన్నుండగు యోగి ...
పోలీసు భటుణ్ణే చాలా నేను

స్తుతి చేస్తాను. బలే గౌరవిస్తాను
యింకా ముగ్ధుండనయి పోతాను కూడ
వాని భరత నాట్యంబును చూచ్చూడ"

ఇలా ప్రత్యేకమైన అంశాలమీద కవిత్వం రాయటం ఈనాటికీ ఫ్యాషన్‌గానే ఉన్నది. గూర్ఖావాడి మీద, పాకీ పిల్లమీద, సోడాబండి వాడి మీద ... ఇలా ఎన్నో అంశాల మీద మన వచన కవులు ఇప్పుడు కూడా కవితలు రాస్తూనే ఉన్నారు.

పడుపు వృత్తిలోని వాళ్ళను గురించి పఠాభి వర్ణించారు. కానీ ఆ వృత్తిలోని కన్నీళ్ళ జాలును గమనించలేదని కె. వి. రమణారెడ్డి పఠాభిని విమర్శించారు. ఇది సత్యం కాదు. పడుపు వృత్తిలో దయనీయమైన స్థితిని అనుభవిస్తున్న అభాగినుల్ని ఇలా వర్ణించారు.

"ఓ బోగం చానా ! నీవు
సంఘానికి వేస్టు పేపరు బాస్కటువా ?
మష్టు మషాణము పడవేయబడునట్టి దిబ్బవా"

ఇలా అన్నారంటే పఠాభికి భోగం చానల మీద సానుభూతి ఉన్నట్లే. అందుకే "రక్తంలేని వారి అధరాలపయి, అంటుకోనియున్నది మాసిన హాసరేఖ" అని అనగలిగారు. పడుపువృత్తి పడతికన్నా మిగతా ప్రపంచమంతా అబద్ధం అని భావించారు పఠాభి.

"నిన్ను గవురవిస్తున్నా నేను
నీలోన నాకు జీవితం నిజంగా
సరిగ్గా ప్రతిఫలిస్తున్నది
ఇతర స్థలాలలోన
అంతా బూటకం అంతా నాటకం గొప్ప అబద్ధం
పూజారి యబద్ధం
పురుషుని జూచి తలవ్రాల్చే
పతివ్రత సతీత్వ మబద్ధం
యోగులబద్ధం, అందరూ అబద్ధం
సర్వమబద్ధం
కానీ నీవు మటుకు ఓ బోగంచానా !
ముసుగులేని నిష్ఠురమగు నిజానివి
నీడపడనటువంటి నిర్మలమగు నిజానివి"

వాల్ట్‌విట్‌మన్ వచన పద్యాల్ని ఎన్నోసార్లు తనివితీరా చదువుకొన్న తన మీద

శ్రీశ్రీ, చలంల ప్రభావం కూడా ఉందని పఠాభి చెప్పుకున్నారు. పఠాభి వచన గేయాలు రాయటంలో ఎంతో వర్ణనా వైచిత్రి ప్రదర్శించారు. సొంత గొంతుక ఉన్నకవిగా పఠాభి కన్పిస్తారు. పఠాభి సొంత గొంతుకను రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. మొదటిది వర్ణనావైచిత్రి, రెండోది శబ్దవైచిత్రి. ముందు పఠాభి వర్ణనావైచిత్రిని గమనిద్దాం. ఆయన తన కవితలలో ఎంగిలి ఉపనామాలు వాడలేదు.

"పాడనారంభించింది రేడియో
సముద్రం పక్కన సముద్రం లాగా"

రేడియో పాట సమద్రంలాగా సముద్రంతో పోటీపడుతుందని పఠాభి భావన. మంచి కవిత్వం ఉన్న ఇలాంటి వాక్యాలు చాలాచోట్ల కన్పిస్తాయి. రాత్రిని ఎందరో కవులు ఎన్నో రకాలుగా వర్ణించారు. "రంగులు నలుసులుగల నల్లతారు లాగ" అంటూ రాత్రిని సరికొత్త రీతిలో వర్ణించారు.

"మహానగరము మీద మబ్బుగమి గర్జిస్తున్నది -
దేవుని ఏరోప్లేనులో భువికి దిగుచున్నట్టుల"

అంటారు కవి. ఆలోచిస్తే ఇందులో గంభీర భావాలు పట్టుకోవచ్చు. విమానం దిగేటప్పుడు పెద్దగా శబ్దం చేస్తూ ఉంటుంది. వర్షం పడేటప్పుడు ఉరుములు కూడా అలాగే పెద్దగా శబ్దం చేస్తూ ఉంటాయి. కేవలం కొత్తదనమే కాకుండా మంచి ఔచిత్యం ఉన్న ఉపమానం ఇది. నల్లమబ్బుల గుంపును "పాతబడినటువంటి బస్సులలాగా బడబడయనుచున్నవి" అంటారు పఠాభి. ప్రయాణవేగం తక్కువే అయినా పాత బస్సు ఒకటే మోత. కురిసే వర్షం తక్కువే అయినా మబ్బుల ఆర్భాటం ఎక్కువని చమత్కరించారు పఠాభి.

"ప్రాచీదిశ సూర్యచక్రం రక్తవర్ణంతో
కన్పట్టింది, ప్రభాతరేజరు
నిసినల్లని చీకట్ల గడ్డంబును షేవ్
జేయన్ పడిన కత్తిగాటట్టుల"

చీకట్లను గడ్డంతో పోల్చటం నవ్యత. ఈ చీకట్ల గడ్డాన్ని ప్రభాత రేజరుతో షేవ్ చేసుకుంటుంటే పడిన కత్తిగాటులా ఉన్నాడట సూర్యుడు. అద్భుతమైన, అనన్యమైన పఠాభి వర్ణనానైపుణ్యానికి ఈ చరణాలు సాక్ష్యాలు. నవ్య స్త్రీని వర్ణిస్తూ

"క్రాస్వర్డు పజిల్సులాగున్న
నీ కన్నులను సాల్వుజేసే మహాభాగ్యం
ఏ మానవునిదోకదా!" అన్నారు

స్త్రీ హృదయం గెలవటం అనుకొన్నంత తేలిక కాదని, క్రాస్‌వర్డు పజిల్సులా

ఆసక్తి ఉంటే పెద్ద కష్టం కూడా కాదని పఠాభి ధ్వని.

**"నాకు విచిత్రంబగు భావాలు కలవు,**

**నా కన్నులందున టెలిస్కోపులు**

**మయిక్రాస్కోపులున్నవి."**

కన్నుల్లో టెలిస్కోపులు ఉన్నాయనటంలో కవిగా తనకు దూరదృష్టి ఉన్నదని, మైక్రోస్కోపులున్నాయనటంలో బాగా ఆలోచించగలిగే సూక్ష్మదృష్టి ఉన్నదని పఠాభి ఉద్దేశాలు.

ఇక పఠాభి శబ్దవైచిత్రి గమనిద్దాం. తెలుగు పదాల్ని, ఇంగ్లీషు పదాల్ని కలిపి సమాసాలు చేసేశా రాయన. దుస్సాధ్యం, కాంపిటేషన్ అనే రెండు మాటల్ని కలిపి "దుస్సాధ్య కాంపిటేషన్" అని అన్నారు. ఇలాంటిదే మరో సమాసం 'హంగ్రీ కనులు". అలాంటిదే "ప్రభాత రేజరు" కూడా. హంసయాన, గజయాన మొదలైన సమాసాలతో పోటీపడేటట్లు హైహీలు చెప్పుల నడక గలిగినది అనే అర్థంలో "హైహీలు యాన" అనే సమాసాన్ని అద్భుతంగా సృష్టించారు. ఈ కొత్త సమాసాలు వినటానికి ఇంపుగా కూడా ఉండి అర్థాల్ని బాగా స్పష్టం చేస్తున్నాయి.

పఠాభి 'ఫిడేలు రాగాల డజన్' కవితల్ని శ్రీశ్రీకి చూపించారు. శ్రీశ్రీ సలహాతో 1939 ఆగష్టులో ముద్రించబడిన ఈ పుస్తకం బయటకు రాగానే సాహిత్యలోకంలో గొప్ప సంచలనం రేపింది. ఇటువంటి కవిత్వాన్ని అప్పటిదాకా దేశం చూడలేదు. నగర జీవన చిత్రణలో, నిర్దిష్ట విషయాన్ని కవితలుగా మలచటంలో, వర్ణనావైచిత్రిలో తరువాత కవులకు మార్గదర్శకమైనది ఈ "ఫిడేలు రాగాల డజన్" వచన కవితల సంపుటి. ఈ వచన కవితల సంపుటి ముద్రించిన తరువాత చాలామంది వచన కవితలు రాయటం, వాటిని పుస్తకాలుగా ముద్రించటం బాగా ఊపందుకున్నాయి.

పఠాభి కవితల్లో కాముక ప్రవృత్తి కన్పిస్తుందన్న విమర్శలు నిజమే. కానీ వ్యక్తిగా ఆయన అభ్యుదయవాది అనే విషయాన్ని విమర్శకులు విస్మరించకూడదు. బెంగాలీ తల్లికి, తమిళ తండ్రికి పుట్టిన బిడ్డ స్నేహలతను వివాహం చేసుకున్న ఆదర్శం పఠాభిది. కవిత్వంలో ఆదర్శాలు చెబుతూ జీవితంలో ఆచరణలేని కవులకన్నా పఠాభి చాలా మెరుగు.

శాంతి నికేతన్‌లో పఠాభిపై పడిన టాగూర్ ప్రభావం తాత్కాలికమైనదే. స్వాప్నికత నుండి వాస్తవికతలోకి వచ్చిపడేలా సమాజం ఆయన్ని మార్చివేసింది. దేశంలోని దరిద్రం, వెర్రితలలు వేస్తున్న వ్యాపార నాగరికత, వ్యాపార వస్తువైపోయిన స్త్రీల దుస్థితి, యూరప్‌ను కమ్ముకొన్న యుద్ధ మేఘాలు... వగైరా విషయాల వలన కలిగిన అశాంతిలో "ఫిడేలు రాగాల డజన్" ప్రచురించారు పఠాభి. అమెరికా నుండి

తిరిగి వచ్చాక రామ్ మనోహర్ లోహియాను కలుసుకొని సోషలిజం వైపు మళ్ళారు కానీ ఆ పార్టీలో చేరలేదు. ఆయన ఎప్పుడు ఏ పార్టీలోనూ మెంబరు కాలేదు. కల్చరల్ వింగ్‌లో మాత్రం పఠాభి, ఆయన భార్య స్నేహలత మెంబర్లుగా పనిచేశారు. ఎమర్జన్సీ కాలపు నియంతృత్వ ప్రభుత్వం జైలులో పెట్టిన హింసలవల్ల తరువాత అనారోగ్యానికి గురై ఆమె కన్నుమూసింది.

పఠాభి కుటుంబ మంతా రాజకీయ కుటుంబమే. ఆయన తల్లిదండ్రులు, ముగ్గురు సోదరీమణులు స్వతంత్రోద్యమంలో జైలుకి వెళ్ళినవారే. అప్పట్లో అమెరికాలో ఉండటంవల్ల పఠాభి జైలుకి వెళ్ళటం జరగలేదు.

బాల్యం నుండి పఠాభికి కవిత్వం పట్ల ఆసక్తి ఉండేది. పఠాభి రాసిన మొదటి కవిత "జమీన్ రైతు"లో 1932/33 ప్రాంతంలో ప్రచురించబడింది. అప్పుడు పఠాభి వయస్సు పదమూడో, పద్నాలుగో. ఆ కవితలో తేటగీతులు, ఆటవెలదులు, కందం వగైరా రకరకాల పద్యాలు ఉన్నాయి. శ్రీశ్రీలాగే పఠాభి కూడా పద్యాలతోనే కవిత్వం ప్రారంభించాడు. "ఫిడేలు రాగాల డజన్" రాయడానికి కారణాలు రెండు - భావ కవిత్వానికి రెండోవైపు కూడా చూపించాలనేది ఒకటి, డిఫరెంట్ అయినదేదో చేయాలనేది రెండో కారణం. "ఫిడేలు రాగాల డజన్" తరువాత పఠాభి ప్రచురించిన కవితల సంపుటి పేరు "నీలగిరి నీలిమలు" (1950). 1977లో "కయిత నా దయిత", 1980లో "పఠాభి పన్‌చాంగం" ప్రచురించారు.

మొదటి సారి దర్శకులై సొంతంగా నిర్మించిన కన్నడ సినిమా "సంస్కార" పఠాభికి రాష్ట్రపతి స్వర్ణపతకం తెచ్చిపెట్టటంతోపాటు అంతర్జాతీయంగా కూడా మంచి గుర్తింపు తెచ్చింది. "చండమారుత" "శృంగార మాస" సినిమాలు కూడా ఆయన తీసినవే.

## పఠాభి పన్‌చాంగం

"పన్నులలో సంపన్ను"డని పఠాభిని ఆరుద్ర అభివర్ణించాడు. పన్నులు అంటే ఇంగ్లీషులో రెండర్థాల మాటలు. "పఠాభి పన్‌చాంగంలోని పసిడిపలుకుల "విటమిన్-బి గుళికలను రోజుకొకటి చొప్పన సేవిస్తే తెలుగువాడి మనస్సుకి ఆరోగ్యము, ఉల్లాసము సిద్ధిస్తాయని నేను గ్యారంటీగా చెప్పగలను" అంటూ శ్రీశ్రీ పఠాభి పన్‌చాంగం (1980)కు ముందుమాట రాస్తూ పఠాభి చమత్కారాలను మెచ్చుకున్నారు.

"ద్రవ్యం యావత్తూ పోయింది ద్రవంలాగా"

ద్రవ్యం అనే పదంలో ఉన్న యావత్తు పోయి ద్రవం అయిందని ఒక అర్థం, ద్రవ్యం (డబ్బు) యావత్తూ (అంతా) పోయింది ద్రవం (నీరు) లాగా అని మరో అర్థం. ఇలాంటి "పన్"లతో కూడినది పఠాభి పంచాంగం. జనవరి నుండి డిసెంబరు దాకా పన్నెండు శీర్షికలున్నాయి. ఇందులో ఒక్కోనెలకు ఎన్ని తేదీలుంటాయో అన్ని "పన్"లు

ఉన్నాయి. ఒక సంవత్సరాన్ని స్ఫురింపజేసే విధంగా "పన్"లు ఉన్న సంపుటి కాబట్టే పన్‌చాంగం అని పేరు పెట్టారు.

"ఈనాడు వ్యాకరణంలోనే కాదు
అంతర్జాతీయ వ్యవహారాల్లో కూడా
సంధులు పాటించబడటంలేదు"

ఈనాటి వ్యావహారిక భాషలో వ్యాకరణ సంధులు పాటించబడటం లేదని ఒక అర్థం. అంతర్జాతీయ విషయాలలో శాంతికోసం ముందుగా నిర్ణయించుకున్న సంధులు పాటించబడటంలేదని మరో అర్థం.

"పారిశ్రామిక నాగరికత అంతా
వట్టి అయోమయం"

పారిశ్రామిక నాగరికత ఎటుపోతుందో అర్థంకాకుండా అయోమయంగా ఉందని ఒక అర్థం. పారిశ్రామిక నాగరికత అంటే ఇనుము, ఉక్కు పరిశ్రమలని (అయో, మయం - ఇనుముతో కూడినది) మరో అర్థం. ఇలాంటివి ఎన్నో ఇందులో ఉన్నాయి.

"దంతి కన్నా వదంతి పెద్దది"
"విప్పటకు వీలు కానిది ప్రేముడి"
"కరగ్రహణానికి ముందు, వేలు కావాలంటాడు ఈనాటి యువకుడు"
"ముందుగా పూజించేది వెనకయ్యను"
"హృదయములో దయవున్నది"
"స్త్రీని కొలిచేది ప్రియుడున్నూ, దర్జీయున్నూ"
"ఎన్నికలలో అంతా ఓటుమాటలేను"
"ఏ ఆఫీసుకు పోయినా దక్షిణ లేనిదే ఉత్తరం లేదు"
"బర్త్ కంట్రోలుకు ముఖ్యం భర్త కంట్రోలు"
"కారు కన్నా స్పీడు పుకారు"

## కయిత నాదయిత

"ఫిడేలురాగాల డజన్" (1939) లో ఛందస్సుపై తిరుగుబాటు ప్రకటించిన పఠాభి 1977లో ప్రచురించిన "కయిత నాదయిత" అనే కవితల సంపుటిలో గేయ ధోరణి కన్పిస్తుంది. 1953లో చేతన సాహితి ప్రచురించిన ఆధునిక కవితా సంపుటి "కల్పన"లో పఠాభి కవిత "మృణాళిని" కన్పిస్తుంది. అప్పటికే ఛందస్సుతో కొంత రాజీపడినట్లు పఠాభి కన్పిస్తారు.

"మృణాళినీ! నీ చూడ్కులు చంద్ర కి
రణాలనీ, నీతోనుండు గంటలు

క్షణాలనీ, నీ నవ్వులు తాపహ
రణాలనీ,...."

"జవరాలా!
కనుమూసీ, నను దీసీ
నా వాసన నలిపేసీ
జవలారా, కనుమూసీ - అది చాలును
నాకు సుఖం, నాక సుఖం
అమిత సుఖం, సుఖం సుఖం
అది చాలును నాకు సుఖం"

ఛందస్సు మీద, ప్రాసల మీద, అనుప్రాసల మీద పఠాభికి ఆసక్తి పెరిగినట్లు ఈ కవిత నిరూపిస్తుంది. 6+6 మాత్రలుగా సాగినవి కొన్ని పాదాలు. ఇవి ఆయనకు మాత్రా ఛందస్సుపై పెరిగిన మక్కువను చూపిస్తాయి. 2000 ఫిబ్రవరి "రచన" పత్రికలో పఠాభితో చేసిన ఇంటర్వ్యూలో ఆయన కొన్ని కొత్త సంగతులు చెప్పారు. శ్రీశ్రీలాగే పఠాభి కూడా ఫిడేలు రాగాల డజన్ రాయకముందు పద్యాలు రాసారు. అపుడు ఆయన వయస్సు పదమూడో, పద్నాలుగో. రాసిన కవిత్వం వంద సంవత్సరాల తరవాతైనా మిగలవచ్చు కాని తీసిన సినిమా మిగలకపోవచ్చునని సినిమాకన్నా కవిత్వానికే పెద్దపీట వేశారు పఠాభి. మనుచరిత్ర, దువ్వూరి పానశాల, శ్రీశ్రీ మహాప్రస్థానం ... పుస్తకాలను తిరిగి తిరిగి చదువుకుంటూ ఉంటానని ఆయన చెప్పటం విశేషం. కమ్యూనిస్టు పార్టీలో కవికి భావ స్వాతంత్ర్యం ఉండదంటారు ఆయన. "సంప్రదాయం తన రక్షణ తాను చూసుకోగలదు. కవులు ఆ పని చెయ్యక్కర లేదు, యువకవులు సంప్రదాయాన్ని ఎదుర్కోవాలి. అది చాలా అవసరం" అన్నారు పఠాభి.

శ్రీశ్రీకి వచన కవిత సరిగా పట్టుబడలేదని విమర్శకు అన్నారు. కవికొండల రచనల్లో, శిష్ట్లా రాసిన "విష్ణుధనువు", "నవమి చిలుక" సంకలనాల్లో వచన కవితారూపం ప్రయోగాత్మకంగా మొదలైనా పఠాభి, నారాయణబాబు - ఈ ఇద్దరూ ప్రామాణిక వచన కవిత రాశారు. ఈ ఇద్దరిలో ఎవరు ముందో తేల్చటం కష్టం. పఠాభి "ఫిడేలు రాగాల డజన్"లో వచన కవిత రూపం వీలైనంత స్వస్వరూపానుసంధానం చేసుకొన్నదని కోవెల సంపత్కుమారాచార్య భావన.

*(ఏ.పి.పి.ఎస్.సి. ఉద్యోగ సమాచారం, డిసెంబర్ 2000)*

# తెలుగులో దళిత కవిత్వ ఉద్యమం

ఆధునిక కవిత్వంలో భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వం, విప్లవ కవిత్వం వగైరా ఉద్యమాలు వచ్చాయి. అమలిన శృంగారం, ప్రకృతి చిత్రణ, భక్తి స్మృతి మొదలైన లక్షణాలతో భావకవిత్వ ఉద్యమం కొనసాగింది. ఆ తరువాత మార్క్సిజం ప్రభావంతో సమాజంలోని సమస్యలు, మధ్య తరగతి మానవుల అవస్థలు, తాడితులు పీడితుల స్థితి గతులు, సమ సమాజ స్థాపన... అనే లక్ష్యాలతో అభ్యుదయ కవిత్వం పరిఢవిల్లింది. అక్కడ నుంచి మార్క్సిజం, లెనినిజం - మావో ఆలోచనా విధానాలతో ఒక చేత పెన్ను, మరో చేత గన్ను పట్టుకొని దోపిడీదారులపై భూస్వాములపై ధ్వజమెత్తుతూ సమసమాజ హంస ఉదయించటానికి పరిస్థితిని బట్టి హింసయినా అవసరమేనని నమ్ముకొని వచ్చిన ఉద్యమం విప్లవ కవిత్వం. విప్లవ కవిత్వం తరువాత రకరకాల ఉద్యమాలు, రకరకాల ధోరణులు తెలుగు కవిత్వంలో చోటు చేసుకుంటున్నాయి. విప్లవ కవిత్వం తర్వాత వచ్చిన ఉద్యమాలలో దళిత కవిత్వ ఉద్యమం చాలా చారిత్రక ప్రాధాన్యం కలిగిన ఉద్యమం.

ఇప్పటి దాకా ప్రజాసాహిత్యంగా చెలామణి అయిన అభ్యుదయ రచనలు దళితుల ప్రధాన సామాజిక వాస్తవాన్ని వ్యక్తం చేయలేదని, అధికశాతం ప్రజానీకపు ప్రత్యేక సమస్యలను గుర్తించలేదని, ప్రముఖ సాహిత్య విమర్శకులు జి. లక్ష్మీ నరసయ్య అభిప్రాయం. అభ్యుదయ రచనల దృష్టిలో పీడితులంటే ఆర్థికంగా అణచివేతకి గురయ్యేవాళ్ళు, అసమానతకు బలయ్యేవాళ్ళు. కానీ దళిత కవిత్వం దళితుల ఆర్థిక స్థితిగతులతో పాటు వారి సాంఘిక, సాంస్కృతిక దుస్థితులను, వాటి మూలాన్ని అవగాహన చేసుకొని దళితుల ఉన్నతి కోసం ముందుకు దూసుకువచ్చిన ఉద్యమం. దళితుల ప్రత్యేక సమస్యలను గొంతెత్తి చాటుతున్నది దళిత కవిత్వం. తాతముత్తాతల నాటి నుంచి అనుసరిస్తున్న అంటరానితనాన్ని ప్రశ్నిస్తూ కులంపేరుతో, మతం పేరుతో దోపిడీకి పీడనకు అణచివేతకు, అవమానాలకు అసమానతలకు గురవుతున్న దళితుల ఆగ్రహం దళిత కవిత్వంలో కన్పిస్తున్నది. ప్రతిభ పేరుతో జరిగే కుటిల ప్రయత్నాలను ఖండిస్తున్నది. అంతేగాదు - కుహనా మార్క్సిస్టులను కూడా విమర్శిస్తూ వాళ్ళచేతుల్లో మోసపోయిన దళితుల జీవిత గాథలను విపులీకరిస్తున్నది.

మహారాష్ట్రలోని దళిత పాంథర్స్ సాహిత్య ఉద్యమం, అమెరికన్ నల్లజాతి సాహిత్యం ఇంకా దక్షిణ ఆఫ్రికా సాహిత్య ప్రభావం కూడా దళిత కవిత్వంపై ఉన్నదని విమర్శకులు భావిస్తున్నారు. మార్క్సిజం, అంబేద్కరిజంలకు సంబంధించిన ఒక సాధారణ తాత్త్విక భూమిక ఈ దళిత కవిత్వాని కేర్పడింది. దళితవాదం అంటే దేశీయ మార్క్సిజం అని ఎక్కువ మంది దళిత కవులు భావిస్తున్నారు. అంటే

దేశీయంగా అభివృద్ధి అయిన పూలే, అంబేద్కర్‌ల సిద్ధాంతాలను కలిపేసుకున్న మార్క్సిజం అని, అదే సరైన మార్క్సిజం అని ఎక్కువ మంది దళిత కవుల భావన. అందుకే ఇప్పుడు వస్తున్న అన్ని కవితా ధోరణులకన్నా దళిత కవిత్వం ఎక్కువ ఆధునికతను కలిగి ఉన్నదని చెప్పవచ్చు.

వెనుకబడిన కులాలు, హరిజనులు, గిరిజనులు ఇంకా ఇతర పీడిత కులస్తులతోపాటు అభద్రతా భావనకు లోనవుతున్న మైనారిటీల నుంచి వచ్చిన కవులు రాసినదే దళిత కవిత్వమని లక్ష్మీ నరసయ్య మొదలైన సాహిత్య విమర్శకులు భావించారు. ప్రస్తుతానికి అచ్చమైన దళిత దృక్పథంతో అగ్రకుల ప్రగతి వాదులు రాసిన కవిత్వం రాలేదని ఒక భావన. తమ కులాన్ని మతాన్ని కాదనుకొని దళితుల పక్షాన నిలబడి అగ్రకుల ప్రగతివాద కవులు కొంతమంది కవిత్వం రాసారు. కానీ ఈ కవిత్వాన్ని "మీడియేషన్ రోల్" నిర్వహించే కవిత్వంగా మాత్రమే భావించటం జరిగింది కానీ దళిత కవిత్వంగా భావించబడలేదు. దేశవిముక్తి భూవిముక్తికి సంబంధించిందని ప్రగతివాద రచయితలు ఇంతకు ముందు భావిస్తూ వస్తున్నారు. కానీ దేశ విముక్తి దళితుల విముక్తితో కూడా ముడిపడి ఉన్నదని దళిత కవులు గుర్తించారు. ఇలా 1985 తరువాత తెలుగులో ఉధృతంగా ముందుకు వచ్చిన దళిత కవిత్వ ఉద్యమం పాఠకుల ముందు ఎన్నో ఊహించలేనన్ని సత్యాలు బయట పెడుతోంది.

## దెబ్బతిన్న ఆత్మాభిమానం

కులం వల్ల అవమానం పొందిన దళితుని దెబ్బతిన్న ఆత్మాభిమానాన్ని ఎండ్లూరి సుధాకర్ ఇలా వర్ణిస్తున్నారు.

"నా మొలకు తాటాకు చుట్టి
నా నోటికి ఉమ్మిముంత కట్టి
నన్ను నలుగురిలో
అసహ్యమానవ జంతువుని చేసిన మనువు
నా నల్లని నుదిటి మీద బలవంతంగా
నిషిద్ధ ముద్ర వేసి నప్పుడే
నా జాతంతా
క్రమ క్రమంగా హత్య చేయబడింది.
ఇప్పుడు కొత్తగా చావటమేమిటి?"

పూర్వం వేదం వింటే దళితుల చెవుల్లో సీసం పోసేవారని, సంస్కృత భాష మాట్లాడితే నాలుక తెగ్గోసేవారని ... ఇలాంటి అనేక సంఘటనల కారణంగా నిరంతర అవమానాలతో దళితులు ఏనాడో హత్య చేయబడినారని, మామూలు హత్యల కన్నా

ఇలాంటి హత్యలు మరీ ఘోరమని కవి ఆవేదన.

ప్రతిభ పేరుతో దళితులు పొందే అవమానాల్ని సతీష్ చందర్ ఇలా చెప్పారు.

"తలెత్తి మీసాలు కాస్త మెలివేద్దామనుకున్నప్పుడు
'రిజర్వేషన్ గాళ్ళకి పౌరుషాలు కూడానా' అన్న
ఆఫీసులో అధికారి ప్రతిభ పాటవాలు అడ్డొచ్చి
భూతకాల వర్తమానాన్ని మింగలేక గుటకలు వేస్తాను"

భూతకాలం లాంటిదే వర్తమానకాలం కూడా. భూతంలాంటి వర్తమాన కాలంగా కూడా గ్రహించవచ్చు. రిజర్వేషన్లు ఎందుకు ఇచ్చారో అవగాహన లేని కువిర్శల్ని కవి చాలా సున్నితంగా ఎండగడుతున్నారు.

## మైనారిటీల ఆక్రోశం

ఈ దేశంలో మైనారిటీలుగా ఉన్న ముస్లింల అభద్రతా భావాన్ని ఖాదర్ మొహియుద్దీన్ ఇలా వ్యక్తీకరిస్తున్నారు.

"నేను పుట్టక ముందే
దేశ ద్రోహుల జాబితాలో
నమోదైవుంది నాపేరు
కన్న బిడ్డని సవతి కొడుకుగా
చిత్రించింది చరిత్ర
అన్నదమ్ముల్నించి చీల్చి
నన్ను ఒంటరి వాణ్ణి చేసింది చరిత్ర
పసి తనంలోనే
నన్ను పరిహసించాయి
పాఠ్య పుస్తకాలు"

దేశంలో ముస్లింలంటే దేశభక్తులు కాదనే అపోహ కొందరిలో ఉందనే వాస్తవాన్ని కవి చెప్తున్నాడు. భారతమాతకు హిందువులు బిడ్డలైనట్లుగానే ముస్లింలు కూడా బిడ్డలేనని కవి భావన. ముస్లింలను సవతిబిడ్డలుగా భావించటం తగదని ఆవేదన. "పుట్టి పెరిగిన దేశంలోనే నన్ను ఒక కాందిశీకుడిని చేయటం కుట్ర కాదు. పరిసరాల్ని వాతావరణాన్ని నాచుట్టూ విషపూరితం చేయటం కుట్ర కాదు. ఖండ ఖండాలుగా నరికి నిలువునా నన్ను నిర్మూలించి అఖండ భారతం నిర్మించాలని కలలు కనడం కుట్ర కాదు ..." అంటూ మైనారిటీలను సరిగా అర్థం చేసుకోలేని ఛాందసుల భావాల్ని వ్యంగ్యంగా ఎత్తి పొడిచారు కవి. అధికారం కోసం మతాల మధ్య చిచ్చు రగిల్చే దుష్ట రాజకీయాల్ని ఈ కవి నిరసించారు. పుట్టుకతో ప్రతి వాడికి

ఏదో ఒక కులమో మతమో తప్పని సరిగా వచ్చే ఈదేశంలో "పుట్టుమచ్చ" అనే పేరుతో ఈ కవి రాసిన కవిత సాహిత్య లోకంలో సంచలనం సృష్టించింది.

## విభజించే కుట్రల పట్ల నిరసన

మరో కవి చెరుకు సుధాకర్ దళితుల్ని ఏరకంగా పెద్దలు విభజించి పాలిస్తున్నారో ఈ క్రింద చెప్తున్నారు.

*''అనాదిగా నా దేశ ప్రజలు వర్గాలుగా వర్ణాలుగా*
*అడ్డంగా, నిలువునా విడదీయబడ్డదీ వాస్తవం*
*కులం అడ్డుగోడల్లో కూలివాడు : చీలిపోయిందీ వాస్తవం*
*రెక్కలమ్ముకునే వాళ్లంతా ఒక్కటిగా ఉండకుండా*
*చీల్చిన వాడి కుట్ర చిరకాలం కొనసాగుతోంది"*

అలాగే చాలా మంది చెప్పుకొనే "మెరిట్"ను కవి కొత్తగా నిర్వచిస్తున్నారు.

"అసమానతల విషవృక్షం బలిసి వర్ధిల్లే దేశంలో
మెరిట్ కొనుగోలు వస్తువైపోయింది.
పరాధీనమైన మెరిట్
మనల్ని పరాన్న జీవుల్ని చేస్తుంది."

డబ్బులున్న వ్యక్తి తన పిల్లల్ని మంచి కోచింగ్ సెంటర్లో పెట్టి వాళ్ళు మంచి ర్యాంకులు తెచ్చుకొనేలా ఖర్చు పెట్టగలుగుతాడు. డబ్బులేని దళితుల పిల్లలకు అలాంటి కోచింగ్‌లు లేకుండా మంచి ర్యాంకులు రావాలంటే సాధ్యం కాదనే వాస్తవాన్ని కవి ఇక్కడ నినదిస్తున్నాడు.

దళితుల్లో కూడా అంతర్గత విభేదాలు పెరుగుతున్న సంగతిని సతీష్ చందర్ "కలవని కనుపాపలు" గా విశ్లేషిస్తారు.

"రెప్ప వాల్చని కన్నుల్లా రెండు బావులు
ఒకటి : మాకు
రెండు : మా వాళ్ళకు
మధ్యలో ముక్కుమీద వేలేసుకున్న రోడ్డు
ఎవడో జల్సారాయుడు
వాడ క్కూడా
అంటరాని రోగం తగిలించాడు
పుట్టుమచ్చలేని కవలల్ని
పచ్చబొట్లతో వేరు చేశాడు
మాదీ మా వాళ్ళదీ
ఒకరి నొకరు చూసుకోలేని

కనుపాపల సహజీవనం

ఇద్దరు పంచముల కోసం రెండు బావులు

ఎందులో దూకినా ఒకటే చావు

మధ్యలో బుసలు కొడుతున్న రోడ్డు"

ఈ వ్యవస్థలోని విభజించి పరిపాలించే దుర్మార్గమే ఆ రోడ్డు. పశ్చిమ గోదావరి జిల్లా కొమ్ము చిక్కాల గ్రామంలో రెండు శాఖల దళితుల కోసం వేరు వేరుగా పక్క పక్కనే రెండు బావులు ఏర్పాటు చేసిన సంఘటనకు స్పందించి సతీష్ చందర్ రాసిన కవిత ఇది.

## ప్రపంచ మనుగడ అంటేనే దళితులు

దళితులు లేకపోతే ఈ ప్రపంచం మనుగడ లేదనే "చాటింపు" కవితలో టి. అంజయ్య ఇలా అంటున్నారు.

" మా తాతల బాకీలకు తాకట్టయి నోళ్ళం

మీ భూమిని నాగళ్ళై దున్ని నోళ్ళం

మీ పొలాలకు కాలవలై పాకినోళ్ళం

మీ పొలాల్లో నాటేసి, కలుపు దీసి, వరికోసినోళ్ళం

మమ్ముల్ని మీ పొలాల్లో పరిగేరు కోనియ్యరా ?"

"మా చెమటని ఉప్పుగా మార్చుకున్నామే గానీ

మీ ఉప్పు మేమేనాడూ తినలేదు

చర్మం వొలిచి చెప్పులు కుట్టటమే కాదు

డొక్క చీల్చి డోలు కొట్టేదీ మేమే ...

మేమెంత వెనకబడ్డ వాళ్ళమైనా

మేం ముందుంటేనే

మీ పెళ్ళిళ్ళు ఊరేగించబడతాయి

మీ శవాలు ఊరవతల బడతాయి"

సమాజం వేసే ప్రతి అడుగులోనూ దళితుల అవసరం ఉందని చెప్పటం కవి ఉద్దేశం.

## కులనాయకులకు హెచ్చరిక

వెనుకబడిన తరగతుల్ని ఉద్ధరిస్తామని ప్రగల్భాలు పలికే వెనకబడిన తరగతుల నాయకుల్ని మహమ్మదాలి ఎలా నిరసిస్తున్నారో చూడండి.

"మాదిగోల్లకి మాలోల్లకి తగిన పని జరిగిందని

కామందుల కాల్లకాడ గునిసే ఎనకబడ్డ తరగతి ఈరులారా !

'పెద్దకులం' ఎండమాయికి బెమిసి
కూడు గుడ్డకు నవిసే శూరులారా !
మేమెంతో - రేపు మీరంతే !"

కులపిచ్చి దురాత్ముల్ని, ధన అహంకార హీనాత్ముల్ని, దురహంకార దురాత్ముల్ని ఒక పట్టు పట్టడానికి కళ్ళు తెరిచి కదిలి రమ్మని, నిజం ఎరిగి వెనుకబడిన తరగతుల వికాసం కోసం కృషి చేయాలని కవి వెనుకబడిన తరగతుల నాయకులకు సూచిస్తున్నారు.

## స్పష్టంగా ప్రకటించిన తిరుగుబాటు

ఒక దళితుడు అధికారిగా వస్తే అతనికి జరిగే సన్మానం, అప్పుడు ఆ దళిత అధికారి మనోభావనలు "ఆత్మకథ"లో ఎండ్లూరి సుధాకర్ ఇలా వ్యక్తీకరిస్తున్నారు. "ఇప్పుడు నా మెడలో దండలు పడుతుంటే, నిన్నటి నా గాయాలు ఉలిక్కి పడుతుంటాయి" అంటూ గతంలో పొందిన అవమానాలు మరచి పోలేనంత తీవ్రమైనవిగా కవి భావిస్తున్నారు. "సభా వేదిక మీద నన్ను కూర్చోబెట్టినప్పుడు, ఊరి పొలిమేర దగ్గరే నిలబడ్డ నా తాత మొహం గుర్తు కొస్తున్నది. నా ముందు నీళ్ళు నిండిన గాజు గ్లాసులు పెట్టినప్పుడు మోకాళ్లపై వంగి నీళ్ళు తాగిన ఎడారి దృశ్యాలు వేడిగా తగులుతాయి. నా భుజాల చుట్టూ శాలువా కప్పుతున్నప్పుడు జాకెట్టు లేని నా జేజమ్మ మసకరూపం గుండెల్ని కోస్తూ ఉంటుంది" అంటూ దళితుల గతానుభవాల్ని ఎంతో బాధామయంగా కుప్ప పోస్తారు కవి. అందుకే ఈ చరిత్రను తిరగరాయాల్సినదేనంటూ దళిత కవులు ముందుకు వస్తున్నారు.

"ప్రతిఘటించాల్సిందే ఈ కర్ర పెత్తనాన్ని
ఛేదించాల్సిందే ఈ దాస్య శృంఖలాల్ని
ఎండగట్టాల్సిందే ఈ దోపిడీ సంస్కృతిని
ఇప్పటిదాకా జోడించిన మన చేతులు
అలవోకగా పిడికిళ్ళై లేవాల్సిందే"

అంటూ పి. సి. రాములు దుర్మార్గపు దోపిడీ వ్యవస్థను కూల్చాలంటున్నారు. ఇప్పుడు "నడుస్తున్న చరిత్ర" దళితులది, నడవబోయే చరిత్ర కూడా దళితులదే.

## పురాణ పాత్రలపట్ల కొత్త వైఖరి

పురాణాలలో, చరిత్రలోని అనేక సంఘటనల్ని దళిత కవులు దుయ్యబట్టారు. ఏకలవ్యుని బొటన వ్రేలుని గురుదక్షిణ కోరిన ద్రోణుడు వంటి గురువుల్ని వీరు నిరసిస్తారు. శంభూకుడ్ని వధించిన శ్రీరాముడ్ని విమర్శిస్తారు. బలిని పాతాళానికి తొక్కిన వామనుణ్ణి ప్రశ్నిస్తారు. దళితుల కళ్ళల్లో సూదులు గుచ్చి వారి నాలికలు తెగ్గోసిన మనుధర్మాలు అపహాస్యం చేస్తారు. ఇలాంటి దుష్ట సంఘటనలు చరిత్రలో

పునరావృతం కాకూడదని అందుకోసం "కొత్త నెత్తురుతో పాత చరిత్రను పునర్లిఖించక తప్పదు" అంటారు.

"ఇవ్వాళ నాది అగ్ని ముఖం
నా చేతులు వజ్రాయుధాలు
నేనిప్పుడు నడిచే ఖడ్గాన్ని
నన్నెవరు తాకలేరు
నేను నిద్రలేచిన పులిని"

అంటున్న దళితుడి చైతన్య భావాల సమాహారం దళిత కవిత్వం.

### గురువుల కులపిచ్చి ఖండన

విద్యాలయాలలోని కొందరు గురువుల కుల పిచ్చికి విద్యార్థులు బలైపోయిన సంఘటనలకు కూడా దళిత కవులు స్పందించారు. "నేను తెల్లముఖం వేసినప్పుడల్లా, మీరదేదో అమృత భాషలో తిట్టే వారు, మీకూ నాకూ ఉన్న తేడా, కులం కాల్చకుండానే కంపుకొడుతుంది కదండీ" అంటూ సంస్కారాన్ని పెంపొందించాల్సిన ఉపాధ్యాయులు సంకుచిత భావజాలంలో బందీలై విశాల విశ్వాన్ని ఏలుతున్నామనుకునే అజ్ఞానాన్ని దళిత కవిత్వం పాఠకులకు తేటతెల్లం చేస్తున్నది.

### వివిధ వృత్తుల వారి వేదనా సమైక్య గీతం

చేనేత పనివారి ఆకలి ఆక్రందనల్ని, బట్టలు ఉతికే వారి దయనీయమైన బాధల్ని, ఇంకా వివిధ వృత్తుల్లో ఉన్నవారి వేదనల్ని దళిత కవిత్వం వస్తువుగా గ్రహించింది. అగ్రకుల పెత్తందార్ల నాయకత్వాన్ని ప్రశ్నిస్తోంది. కులం ద్వారా సాంఘిక ఔన్నత్యాన్ని పొందుతున్న వాళ్లకు కులం అవసరం ఉంటుంది. కానీ కులం వల్ల సాంఘిక హైన్యతను అనుభవిస్తున్న దళితునికి కులంతో పనిలేదని లోతైన అవగాహనను కూడా దళిత కవిత్వం ప్రకటించటం విశేషం. "కుల బాధితుడిగా నేను కులాలు ఉండాలని ఏ కోశాన భావించటం లేదు" అనే శంబుక ప్రభృతుల కవితలు ఇందుకు నిదర్శనం. నాజూగ్గా దళితులు కనిపించక పోవటానికి కారణం వాళ్ళు శ్రమ చేయటమేనని, అందంగా నాజూగ్గా అగ్రకులాల వాళ్ళు కనిపించటానికి కారణం శ్రమ చేయకుండా శ్రమను అనుభవించటమేననే సామాజిక వాస్తవాల్ని దళిత కవిత్వం ప్రజలను ఆలోచింపచేస్తుంది. విముక్తి పేరుతో, సమసమాజం పేరుతో దళితుల చేత ఎర్రజెండాలు మోయించిన పెత్తనాలను కూడా దళిత కవిత్వం ఎండకడుతోంది. "ధర్నాలు, పికెటింగ్‌లు, ఊరేగింపులకు దళితులే కావాల్సివస్తారా", అని దళిత కవులు ప్రశ్నిస్తున్నారు. ఇంత కాలం దళితులు మోసపోయారని, ఇక మోసపోయేది లేదని దళిత కవిత్వం స్పష్టంగా చెపుతోంది.

ఆధునిక తెలుగు కవిత్వంలో 20వ శతాబ్దం ప్రారంభం నుంచి హరిజనుల అభ్యుదయం గురించి కవిత్వం వచ్చిన మాట కాదనలేము. గాంధీజీ రాజకీయ రంగప్రవేశానికి ఒక దశాబ్దకాలం ముందే హరిజనుల అభ్యుదయాన్ని ఆకాంక్షిస్తూ అక్కడక్కడ కొన్ని పత్రికల్లో కవిత్వం వచ్చిన మాట కూడా నిజమే.

"మంచి చెడ్డలు మనుజులందున
ఎంచి చూడగ రెండె కులములు
మంచియన్నది మాలయైతే
మాల నేనవుదున్"

అంటూ గురజాడ అప్పారావు కూడా హరిజన అభ్యుదయ కవిత్వం పండించారు. త్రిపురనేని రామస్వామి చౌదరి సూతపురాణంలో వర్ణాశ్రమ ధర్మ ఖండనతోపాటు, హరిజనాభ్యుదయ దృష్టిని ప్రదర్శించారు. అలాగే గరిమెళ్ళ సత్యనారాయణ, బసవరాజు అప్పారావు, పురిపండా అప్పలస్వామి, కరుణశ్రీ ఇంకా మరి కొందరు హరిజనేతర కవులు హరిజనాభ్యుదయ కవిత్వాన్ని రచించారు కూడా. ఇలా వచ్చిన కవిత్వమంతా హరిజనాభ్యుదయ కవిత్వంగా గుర్తించబడింది. దళిత కవిత్వానికి ప్రోత్సాహకంగా పనిచేసింది. ఈ హరిజనాభ్యుదయ కవిత్వం దళితుల సమస్యల్ని ఉపరితల పరిశీలన మాత్రమే చేసింది. కానీ దళితుల సమస్యల్ని లోతుగా అవగాహన చేసుకోగలిగింది 1985 తర్వాత తెలుగులో వచ్చిన దళిత కవిత్వం మాత్రమే. అందుకే ఈ దళిత కవిత్వాన్ని మాత్రమే తెలుగులో వచ్చిన ఆధునిక కవిత్వ ఉద్యమంగా విమర్శకులు గుర్తించటం జరిగింది. ఆనాటి సాంఘిక, ఆర్థిక, అసమానతలపై కత్తిగట్టిన జాషువా కవిత్వాన్ని కూడా హరిజనాభ్యుదయ కవిత్వంలో మలి దశగా మాత్రమే విమర్శకులు గుర్తించారు.

దళిత తాత్విక చింతన, దళిత ఉద్యమం ఇప్పుడు స్పష్టమైన చైతన్య రూపంలో వికసిస్తున్నాయి. వీటిని సాహిత్యకారులతో పాటు సామాజిక వేత్తలు కూడా తీవ్రంగా పట్టించుకోవాల్సిన దశ ఈనాడు ఏర్పడింది. దళిత శక్తులను అడ్డుకొనేవారికి ఒరిగేది ఏమీ లేదు. దళితేతర కవులకు సహానుభూతి చాలా అవసరం. ఈ సందర్భంగా దళిత కవులు కూడా గుర్తుపెట్టుకోవాల్సిన మరో ముఖ్య విషయం. మొత్తం సమాజ సంస్కారాన్ని పెంచే కవిత్వ లక్ష్యం కూడా దళిత కవులు మరిచిపోకూడదు.

*(ఎ.పి.పి.ఎస్.సి. ఉద్యోగ సమాచారం, డిసెంబర్ 1999)*

# కమనీయ "కవితా పుష్పకం"

ఈనాడు సాహిత్య లోకంలో ఒక విచిత్రమైన అలవాటు కనిపిస్తోంది. కవిత్వం రాస్తున్నవాణ్ణి పట్టుకొని వాడికి అభ్యుదయ కవి అనో విప్లవ కవి అనో అనుభూతి కవి అనో మినీకవి అనో తమకు తోచిన బిళ్లలు తగిలించి చెప్పుకుంటున్నారు. కాని వీటన్నింటికి ముందు కవిత్వం రాయాలనుకొనేవాడికి "కవి లక్షణం" అనేది ఒకటి వుండి తీరాలి. అప్పుడే వాణ్ణి మనం కవి అంటాము.

కవి కూడా ఏదో ఒక బిళ్ల అంటించుకుంటేనే గొప్పకవి అవుతానని అనుకోవటం కూడా పొరపాటు. ఏ బిళ్లలు అంటించుకోకపోయినా మంచి కవిత్వం రాసి పాఠకుల గుండెల్లో పది కాలాల పాటు నిలవగలిగితే అంతకు మించిన అదృష్టం కవి కుండదు. అలాంటి మంచి కవులలో దాశరథిని ముందుగా చెప్పుకోవాలి.

దాశరథిని అభ్యుదయ కవి అనో విప్లవ కవి అనో ప్రణయ కవి అనో ప్రకృతి కవి అనో ఏదో ఒక ముద్ర వేసి పిలుచుకోవటం వీలుకాని పని. ఆయన సహజకవి. కవికి ఉండాల్సిన లక్షణం ఉన్న కవి. కవి అనేవాడు సూర్యుడిలాగా వుండాలని దాశరథి అంటాడు. ఉప్పునీళ్ల సముద్రాన్ని తాగేసి గొప్పగొప్ప మేఘాల్ని సృష్టించి అమృత జల ధారల్ని వర్షించే సూర్యుడి లాగా కవి జీవించాలని ఆయన ఉద్దేశం. "ద్వేషాలతో రోషాలతో దోషాలతో నిషా ఎక్కివున్న మనకు మత్తు పోగొట్టి మేల్కొలిపే వేడి వేడి సూర్యుడి"లా కవి ఉండాలని ఆయన అభిప్రాయం. నిత్య నూతనత్వాన్ని కాంక్షించే తేజస్విగా కవి మెలగాలని ఆయన ఆలోచన. బళ్ల కొద్దిగా చెత్తా చెదారం రాయనవసరం లేదని మంత్రంలా నాలుగు ముక్కలు ఉచ్చరించినా చాలని కవిత్వాన్ని గురించి ఆయన అవగాహన. కవి హృదయ కోశంలో అమృతాంబువులు నిరంతరం ఝురీతరంగాలుగా విలసిల్లుతుండాలనేది తన కవిత్వంలో రాసి చూపిన ఆచరణ.

కాలాన్ని బట్టి కవికి కొన్ని ప్రత్యేక లక్షణాలు పెరుగుతూ వుంటాయి. కాని కవి అనే వాడికి ఉండాల్సిన సామాన్య లక్షణాలు ఏ కాలంలోనూ మారవు. ఆ లక్షణాలనే "భకారత్రయం"గా భావించవచ్చు. మూడు భకారాలన్నమాట. మొదటిది భావం. రెండోది భావుకత. మూడోది భాష.

భావం అనేది పాఠకుడు గ్రహించాల్సిన విషయం. ఇది సమాజానికి పనికి వచ్చేదిగా వుంటే మంచిది. పెద్దగా పనికిరాకపోతే కొంత వరకు నయం కాని సమాజానికి హాని కలిగించే విషయం మాత్రం కాగూడదు. ఇది భావం సంగతి. ఇక భావుకత సంగతి చూద్దాం. భావుకత అనేది కవికి ఉండాల్సిన ప్రాథమిక శక్తి, ప్రాణంలా ముఖ్యమైనది. భావుకుడైన కవి రాసిన కవితలో పాఠకులకు భావుకత గోచరిస్తుంది. ఈ భావుకత అనేది కవి భావనాశక్తి. పాఠకుడు గ్రహించే భావంలోని మాధుర్యం అన్నమాట.

మూడోది భాష. పాఠకుడికి మాధుర్యంతో కూడిన భావాన్ని తేలికగా అందించటానికి ఉపయోగపడే సాధనం భాష. భాష మీద అధికారం ఉన్న కవి తన మధుర భావాలను పాఠకుడు తేలికగా గ్రహించేలా వ్యక్తీకరిస్తాడు. భాష మీద అధికారం - అంటే కేవలం కఠిన పదాలతో అప్రసిద్ధ సమాసాలతో కవితా రచన చేయగల శక్తి అని అపోహపడకూడదు. భావానికి తగిన భాషలో వ్యక్తీకరించటం అవసరం. ఈ సందర్భంగా మరొక వివరణ వాక్యం కూడా అవసరం. కఠినమైన భాషతో గంభీర భావాలను వ్యక్తీకరించగలగటం కన్న అందరికీ తెలిసిన మామూలు పదాలతోనే లోతైన భావాలను ఆవిష్కరింపచేయగలగటం గొప్ప లక్షణం. కాకపోతే ఈ మామూలు మాటలనే కవి విలక్షణంగా కూర్చి తన ప్రత్యేకతను చాటుకుంటాడు.

ఇలా భావం, భావుకత, భాష - ఈ మూడు ముఖ్య లక్షణాల్ని దృష్టిలో పెట్టుకొని చూస్తే దాశరథి రాసిన "కవితా పుష్పకం" అనే కవితల సంకలనం నిజంగా కమనీయ కవితా పుష్పక విహారమే.

ఈ కవితా పుష్పకం నిండా " ప్రేమను రేకెత్తించే కోమల భాష" మనకు కనిపిస్తుంది. "భేదాలకు వాదాలకు అతీతుడైన" నిజమైన మనిషి దాశరథి కనిపిస్తాడు. ఆయన పాత మిత్రులైన గాలిబు, కాళిదాసు కనిపిస్తారు. కొత్త మిత్రులైన నజ్రులిస్లాం, ఠాగూరు కనిపిస్తారు. భిన్న సంస్కృతుల కూడలి వంటి ఆయన హృదయం కనిపిస్తుంది.

మనిషిని మనిషి కలిపే కవితా సౌధం ఈ కవితా పుష్పకం. "ఈ కవితా సౌధం పుష్పక విమానం వంటిది. ఇందులో ఎందరు ప్రయాణించినా ఇంకా చోటుంటుంది". ఈ కవితా పుష్పక విమానంలో పాఠకులు ఆనంద లోకాల లోనికి సంచారం చేయటానికి వెళతారు. ఈ విమానం ఎక్కడానికి డబ్బు అక్కరలేదు, కాని మంచి హృదయం అనే అర్హత నిచ్చే టిక్కెట్టు కావాలి.

దాశరథికి ఉరుదు, తెలుగు రెండు కళ్ళు. ఈ రెండు కళ్ళతో ఆయన అన్ని భాషల్ని చదివాడు. గుండెను ఎప్పుడూ ఆరోగ్యంగా ఉండనీయాలని గగనంలోని చుక్కల్లాగా తోటలోని పువ్వుల్లాగా మనుషులు కలిసి వుండాలని దాశరథి తపిస్తాడు.

కవితా పుష్పకంలోని దాశరథి కవితలనిండా అనేక విషయాలు గోచరిస్తాయి. సృష్టికి స్థితికి మూలమైన స్త్రీ ఆయన కవిత్వంలో ఎంతో అందంగా కనిపిస్తుంది. దీపాల్లాగా వెలిగే మోదుగుపూలు ప్రకాశిస్తూ చాలచోట్ల ప్రత్యక్షమవుతుంటాయి. ఇలా ప్రణయం గురించి ప్రకృతి గురించే కాక తల్లిలాంటి దేశాన్ని గుండె నిండుగా ప్రేమించే ఆయన దేశభక్తి కూడ అక్కడక్కడ సాక్షాత్కరిస్తుంది. సంకుచిత తత్వాలతో ముక్కలైపోయిన లోకంలో అమాయకులైన తమ్ముల్ని గురించి ఆవేదన చెంది ప్రపంచ శాంతిని కాంక్షించటం మనల్ని ఆలోచింపజేస్తుంది.

దాశరథి కవితలతో చాల చోట్ల కనిపించే "భావుకత" పాఠకుల్ని అలరింపచేస్తుంది. లలిత పదాలతో హుందాగా నిరాడంబరంగా సాగే ఆయన భాష తల్లిలాగా మనల్ని దగ్గరకు చేర్చుకుంటుంది.

దాశరథి దృష్టిలో స్త్రీ ఒక ప్రేయసి, ఒక సోదరి, ఒక కుమార్తె, ఒక స్నేహితురాలు.

'కత్తి లేని ఒరకు కాంతి లేనట్లుగా
అతివ లేకయున్న బ్రతుకు సున్న" అంటా డాయన

స్త్రీకి సహజ సౌందర్యం ఉండగా ఆభరణాలు అనవసరమని ఆయన భావన.

"ఇంతి అందము చెడగొట్టనెంచి వారు
విలువ గల ఆభరణములు పెట్టినారు" అంటూ చురక వేస్తాడు.

"నిగ్రహించెనేని నెలత గ్రీష్మంబే, అ
నుగ్రహించెనేని మల్లె పూదీగలో కుల్కు
నవవసంత మట్టు లివతళించు"

దాశరథి దృష్టిలో "వింత వింత దీపాలను వెలిగించేది వెలది - స్వాంతములో ధ్వాంతములను పరిమార్చగలది వెలది."

"కవితా పుష్పకం"లో చాలచోట్ల మనకు మోదుగుపూలు ముద్దు లొలుకుతూ కనిపిస్తాయి. ఆయన దృష్టిలో మోదుగుపూవు పేదవారి గులాబి, ముద్దులొలికే పేద పల్లెపడుచు కొప్పులో నవ్వే మోదుగు పూవును మించిన పువ్వు లేదని అంటాడాయన. సకల జగతిలో ప్రేమాంశం వుందని, కింశుక పుష్పం సతీ ప్రణయాంశుకమని పొగుడుతాడు.

"కోట్ల చిలుక ముక్కులు - ఇట్లు - ఏకమైనట్లు
కింశుకంబులు - అందగించె నేడు,
పేదవాని మదిని పెకలి వచ్చిన ఆశ
అరుణ తరుణమగుచు విరిసె ననగ"

కోట్ల కొలది చిలుకల ముక్కులు కలిసినట్లు మోదుగు పూలు కనిపిస్తాయట. పేదవాడి ఆశలాగా ప్రకాశిస్తూ వుంటాయట. దాశరథి కవితా వీధులలో మోదుగులు దీపస్తంభాలై నిలబడి ఎర్రని కాంతులు విరజిమ్ముతూ వుంటాయి.

పద్యాలలో ఒకచోట దాశరథి తుమ్మెదను బలే గమ్మత్తుగా కొత్తగా వర్ణిస్తాడు. తుమ్మెదలు సుల్తానుల్లాగా అగ్రపీఠంలో కూర్చోవాలనే కోర్కెతో వుంటాయట. సుల్తానుల్లాగే తాగుతాయట.

"కల్తీలేని మధూలకాసవము త్రాగన్ మత్తిలెన్ తుమ్మెదల్ -
సుల్తానుల్ వలె అగ్రపీఠమున కూర్చుండన్ ప్రయత్నింపగా
బోల్తాపడ్డవి, నేల కూలినవి" అని పూలమీద కెక్కి పడిపోయిన తుమ్మెదల

పాట్లు సున్నితమైన హాస్యాన్ని జోడించి వర్ణిస్తాడు.

ఇలా పాత ఉపమానాన్ని కొత్త ఉపమేయంగా చేసి, కొత్త ఉపమానాన్ని జోడించి చెప్పగలగటం దాశరథి అద్భుత కవితాశక్తి.

కలంబలం బాంబులకు లేదని, ఫిరంగుల కన్న కలమే గొప్పదని భావించే దాశరథి గొప్ప శాంతి కాముకుడు. పంటను నాశనం చేయటం తేలికే. ఆ పంటను మొలిపించటం తేలిక కాదు. అందుకే ఫిరంగుల కన్న శాంతి పంట పండించే కలం గొప్పదంటాడు. దుర్బలుడైన గాంధీలో ఎంతో దోర్బలం వుందని, పేదవాడైన మహాత్మునిలో ఎంతో పెద్దతనం వుందని, ముసలివాడైన ఆ తాతలో ఎంతో కదనపటిమ వుందని దాశరథి వర్ణిస్తాడు. "గుండెబలం వున్నవాడు - కొండనైన పిండి చేయు, కండ బలం నమ్ముకున్న దుండగీడు ఓడిపోవు." అంటూ "పరమ వీరచక్ర బిరుదాన్ని పొందిన వీర సైనికుడు అబ్దుల్ హమీద్ గురించి పొగుడుతూ రాసిన కవితలో రాకాసుల పీచమడగించినందుకు, దేశానికి వెలుగు తెచ్చినందుకు శుభాభినందనలు తెలుపుతున్నాడు దాశరథి.

**"తోటలోని పూలు యుద్ధం చేస్తే**
**తోటంతా రణరంగంగా మారుతుంది ...**
**తోట వంటి లోకాన్ని**
**ఎడారిగా చేయకండి"** అంటూ లోకంలోని సైనిక శక్తులతో హింస మానుకోండని హితవు చెపుతున్నాడు. నిజమైన స్నేహాన్ని గురించి దాశరథి రాసిన "స్నేహగీతి" అనే పాట పాఠకుల గుండెల్లో చిరకాలం నిలిచేది. "చీకట్లలో దారి చూపేది నేస్తం - కళ్ళు తలకెక్కితే దింపేది నేస్తం" అంటాడు. వర్ణాలు, వర్గాలు, వేషాలు, రోషాలు వదిలేసేది స్నేహదీపమే నిజమైన దీపం.

దాశరథి హృదయం చాల సుకుమారమైనది. ఆయన హృదయం లాగే ఆయన చేతులు కూడా సుకుమారమైనవే. అలాంటి చేతులతో కలం పట్టి ఎన్నో సుకుమార భావాల్ని సుకుమారమైన భావుకత జోడించి చాలా సుకుమారంగా వెలువరించాడు దాశరథి. రాజ హంసల్ని గురించి ఆలోచిస్తూ "వెన్నెలను గడ్డ కట్టించి, దాన్ని నొక్కి, హంసల్ని తయారు చేశారా" అని ఊహిస్తాడు.

"రావణవనం" అనే కవితలో చూద్దాం. రావణుని ఉద్యానవనం దేవతల నందనవనం కంటె గొప్పదట. నందనవనంలో ముళ్ళుంటే ఉండొచ్చు కాని ఇక్కడి రోజా మొక్క ముళ్ళు లేకుండా మొలిచిందట, అన్ని కాలాలలోను పూలు పూస్తూ వుంటుందట. అన్ని నెలలు రావణుడి తోటలో వసంతమేనట. వర్షాకాలంలో కూడ మామిడి చెట్లు పండ్లిస్తాయట. ఇలా చెప్తూ జరిగేదంతా భయంతోనే కాని భక్తితో కాదని కవిత ముగిస్తాడు. సైంటిస్టుకు మేధతో పాటు "హృదయం" కూడా ఉండి

తీరాలని, అది లేకపోతే రావణుడి తోటలాగే దేశానికి రేపెప్పుడైనా వినాశనం తప్పదని కవి హెచ్చరిస్తున్నాడు.

కవిగారికి ఒక గోరువంక ఉన్నదట. ఒకనాడు అది జబ్బు పడితే - పెంచుకునేవారికి చిలుకలు, గోరువంకలు అమ్ముకునే పక్షుల వాడొకడు వచ్చి నయం చేశాడట. ఆ తర్వాత కవి గారికి ఆ పక్షుల వాడికీ స్నేహం కుదిరింది. కొంతకాలం గడిచిన తరువాత ఆ పక్షుల వాడు వచ్చి తాను ఇక పక్షుల్ని పెంచలేనని, తన దగ్గరున్న పక్షుల్ని, పంజరాలను కొనాలని కవి గారిని అడుగుతాడు. కారణం ఏమని కవిగారు అడిగితే పక్షులవాడు ఇలా అంటాడు -

''కాలము మారె - ఖేచర నికాయముపై అనురక్తి పంచబం
గాళము కాదొడంగె మన నాగరక ప్రజకెల్ల, ఇంక కి
ళ్ళీల దుకాణమో, అదియు లేదనినన్ చవకైన చిన్ని బీ
డీల దుకాణమో తెరచుటే గతి, పక్షుల నింక పెంతునే'' అంటూ
''పౌర హృదయాలలో నుండి పక్షి గణము
లెగసిపోయెను - బ్రతుకుట ఎట్లు నేను?'' అంటాడు. ఇక్కడ ఉన్నది దాశరథి కవిత్వ మహత్వం. పక్షులంటే ఇక్కడ పక్షులు కాదు. శాంతి, స్వేచ్ఛ, నిర్మలత్వం, సహనం, నిరాడంబరత్వం అనేవి పౌరుడికి ఉండాల్సిన మంచి భావాలు. ఆ భావాలే ఈ పక్షులని దాశరథి భావన. అవి లేకపోవటం వల్ల పౌరులు చెడిపోతున్నారనేది ఆయన ఆవేదన.

దాశరథి భావనాబలం గొప్పది. ప్రియుడు అంధుడు. అతడికి కన్నులు లేవు. కాని చిత్రమేమిటంటే ప్రేయసిని తాకగానే అతని చేతివ్రేళ్ళకు కన్నులు వచ్చాయట. అదీ చమత్కారం.

ఇలా దాశరథి కవితలు కొన్ని దీపాలై మనకు దారి చూపుతుంటాయి. మరికొన్ని చలిమంటలై వేదనాతుషారాన్ని తొలగిస్తుంటాయి. ఇంకొన్ని ప్రణయ పుష్పాలై అలిసిన మనసులకు పరిమళాల్ని అందజేస్తుంటాయి. ఇంకా కొన్ని ఉదయ కిరణాలై మనకు చిరుచురకలు వేసి కర్తవ్య బోధ చేస్తాయి.

''చచ్చిపోయిన జాతి నోర్విచ్చి ప్రాణ
ధారలను చిమ్మి చేతనత్వమిడినావు
భారతీదేవి నీవయి వచ్చెనేమొ !
నీవె భారతివైపోయినావొ యేమొ! '' అంటూ
విశ్వకవి రవీంద్రుని గురించి దాశరథి రాసిన పద్యం - చచ్చిపోయిన తెలుగుజాతి నోరు విప్పి ప్రాణధారల్ని కురిసిన అమృతకవి దాశరథికి కూడా వర్తిస్తుంది.

*(ఆకాశవాణి, విజయవాడ కేంద్రం 4-11-1992)*

# శ్రీశ్రీ సినిమా పాటలు

సినిమా పాటల్లో కవిత్వం తక్కువనుకోవటానికి వీలు లేదు. అందులోను శ్రీశ్రీ రాసిన పాటల్లో ఎన్నో విశిష్ట లక్షణాలు కనిపిస్తాయి., కేవలం భావుకత మాత్రమే కాక ఆయన ప్రతిభ, సొంత గొంతుక, గంభీర భావాలను ప్రతిపాదించే సరళశైలి మొదలైన అనేక విశేషాలు ఆయన పాటల్లో మనం పరిశీలించవచ్చు.

భాష మీద తన అధిక్యం చూపించుకోగల శ్రీశ్రీ ప్రతిభ ఒక్క మహాప్రస్థానంలోనే కాక సినిమా పాటల్లోను వుంది.

"పునర్జన్మ" లో "ఎవరివో నీవెరివో" అనే పాటంతా పరిశీలించదగ్గదే. ఇందులో ప్రతిపాదం కూడా భావోద్రేకానికి అనుగుణంగా రచింపబడినది. "నా భావనలో - నా సాధనలో" అనే రెండు రూపాల్లోని అచ్చులొకటే. ఈ రూపాలు భావానుభూతిని ప్రదర్శిస్తూ వుండటమే కాకుండా వినటానికి కూడా ఇంపుగా ఉన్నాయి. "నవవసంతమున - నందనవనమున" అనే రెండు రూపాల్లోను అకారం అంతటా వినిపిస్తోంది. ఇలాంటివన్నీ కవి కావాలని రచించినట్లు ఎక్కడా అనిపించదు. ఇది కవి ప్రతిభకు ఒక నిదర్శనం. ఈ పాటలోనే "కలువల కన్నుల కాంతివో" అనే వరకు నడక సున్నితంగా సుతారంగా నడిచింది. తర్వాత "నీ కరకంకణ నిక్వణమా" అనే పాదం నుండి వ్యక్తీకరణలో వచ్చిన ఉద్రేకానుగుణమైన సమాసాల వినియోగం నడకను మార్చినా పాట సొగసుకు భంగం కలగకపోగా భావానికి మరింత అందాన్ని చేకూర్చి పెడుతున్నది. భావోద్రేకాన్ని బట్టి ఒకే పాటలోనే గమన వైవిధ్యం చూపటం శ్రీశ్రీ ప్రతిభకు మరో నిదర్శనం. ఆ "పునర్జన్మ" చిత్రం బెంగుళూరులో ఆడుతున్నపుడు "ఈ పాట కోసమే వెళ్లి ఇది అయిపోగానే తిరిగి వచ్చేసేవాడిని, ఇలా సుమారు ఇరవైసార్లయినా జరిగి ఉంటుం"దని ఒక కన్నడ వ్యక్తి శ్రీశ్రీతో అన్నాడట.

సినిమాకి పద్యం రాయడమంటే శ్రీశ్రీకి చాలా యిష్టం. "పంతులమ్మ" చిత్రంలో బిందు పూర్వక హకారప్రాసను అతి సులభంగా ఈ క్రింది పద్యంలో వాడుకున్నారు. ఛందస్సుతోపాటు భాషమీదున్న అధికారాన్ని తెలియజేసే మరో ఉదాహరణ ఇది.

"అంహో దుర్భరమాయె భారతము : గర్వాంధుల్ దురార్భాట సం
రంహుల్ స్వార్థపరుల్ చరింతురిట : వీరల్ సేయు ఘోరాలపై
సింహం బోయనలేచి, నేనిక మహోక్షేహాధ్వనిన్ వీరలన్
సంహారం బొనరించు శక్తిని జగన్మాతా ! ప్రసాదింపుమా !"

పద్యాల్ని గ్రాంధిక భాషలోను వచన కవితల్ని వ్యావహారిక భాషలోను కవులు రచిస్తున్నారు. కొందరు అభ్యుదయ కవులమనుకునే వాళ్ళు అర్థం కాని కుహనా వ్యావహారిక భాషలో అభ్యుదయ వచన కవితలంటూ రాసేస్తున్నారనుకోండి, అది

వేరే సంగతి. కాని శ్రీశ్రీ పాటలలో గ్రాంథిక వ్యావహారిక భాషా మిశ్రమం కొన్ని చోట్ల వున్నా అది ఆ పాటలకు బలహీనతగా తోచదు. పురాణంవారు అన్నట్లు "అన్నం పరమాన్నం"లా దట్టమైన భావుకతతో ఆ పాటల్ని రచించడం వల్ల భాష గ్రాంథికమా వ్యావహారికమా అనే ఆలోచన మనకు రాదు.

"పయనించే మన వలపుల బంగరు నావ !
వికసించే విరజాజులు!
వెదజల్లగ పరిమళాలు !
రవళించే వేణుగీతి రమ్మని పిలువ !"

ఇందులో గ్రాంథికం, వ్యావహారికం రెండూ ఉన్నాయి.

సినిమా పాటల్లో సొంత అభిప్రాయాల్ని ప్రకటించగల రనటానికి తార్కాణంగా "వెలుగు నీడలు" చిత్రంలో "పాడవోయి భారతీయుడా" పాట రాశాడు. ధనికులకు బీదలకు సాగుతున్న వర్గ సంఘర్షణను "పంతాలు - పట్టింపులు" చిత్రానికి రాసిన పాటలో శ్రీశ్రీ ప్రతిబింబింప చేశాడు. "సిరులకొరకు సాగేటి పోటీ దేవదానవుల కాలం నాటి" నుండి ఎడతెరపి లేకుండా వుందనే అంటాడు శ్రీశ్రీ

"పాల కడలికే చని
అట నానా బాధలు పడి
సరిసమానమైన శ్రమలకోర్చి తుదకమృత భాండమును కని ...
ఒకరిపై ఒకరు కక్షలు పూని
ఒకరిపై ఒకరు కత్తులు దూసి
హోరా హోరీగ పోరాడిన కథ
నేటిదా ఒకనాటిదా"

ఇలా ఉన్న పరిస్థితిని ఉన్నదున్నట్లుగా చిత్రించి వూరుకోడు శ్రీశ్రీ. తన అభిప్రాయాన్ని బయటపెట్టుకోవలసిందే శ్రీశ్రీ లాంటి ప్రజాకవి.

"వంతు తెగని వైఖరి - కని
వచ్చెనటకు మోహిని - మీ
విభేదాలనే పరిష్కరించి
అమృతం పంచెదనని - మీ
అంతు తేల్చుతానని
సిరి సంపదలను పంచాలంటే
కుడి యెడమలు పాటించాలని - హై
హై అంటే హై అంటూ
ఎడమ ప్రక్కగా ఒకరిని తరిమి
కుడి ప్రక్కగా ఇంకొకరిని నిలిపి

కుడి ఎడమలతో నడిపిన ఈ కథ''

అంటూ కపటనాటక సూత్రధారిని నేటి ప్రభుత్వంగా ధ్వనింపజేసి తరిమింది పేదవాళ్ళనని, నిలిపింది ధనవంతులనని అవకతవకల మనస్తత్వం గల ప్రభుత్వాన్ని విమర్శిస్తూ శ్రామిక వర్గ పక్షపాతం ప్రకటిస్తాడు కవి.

"యమగోల" చిత్రంలో యముడి మీద నరకలోక కార్మిక శక్తి తిరుగుబాటు చాటినట్లు కల్పించి అప్పట్లో మనదేశంలో విధింపబడిన ఎమర్జన్సీని దుయ్యబట్టాడు శ్రీశ్రీ.

''యముడి నిరంకుశ పాలన వద్దు!
యమ అర్జెన్సీ ఇకపై రద్దు''

అంటూ కోరలతో, కొమ్ములతో, ఊరేగుతున్న వాళ్ళని రంగుల తేడాలతో కులమత భేదాలతో సతమతమవుతున్న వాళ్లని బాగుచేయాలని చూస్తాడు.

సిద్ధాంతపరమైన అభిప్రాయాలను ప్రకటించేటప్పుడు శ్రీశ్రీ చాలా "సింపుల్ స్టయిల్" స్వీకరించుటం ఆయన ప్రత్యేకత. మహా ప్రస్థానంలో కొన్నిచోట్ల పండితులకే అర్థంకాని పదాలు ప్రయోగించిన కవి ఇలాంటి సందర్భాలలో కనీసం అలంకారాన్ని కూడా అంటుకోకుండా అతి సరళంగా సూటిగా చెప్పాడు. అయినా ఆకర్షణ ఏ మాత్రమూ తగ్గదు. ఇది ఒక్క శ్రీశ్రీ పాటలలోనే కనిపించే విశిష్ట లక్షణం.

''నలుగురు కలిసీ పొరుపులు మరిచీ
చెయ్యాలి ఉమ్మడి వ్యవసాయం - మన
కిస్తుం దెక్కువ ఫలసాయం - ఇది
రైతుల కెంతో సదుపాయం'' (తోడి కోడళ్ళు)

''చాలీ చాలని పూరి గుడిసెలో
కాలే కడుపుల పేదలకు
మందులు లేని ఆసుపత్రిలో
పడిగాపులు పడు రోగులకు
ఎవరో తోడు వస్తారని
ఏదో మేలు చేస్తారని
ఎదురు చూసి మోసపోకుమా'' (భూమి కోసం)

''పని చేసే రైతన్నా
పాటుపడే కూలన్నా
రండోయ్ - రా రండోయ్ - మన
కలలు పండే రోజొచ్చింది'' (పాడి పంటలు)

''సమ సమాజ నిర్మాణమె నీ ధ్యేయం
సకల జనుల సౌభాగ్యమె నీ లక్ష్యం

ఏక దీక్షతో గమ్యం చేరిననాడే
లోకానికి మన భారతదేశం
అందించునులే శుభ సందేశం" (వెలుగు నీడలు)

ఇలా నిరలంకారంగా రాసే శ్రీశ్రీ, ఒక వీరుణ్ణి ఈ దుష్ట వ్యవస్థ ఉరి తీయబోతుండగా, తుఫాను రాబోయే ముందటి సముద్రం కుండే ప్రశాంతతలా

"చెరసాలల శిరసులపై
ఉరి కొయ్యల చివరలపై
ఎగురుతుంది తిరుగుబాటు బావుటా!
సాయంకాలపు ఉరికంబం
తెల్లవారితే రవిబింబం
మూయించిన ఒక వీరుని కంఠం
వేయి గొంతుకల విప్లవ శంఖం!
పతిత దళిత జనరణ హుంకారం
ప్రళయ సమయ దిగ్గజ ఘీంకారం" (విప్లవ శంఖం)

సినిమా పాటకు ప్రధాన లక్షణం అందరికీ అర్థమయ్యే మామూలు భాషను కలిగి వుండటం. అదే సహజమైన వ్యావహారిక ధోరణి. అదే జీవభాష. పాడటానికి కష్ట మనిపించే సంయుక్తాక్షరాలు, అతి దీర్ఘ అప్రసిద్ధ సమాసాలు మొదలైన అవలక్షణాలు శ్రీశ్రీ సినిమా పాటలలో పొరపాటున కూడా దొరకవు.

"జాలరి వలలో చేపవు నీవే!
గానుగ మరలో చెరకువు నీవే
జాలీ లేని లోకంలోన
దారే లేని మనిషివి నీవే" అంటూ ఆగిపోకుండా
"అగాధమౌ జలనిధిలోన
ఆణి ముత్య మున్నటులే
శోకాల మరుగున దాగి
సుఖమున్నదిలే
ఏదీ తనంత తానే నీ దరికి రాదు
శోధించి సాధించాలి, అదియే ధీరగుణం"

అని ముందుకడుగు వేయించగల దీర్ఘకాలజ్ఞుడు శ్రీశ్రీ.

"గానానికి ప్రాణం సాహిత్యం. కంటితో విని సరిపెట్టుకోకుండా చెవితో చూడగలిగితే సినిమా పాటలలో ఉన్న సాహిత్య చిత్రాలు అర్థమౌతాయి. అక్షరాలతో ఆడుకోడం, పదాలతో పాడుకోడం, పదబంధాలతో పరిహాసాలాడడం మహాకవికే సాధ్యం" అంటారు ప్రముఖ నేపథ్య గాయకుడు బాలసుబ్రహ్మణ్యం.

*(చేతన, శ్రీశ్రీ సంస్మరణ సంచిక, ఆగష్టు 1983)*

# "జగన్నాటకం"

సత్కవులైన ఒక పదిమంది ఆధునిక కవులను మనం ఎంచుకోవలసివస్తే అందులో నార్ల వేంకటేశ్వరరావు తప్పక వుండితీరాలి. నార్లవారికి పత్రికా సంపాదకుడిగా ఉన్నంత కీర్తి ఒక సుకవిగా లేకపోవటం తెలుగు గడ్డ దురదృష్టమే తప్ప అది నార్లవారి దురదృష్టం కానే కాదు. "నార్ల వారి మాట", "మా వూరు", "జగన్నాటకం" వంటి ఉత్తమ కవితా సంపుటులను వెలువరించిన "మంచి కవి" నార్ల. వారి కవితా ప్రాభవానికి నిదర్శనంగా ప్రస్తుతం వారి "జగన్నాటకం" అనే గేయ సంపుటి పరిశీలిద్దాం.

'జగన్నాటకం' మొదటిసారిగా 1957లో ప్రచురించబడింది. దానిలో నార్లవారు "పరిచయం"లో ఇలా అన్నారు -

"కవిగా నన్ను మీకు ఈ గేయ సంపుటి పరిచయం చెయ్యాలి. అట్టి సంపుటిని మీకు పరిచయం చేయడానికి నే నెవరిని?"

పరిచయ మంతా కేవలం ఈ రెండు వాక్యాలే. ఇంతటి సూక్ష్మాతి సూక్ష్మమైన పరిచయం, ఇంతటి వినయమూ, అందులో ఇంతటి చమత్కారమూ సాధారణంగా మనకు ఇతరుల కావ్యాలలో కనిపించవు. ఇతరుల చేతి పొగడ్తల పీఠికలు వారికి ససేమిరా గిట్టవని కూడా భావించవచ్చు.

నార్ల వారి కవిత్వానికి భాషా సౌందర్యం, భావ సౌందర్యం - రెండు కన్నులు. ప్రతి ఖండికలోనూ మనకీ విషయం సుస్పష్టంగా తెలుస్తూనే వుంటుంది.

"'మింట మెరిసే కొంటె చుక్కలు
కవులు చెప్పే కన్నెలైతే -
కన్నుగీరుటె తెన్ను వాటికి,
వెక్కిరింతలె వెల్గు వాటికి."

"నింగి త్రుళ్ళే నీలి మబ్బులు
కవులు చెప్పే కన్నెలైతే -
విరియ బోసిన కురులు వాటికి
వల్లమాలిన వగలు వాటికి."

నక్షత్రాలలోని మెరుపు, నీలి మబ్బులలోని వెలుగు ... కన్నెలకు స్వంతమట. మినుకుమినుకుమనే నక్షత్రాలు కన్నుకొడుతున్నట్లుగా రమ్యంగా భావించటం

జరిగింది. చుక్కల్ని కన్నెలుగా తలచటం కూడా బాగుంటుంది. ఎందుకంటే - 'కన్నె' అనే అర్థంతో కూడా మనం 'చుక్క' అనే పదాన్ని వ్యవహారంలో వుపయోగిస్తూనే వుంటాం. మబ్బులు నల్లగా వుంటాయి. కురులూ అంతే. మబ్బులు, కురులు ... రెండూ గాలికి కదులుతున్నప్పుడు వాటి అందం ఇనుమడించి కనిపిస్తుంది.

'శైశవ హృదయం' అనే బాల గేయంలో కవి చుక్కల్ని ఎలా భావించారో గమనార్హం.

"జేబు నిండుగ ఎన్ని చేర్చినా గాని
గోలికాయలు నీకు చాలనే లేద?"

అంటూ అమ్మ తన పిల్లవాణ్ణి ప్రశ్నిస్తే ఆ పిల్లవాడు అమాయకంగా

"చందమామకు - అమ్మ - ఎందుకై తేను
గోలికాయలు అన్ని కొండ నిండుగను"

అంటూ తన సందేహంతో కూడిన సమాధానం చెప్తాడు. చుక్కల్ని గోలీలతో పోల్చటమే కాకుండా పసిపిల్లల మానసిక చిత్త వృత్తికి తగినట్లు ఎంతో సహజంగా ఔచిత్యంతో వర్ణించగలిగారు నార్ల.

"వర్షం" గూర్చి ఎంత సుందరంగా చెప్పారో చూద్దాం.

"వర్షం వర్షం
చిట చిట, తట తట,
జొట జొట, ఇట నట
వర్షం వర్షం

వర్షం వర్షం
గల గల, జల జల
పల పల, ఇల నిల
వర్షం వర్షం

వర్షం వర్షం
దడ దడ, బడ బడ
గడ గడ, ఎడ నెడ
వర్షం వర్షం"

ఈ గేయాన్ని చదువుతుంటే ఆ నడక వర్షం పడుతున్నట్లే అనిపిస్తుంది. దీన్ని తెలుగు రాని వాడిక్కూడా చక్కగా చదివి వినిపిస్తే చదువుతుంటే వాన

పడుతున్నట్లుందని అంటాడని నా నమ్మకం. దీనిలో సందర్భానుసారంగా వుపయోగించారు ధ్వన్యనుకరణశబ్దాలు, అనుప్రాసలు. సమర్థుడైన కవి చేతిలో భాషా సౌందర్యం ఎల్లప్పుడూ భావ సౌందర్యాభివృద్ధికే దోహదం చేస్తుందనే విషయం మనం ఇక్కడ గ్రహించవచ్చు. వర్షం మట్టిమీద పడుతున్నప్పుడు వచ్చే ధ్వని, గచ్చు నేల మీద పడేటప్పుడు వచ్చే శబ్దం, కాలువ నీళ్లపై పడేటప్పుడు వినిపించే సంగీతం, రేకులపై పడ్డప్పుడు మ్రోతలు ... ఇలా ఇవన్నీ ఒకటి కావు. రకరకాల ధ్వన్యనుకరణాల్ని బట్టి మనకు ఆయా ప్రదేశాలు కూడా మదిలో మెదిలి ఆనందాన్ని కల్గిస్తాయి.

నార్లవారి దృష్టిలో ప్రేమాధారం లేని బ్రతుకు భారం. "అనురాగము కానరాని గృహమే శనిదేవత శయ్యాగారము." ఆశయే లోకం. ఆశయే నాకం. 'మృత్యువు నెరుగని సత్యమునేదో' మానవుల కివ్వాలని ఆయన ఆరాటం. "నవ్వులే సృష్టి"కి నాంది వచనమని వారి గట్టి విశ్వాసం. అంతమాత్రాన నవ్వుల తోటలలో తిరిగే నాగులను పసికట్టలేని అజ్ఞాని కాదు ఆయన.

"వేణిపై అర
విచ్చినప్పుడె
సన్నజాజికి
వన్నెలైనా, చిన్నెలైనా ! ...

పల్లె పల్లెను
చెల్లినప్పుడె
నాదు పాటకు
మోదమైనా, మూల్యమైనా ! "

ప్రజలాదరించేదే కవిత్వం. కొప్పులో పెట్టుకుంటేనే పూలు అందగిస్తాయి. కుర్రవాళ్ళు దారినపోతూ మల్లెపూల దుకాణం సువాసనల్ని వెదజల్లుతున్నా ఆ దుకాణం వైపు చూడరు. పావలా మల్లెపూలైనా పడతి కొప్పులో ఉంటే, ఆ వచ్చే సువాసనలు కుర్రవాళ్ల నలా పట్టి నిలిపేస్తాయి. ఇది సహజం. అలాగే కవిత్వం కూడా బండ్ల కొలది రాసినంత మాత్రాన దానిని ప్రజలు పట్టించుకుంటారని లేదు. రాసినదెంత మాత్రమైనా ప్రజల హృదయాల కెక్కగలిగినప్పుడే అది మంచి కవిత్వం అవుతుంది.

"అల్ప పదముల ననల్పార్థ రచన" క్కూడా నార్ల వారి గేయాలు తార్కాణాలు. "ఆగస్టు - 15" గూర్చి రాస్తూ ఏమన్నారో చూడండి -

"కాల్వలు తీయక,

కష్టము చేయక

స్వరాజ్య నదియును

సత్ఫల మివ్వదు ..."

"స్వరాజ్యనది" అనే సమాసం అంతులేని భావంతో నిండి ఉన్నది. స్వరాజ్యం వచ్చింది గదా అని తింటూ కూర్చుంటే దాని ప్రయోజనం కలకాలం వుండదు. ఆ స్వేచ్ఛను, సమభావాలను వివిధ రంగాలలోని ప్రతి మనిషికి అందుబాటులో వుండేట్లు చూడాలి. అందుకు నిరంతర కృషి జరగాలి. ఒక నది ప్రవహిస్తున్న దనుకుందాం. నది పక్కనే చేను వున్న రైతుకైనా ఆ నీటిని సద్వినియోగం చేసుకొని పొలం పండించుకోవాలన్న ధ్యాస వుండాలి. ఆ తర్వాత ... ఆ నది నుండి కాలువలు, పిల్ల కాలువలు తీసుకోవాలి. వరదలకని గట్టు తెగిపోకుండా చూసుకోవాలి. సకాలంలో పొలమంతటా నీరు అందుబాటులోకి వచ్చేట్లు కృషి జరగాలి. ఈ భావాన్నంతా మనం మన స్వతంత్ర భారత దేశానికి అన్వయించుకొని కృషి చేస్తే ధన్యులం కాగలం. "స్వరాజ్య నది" అనే భావనలో ఇలా ఎంతో లోతైన భావం ఒదిగివుంది. కొందరు లోతు నెపంతో రాసే ఎవ్వరికీ అర్థంగాని మాయ కవిత్వం కన్నా ఇలాంటి కవిత్వం మంచిదనే విషయం గ్రహిస్తే సంతోషం.

నార్లవారి అనేక ఖండికలలో మనకు అభ్యుదయ భావాలు బాగా కనిపిస్తాయి. "మాటల దివిటీలే పోటరి యీటెలుగా దీటులేని నా పోరాటము చీకటిపై" అని ఎలుగెత్తి చాటిన వారు నార్ల. వారి వూహలెంత సున్నితంగా కోత పెడతాయో మచ్చుకు కొన్ని ఉదాహరణలు.

"కత్తికె కన్నుంటే

నెత్తురు చూడగనే

ఒళ్ళు తిరిగి ఉర్వికి

ఘల్లున పడునేమో !"

"రూకకె నోరుంటే

వ్యాకుల చిత్తముతో

కొంపలు నా పేరిట

కూల్చకు మనునేమో !".

"రొట్టెకే కాళ్ళుంటే
పట్టెడు మెతుకులకే
అల్లాడే దీనుల
ఇల్లు చేరునేమో !"

ఈనాడు దేశంలో పెరుగుతున్న గూండాయిజాన్ని కత్తి మెత్తని గుండెతో ప్రశ్నిస్తున్నది. డబ్బుకోసం కొంపలు కూలుస్తున్నవాళ్ళని రూపాయినోటు గద్దిస్తున్నది. చెమటతో తిండి సంపాదించుకున్నవాళ్ళను ఆ తిండికి దూరం చేసే దుర్మార్గుల్ని రొట్టె ఈసడిస్తున్నది. ఎంత సుతారంగా, ఎంత సున్నితంగా, ఎంత సుమనోహరంగా చెప్పాడో కవి !

నార్ల వారి "జగన్నాటకం" గూర్చి సి. నారాయణరెడ్డి తమ పరిశోధనా గ్రంథంలో ఇలా రాశారు - "నార్ల వెంకటేశ్వరరావుగారి 'జగన్నాటకం' వస్తు వైవిధ్యము గల ఖండ కావ్య సంపుటి. 'వెన్నెల' అన్న గేయములో వీరు వెన్నెలను 'మానవుని మంత్రించు వెన్నెల' యని ఉల్లేఖించిరి. ఈ సంపుటిలో గల 'పిచ్చి వూహలు' వంటివి వస్తు నవ్యతగల గేయములు. 'ఇల్లాలు'ను 'మల్లెపూల గోపుర' మనుట సులలితమైన ఊహకు కొలమానముగా తీసికొన వచ్చును."

నిట్టూర్పుకు, బిట్టూర్పుకు కాసులతో విలువెంతో కట్టలేము. చిరునవ్వుకు, చెంగల్వకు మార్కెటు ధర చెప్పలేము. అలాగే నార్ల వారి కవిత్వానికి కూడా వెలకట్టలేమనేది సత్యం. "చీకటి గుండెలు చెదరిపోవగా వేకువ పెట్టిన వెలుగు కేకలా" నార్ల వారి కవిత సహృదయులకు దర్శన మిస్తుంది.

నార్ల వారి కవిత్వం మీద చక్కని పరిశోధన ఎంతైనా చేయవచ్చుననే విషయం పరిశోధక మిత్రులకు సూచించటం ఈ వ్యాసానికి ముఖ్య లక్ష్యం.

(భారతి, మే 1979)

# వచన పద్యంలో పదగణాలు

సంప్రదాయ విధానంలో సమానమైన అక్షరాల వలన గాని, సమానమైన గణాల వలన కాని, సమానమైన మాత్రల వలన గాని పద్య పాదాలలో లయ సిద్ధిస్తుంది. ఉత్పలమాలలో ప్రతి పాదానికి ఇరవై అక్షరాలుంటాయని : తేటగీతిలో ఒక్కో సూర్యగణం, రెండేసి ఇంద్రగణాలు, రెండేసి సూర్య గణాలు క్రమంగా వస్తాయని : కంద పద్యంలో ఒకటోపాదంలోను మూడోపాదంలోను సమాన మాత్రలుంటాయని, అలాగే రెండో పాదం నాలుగో పాదంలోను సమాన మాత్రలుంటాయని పండితులకు తెలిసిన విషయాలే. ఇలానే వచన పద్యంలో సమానమైన పదగణాల ద్వారా లయ సిద్ధించే అవకాశం ఉందని నేను ప్రతిపాదిస్తున్నాను. ఆనుషంగికంగా యతులు, ప్రాసలు, అంత్యప్రాసలు కూడా వచన పద్యంలో వాడుకోవచ్చు. పద్యాన్ని నాలుగు పాదాలకంటె ఎక్కువగా రాయకూడదని మన పూర్వ కవులు కూడా భావించలేదు. అలాంటప్పుడు - వచన పద్య పాదాలు సంఖ్యలో గట్టిగా నియతం గాకున్నా కొన్ని విషయాలలో సామాన్య లక్షణాలు సంతరించుకొని వుంటున్నాయని భావిస్తున్నాను. వీటిని జాగ్రత్తగా ఉదాహరణ పూర్వకంగా పరిశీలిస్తూ సాధ్యమైనంత వరకు నాకు తోచిన వచన పద్య లక్షణ చర్చ చేయటానికి ప్రయత్నిస్తాను.

పద గణాలంటే ఏమిటో చెప్పబోయేముందు - ఈ లక్షణ చర్చకు సంబంధించిన 'పద'మంటే ఏమిటో ముందుగా తెలియజేస్తాను. దుష్టుడు, మానవుడు - ఇది ఒక్కొక్కటి ఒక్కోపదం. చిన్నయసూరి చెప్పినట్లు 'సమర్థంబులైన పదంబు లేకపదంబగుట సమాసంబు' అనటం వల్ల 'దుష్టమానవుడు' వంటి సమాసం చేస్తే అది ఏకపదం కాటానికి అవకాశం ఉంది. కాని నేను ఇలాంటి తత్సమసమాస సందర్భాలలో కూడా ఈ 'దుష్ట మానవుడు' వంటి వాటిని రెండు పదాలుగా గ్రహిస్తున్నాను. "దుష్ట" అనేది "మానవుడు" అనేది రెండుగా గ్రహించి ఇందులో రెండు "పద గణాలు" ఉన్నాయని భావిస్తున్నాను. కొన్ని పాదాలలో వచ్చే దీర్ఘ సమాసాల్ని అనేక పద గణాలుగా విభజించుకోవడం కోసం ... నేనిలా భావిస్తున్నాను.

కొన్ని తెలుగు వచన పద్యాలను ఈ దృష్టితో పరిశీలించి చూస్తాను. వచన పద్యానికి భావగణాలు ప్రతిపాదించిన సంపత్కుమార తీసుకున్న కొన్ని ఉదాహరణలను ముందుగా స్వీకరించి పరిశీలిస్తాను.

"ప్రతి మాటకీ శక్తి ఉంది, పదును ఉంది
ప్రతి మాటకీ అర్థం ఉంది, ఔచిత్యం ఉంది"

- తిలక్ - "నవత - కవిత"

ఈ పాదాలను పదగణాల రీత్యా ఇలా విభజించి వ్రాస్తాను.

"ప్రతి । మాటకీ । శక్తి । ఉంది । పదును । ఉంది ।

ప్రతి । మాటకీ । అర్థం । ఉంది । ఔచిత్యం । ఉంది ।"

మొదటి పాదంలోను, రెండవ పాదంలోను సమానంగా - ఆరేసి పదగణాలున్నాయి. ఇలా రెండు పాదాలకు నిర్మాణం సమానంగా వుందన్నమాట. అనుషంగికంగా అంత్యప్రాస కూడా ఉంది.

"నీకు కలం వుంది, ప్రజలకు బలం వుంది.
నీకు హృదయం ఉంది, ప్రజలకు ఉదయం ఉంది"

- 'ఆశ'లో కుందుర్తి

ఈ పాదాలను పై రీతిగానే విభజింపవచ్చు. కాని పాద నిర్మాణంలో ఒక నూతన లక్షణం ఉంది. ఇంతకు ముందుదహరించిన పాదాల్లో ప్రతి పాదాన్ని రెండు సమభాగాలుగా అంటే మూడేసి గణాలుగా అర్థస్ఫూర్తి రీత్యా విభజించలేము. కాని ఈ పాదాల్లోని ప్రతి పాదాన్ని రెండు సమభాగాలుగా విభజించవచ్చు. అంటే మూడేసి గణాలుగా రాసి అర్థరీత్యా విభజించి చూడవచ్చు. ఇది నాలుగు పాదాల వచన పద్యం.

"నీకు । కలం । వుంది ।
ప్రజలకు । బలం । వుంది ।
నీకు । హృదయం । వుంది ।
ప్రజలకు । ఉదయం । వుంది ।"

ప్రతి పాదంలోను మూడేసి పద గణాలున్నాయి. అటు తర్వాత అంత్య ప్రాస కూడా ఈ భావానికే దోహదం చేస్తున్నది.

"దూకండి సముద్రంలోకి
ప్రాకండి కీర్తిలోకాలలోకి
బ్రతుకును గుప్పిట్లో బంధించండి
భయంమీద ఆగ్నేయాస్త్రం సంధించండి" - ఆశ

దీన్ని ఇలా విభజించి చూపించవచ్చు.

"దూకండి । సముద్రంలోకి ।
ప్రాకండి । కీర్తి । లోకాలలోకి ।
బ్రతుకును । గుప్పిట్లో । బంధించండి ।
భయంమీద । ఆగ్నే । యాస్త్రం । సంధించండి । "

ఇక్కడ మొదటి రెండు పాదాలు ఒక విభాగంగా, తరువాతి రెండు పాదాలు మరో విభాగంగా భావించవచ్చు. ఇక్కడ ఒకో విభాగంలోని పాదాలకు అంత్యప్రాస వుంది. ఒకటో విభాగంలోని మొదటి పాదం కన్నా రెండవ పాదంలో ఒక పదగణం ఎక్కువగా ఉండటం ఇక్కడ లక్షణం. అలాగే రెండో విభాగంలోని మొదటి పాదం కన్నా రెండో పాదంలో ఒక పదగణం ఎక్కువగా వుంది. ఇలా రెండు విభాగాలకు ఒక సమానత్వం

స్థాపింపబడటం వల్ల పాదాలకు లయ బాగా సిద్ధిస్తున్నదన్నమాట. ఇలా వచన పద్యం భిన్నత్వంలో ఏకత్వం సాధించటానికి "వచన కవి తన కవితా రూపాన్ని తనే సృష్టించుకోవాలి. ... ఎప్పటికప్పుడు కొత్తరూపాలు సృష్టించుకొంటున్నప్పుడు ఆ రూపాల సంఖ్యకు పరిమితి లేదు. కవి సృజన శక్తిని బట్టి కవితారూపం వుంటుంది- " అంటారు చేకూరి రామారావు. ఒక్కో విభాగం లోని ద్వితీయ పాదాల్లో ఒక్కో గణం పెంచటమనే సమానమైన లక్షణం ఉన్నత భావాన్ని ఒక ఆవేగంతో, ఆవేశంతో ప్రజలకు అందించటం కోసంగా మనం భావింపవచ్చు.

"విచ్చుని బాణంలా విచారం దూసుకుపోయిన గుండెతో
దిగులుతో, దైన్యంతో, బరువుతో, బాధతో
బ్రతుకు బజార్లో నిలబడింది."

- కుందుర్తి, "కాలం ఆగిపోయింది"

దీన్ని యిలా విభజించి రాస్తాను.

"విచ్చుని । బాణంలా । విచారం । దూసుకు । పోయిన । గుండెతో ।
దిగులుతో । దైన్యంతో । బరువుతో । బాధతో ।
బ్రతుకు । బజార్లో । నిలబడింది । "

ఈ పాదాల్లో క్రమంగా ఒక్కోపాదం గడిచేసరికి పదగణాలు తగ్గుతూ రావటమనే ఏకత్వం కవి ఆశించిన దైన్య భావస్ఫూర్తి కోసమే. భావానుగుణంగా పాదాల్లోని పదగణాల సంఖ్య తగ్గుతూ పోవచ్చు. లేదా పెరుగుతూ పోవచ్చునని గ్రహింపవచ్చు. ఈ పాదాల్ని మరో విధంగా కూడా - అంటే నాలుగు పాదాలుగా రాసి పదగణ విభజన చేసి సమాన లక్షణాలున్నాయేమోనని పరిశీలిద్దాము.

"విచ్చుని । బాణంలా ।
విచారం । దూసుకు । పోయిన । గుండెతో ।
దిగులుతో । దైన్యంతో । బరువుతో । బాధతో ।
బ్రతుకు బజార్లో । నిలబడింది । "

ఒకటి, నాలుగు పాదాల్లో రెండేసి పదగణాలు, రెండు, మూడు పాదాల్లో నాలుగేసి పదగణాలున్నాయనుకోవచ్చు. ఈ పాదాలలోని భావం అంతటికీ ప్రధానమైనది, ఒక రకంగా కర్త లాంటిది "బ్రతుకు". ఇది నాలుగో పాదంలో పెట్టె గుర్తులో వున్న అదనపు పదగణంగా భావస్ఫూర్తి కోసం ఉన్నదన్నమాట. కొన్ని పాదాల్లో భావ ప్రకటన కోసం పదగణాలు ఎక్కువ గాని, తక్కువ గాని ఉంటాయి. కాని ఇలాంటి సందర్భాలు అరుదుగా వుంటాయి. (ఈ విషయాన్ని ముందు ముందు మరింత విశదీకరిస్తాను)- గణాల రీత్యా ఈ నాలుగు పాదాలను పరిశీలిస్తే - ఒకటో పాదం నాలుగో పాదంతోను, రెండోపాదం మూడో పాదంతోను సమానమన్నమాట. మొదటి పెద్ద పాదాన్ని రెండు

పాదాలుగా విభజించటానికి ఆ రెండు పాదాద్యక్షరాలు (వి-వి) ఒక్కటే కావటం (అక్షర మైత్రి) కూడా ఒక కారణంగా చెప్పవచ్చు. ఇలా మార్చి రాసిన పాదాలను అందులోని లయను స్పష్టంగా నిరూపించటం కోసం మరో రకంగా కూడా రాసి చూపవచ్చు.

"బ్రతుకు -

బజార్లో। నిలబడింది।"

దిగులుతో। దైన్యంతో। బరువుతో। బాధతో।

"విప్పచ్చుని। బాణంలా।

విచారం। దూసుకు। పోయిన। గుండెతో।"

ఇందులోని మొదటి పాదంలోని ఒకే ఒక పద గణం ప్రధాన విషయంగా వచ్చింది. తరువాత వచ్చిన రెండు, మూడు, నాలుగైదు పాదాలు ఒక యూనిట్. 2, 3, పాదాలొక సబ్ యూనిట్‌గా - 4, 5 పాదాలు మరో సబ్ యూనిట్‌గాను మనం స్వీకరించవచ్చు. ఈ సబ్ యూనిట్లకు అంత్యప్రాస కూడా ఉంది. ఒక్కొక్క సబ్ యూనిట్‌లో సమానంగా ఆరేసి (2+4) పదగణాలున్నాయి. విడివిడిగా చూస్తే రెండో పాదం నాలుగో పాదానికి, మూడోపాదం అయిదో పాదానికి సమానమవుతాయి. వచన పద్య నిర్మాణంలో కవులెంతో వైవిధ్యాన్ని ప్రదర్శింపవచ్చునని, ఎంతటి వైవిధ్యంలోనైనా కొన్ని సామాన్య లక్షణాలుండకపోవని చెప్పటానికే కుందుర్తి పాదాలను రకరకాలుగా మార్చి చూపటం జరిగింది. వచన పద్యంలోని లయను గూర్చి దాని వైవిధ్యాన్ని గూర్చి స్పష్టంగా చెప్పటం కోసం కూడా ఇలా పై వచన పద్య పాదాలను భిన్న రీతుల్లో రాసి చూపడం జరిగింది. ఇంతవరకు నేను స్వీకరించిన ఉదాహరణలు "వచన పద్యం - లక్షణ చర్చ" అనే పుస్తకంలో సంపత్కుమార గ్రహించిన వాటిల్లో కొన్ని మాత్రమే. సంపత్కుమార స్వీకరించిన ఉదాహరణలను నేనూ తీసుకోవటానికి కారణం వారి కృషి మీద నాకున్న గౌరవ భావమే.

ఫిబ్రవరి 'భారతి'లో చేకూరి రామారావు స్వీకరించిన Martyr అనే కవితను కూడా విభజించి చూపిస్తాను

The / white / Man / killed / my / father, /

My / father / was / proud /

The / white / Man / seduced / my / mother /

My / mother / was / beautiful /

The / white / Man / burnt / my / brother /

beneath the noon day sun,

My / brother / was / strong /

His / hands / red / with / black / blood /
The / white / Man / turned / to / me /
And / in / the / conquerer's / voice / said /
Boy ! / a / chair / a / napkin / a / drink /
- DAVID DIOP

ఇందులోని 1, 3, 5, పాదాల్లో ఆరేసి పదగణాలున్నాయి. ఇవి సమానం. అలాగే 2, 4, 6, పాదాల్లో నాలుగేసి పద గణాలున్నాయి. ఇలా ఇవి సమానమౌతున్నాయి. 1, 3, 5 పాదాల్లో గల ఆరు పదగణాల నిర్మాణమే 7, 8, 9, 10 పాదాల్లో కూడా తిరిగి తీసుకోబడింది. ఇక్కడ వరుసగా నాలుగు పాదాలు ఒక దానికొకటి సమానం. పెట్టెలో పెట్టినట్లు సూచించబడ్డ అయిదవ పాదంలోని beneath the noon day sun అనేది విశేష భావస్ఫూర్తి కోసం వచ్చిన "అధిక పద గణరాశి" అన్నమాట. తెల్లవాడు మా అన్నను కేవలం మాడ్చాడనటం వల్ల వాడి దుష్కృత్యంలోని భావ సాంద్రత తెలియదు. అందుకోసం భయంకరమైన మధ్యాహ్నపు మండుటెండను కవి అధికంగా ఈ పాదంలోనికి పట్టుకువచ్చాడు. అలాగే చివరి పాదంలో పెట్టె గుర్తులో వున్న Boy అనే పదగణం కూడా ఎంతో ప్రధానంగా కావాలని అధికంగా వేసినటువంటిది. తెల్లవాడి దుష్కృత్యాలను చెప్పుకొంటున్నది వయస్సులో చాలా చిన్నవాడనే సంగతి ఈ చివరి పాదం వరకు మనకు తెలియదు. ఈ అధిక పదగణంతో ఆ సస్పెన్స్‌ను కవి తొలగించే సందర్భమిది. ఈ బాయ్ అనే పదగణం మనమింతకు ముందు చెప్పుకున్న కుందుర్తి కవితలోని "బ్రతుకు" వంటిది.

వచన పద్య లక్షణాలను మరికొంత విశాలంగా పరిశీలించటం కోసం వర్తమాన ప్రముఖ కవులు రాసిన కొన్ని వచన పద్యాల్ని అక్కడక్కడ తీసుకొని మీ ముందు ప్రదర్శిస్తాను. చెరబండరాజు రాసిన 'గమ్యం' అనే కవితలోని పంక్తుల్ని ఇలా విభజించి రాస్తున్నాను.

"నా । పేరు । ఆకలి ।
సాయుధం । నా । శరీరం ।
ఆక్రమణ । నా । ఉనికి ।
ఉద్యమం । నా । ఊపిరి
విప్లవం । మా । ఊరు ।"

ఈ విభాగంలో ఐదు పాదాలున్నాయి. ప్రతి పాదంలోను మూడేసి పదగణాలున్నాయి. ఇలా ఈ పాదాలు సమానం.

ఆరుద్ర రాసిన 'వరమిచ్చే పూజారి' అనే కవితను పరిశీలిస్తాను.

"ఆఫీసు । మూసేసినా । ఉంటాడు । బంట్రోతు ।

ఆఫీసరు । గుర్రం. । అతగాడు రౌతు ।

అవలా । నీ । పని । అవకుండా । జాప్యం ।

అయితే । పెట్టు । ఆ । చేతిలో । రూప్యం ।"

మొదటి రెండు పాదాల్లోను నాలుగేసి పదగణాలున్నాయి. చివరి రెండు పాదాల్లో అయిదేసి పదగణాలున్నాయి. ఇక్కడ వరుసగా రెండేసి పాదాలను ఒకో సబ్ యూనిట్‌గా భావించవచ్చు. అలా భావించటాకి అందులోని అంత్య ప్రాస కూడా దోహదం చేస్తుంది. ఇక్కడ రెండు సబ్ యూనిట్లకును అంత్య ప్రాస లేకున్నా ఆద్యక్షర మైత్రి రావటం మాత్రం గమనించవలసిన ప్రత్యేకత.

కె. శివారెడ్డి రాసిన కవితలో

" ఆకాశపు । వక్షంలోకి ।

అవని । అక్షుల్లోకి ।

తొలి । కిరణంగా । చొరబారి । పోతాను ।

నా । కలాల్ని । ఉలిగా । మలిచి ।

దానవుణ్ణి । దేవుణ్ణి । చేస్తాను ।

నా । పాళీకి । ప్రాణం । పోసి ।

ఇంటింటా । సన్నాయి । మ్రోగిస్తాను ।"

ఈ ఏడు పాదాల్ని రెండు యూనిట్లుగా విభజింపవచ్చు. మొదటి మూడు పాదాలు ఒక యూనిట్. ఒకటి, రెండు పాదాల్లో రెండేసి పద గణాలున్నాయి. ఈ రెండు పాదాలు పరస్పరం సమానం. ఈ రెండు పాదాలూ కలిసి నాలుగు పదగణాలున్న మూడవ పాదానికి సమానం. ఈ మూడవ పాదం మొదటి యూనిట్‌లో నాల్గవ పాదం లేని లోపాన్ని రెట్టింపు గణాల్ని కల్గి వుండటం వల్ల తొలగించగల్గింది.

రెండో యూనిట్ మళ్ళీ విడిగా పరిశీలిస్తాను స్పష్టత కోసం -

"నా । కలాన్ని । ఉలిగా । మలచి ।

దానవుణ్ణి । దేవుణ్ణి । చేస్తాను ।

నా । పాళీకి । ప్రాణం । పోసి ।

ఇంటింటా । సన్నాయి । మ్రోగిస్తాను" ।

ఇందులోని ఒకటి, మూడు పాదాలలో నాలుగేసి పద గణాలున్నాయి. ఈ రెండు పాదాలు ఒకదానికొకటి సమానం. అంత్యప్రాస కూడ సరిపోతుంది. అలాగే రెండు, నాలుగు పాదాలలో మూడేసి పద గణాలున్నాయి. ఈ రెండు పాదాలు ఒకదానికొకటి సమానం. అంత్య ప్రాస కూడా సరిపోతుంది. ఇక ఇందులోని సబ్ యూనిట్ల గూర్చి తెలియజేస్తాను. ఒకటి, రెండు పాదాలలో మొత్తం ఏడు పదగణాలున్నాయి. అలాగే 3, 4 పాదాల్లో మొత్తం 7 పదగణాలున్నాయి. ఇలా ఈ నాలుగు పాదాలు రెండు

సమానమైన భాగాలు. ఈ రెండు సమాన భాగాలను సబ్ యూనిట్లంటాము. ఇక్కడ ఈ రెండు సబ్ యూనిట్లకు ఆద్యక్షరమైత్రి, అంత్య ప్రాస - రెండూ కలిసి వచ్చాయి.

విహారి రాసిన కవిత చూడండి.

"తెరలా । వాలి ।
వానలా । ముంచి ।
రాక్షసిలా । నవ్వే ।
భయం । ముందు ।
కామాలూ ।
గామాలూ ।
తలక్రిందు ।"

దీన్ని రెండు యూనిట్లుగా విభజించవచ్చు. మొదటి నాలుగు పాదాలు ఒక యూనిట్. ప్రతి పాదంలోను రెండేసి పద గణాలున్నాయి. రెండు సమభాగాలుగా ఈ యూనిట్‌ను విడదీస్తే మొదటి రెండు పాదాలు ఒక సబ్ యూనిట్. తరువాతి రెండు పాదాలు మరో సబ్ యూనిట్. ఈ రెండు సబ్ యూనిట్లకు ఆద్యక్షరమైత్రి గాని, అంత్య ప్రాస గాని లేకపోవటం గమనించవలసిన ప్రత్యేకత. ఇక 5, 6, 7 పాదాలు రెండవ యూనిట్. ఇందులో వచ్చిన ఒక్కో పదగణం గల మూడు పాదాలు ఇవి. ఇందులోని మూడు పాదాలు సమానం. మొత్తంమీద గమనించవలసిన విశేషం మరొకటి వుంది. మొదటి యూనిట్‌కు, రెండో యూనిట్‌కు అంత్య ప్రాస వుంది. మాదిరాజు రంగారావు రాసిన "అందుకే అతడు" అన్న కవితలో పరిశీలిద్దాం.

"అతనికి । చావు । లేదని ।
అందరికీ । తెలుసు ।
ఎందరిలో । నిజంగా ।
ఉన్నా । డన్నదే । ప్రశ్న । "

ఇందులో ఒకటి, నాలుగు పాదాలు మూడేసి పద గణాలు కలిగి సమానమవుతాయి. 2, 3 పాదాలు రెండేసి పదగణాల్ని కలిగి ఉండి సమానమౌతాయి. ఈ నాలుగు పాదాల్ని మొత్తం మీద రెండు సమాన భాగాలుగా చేసి ఒక్కోదానిని సబ్ యూనిట్ అనవచ్చు. ఒకటి, రెండు పాదాలు కలిసి ఏర్పడే మొదటి సబ్ యనిట్‌లో ఎన్ని పదగణాలైతే వున్నాయో మూడు, నాల్గు పాదాలు కలిసి ఏర్పడే రెండో సబ్ యూనిట్‌లోను అన్ని పదగణాలే వున్నాయి. ఈ రెండు సబ్ యూనిట్లకు ఆద్యక్షర మైత్రి, అంత్య ప్రాస - రెండూ లేవు.

వేగుంట మోహనప్రసాద్ రాసిన 'త్రికాల భావితం' కవితలో -

"ఇహం । పొట్టి ।

పరం। దూరం।

వేగం। ఒకటే।

టైమ్। వేరు।

టెన్స్। వేరు।

ట్రైన్। పొడుగు।

టెన్స్। పొట్టి।

టైమ్। పొడుగ్గా। పర్చుకున్న। వెడల్పు। ... "

ఇక్కడి పాదాల్ని చాల జాగ్రత్తగ ఆలోచించాలి. మొదటి ఏడు పాదాల్లోను కేవలం రెండేసి పదగణాలే వున్నాయి. ఇలా చేయడం వలన కవిత పొడుగు పెరుగుతుంది. చివరి పాదంలో "టైమ్ పొడుగ్గా పర్చుకొన్న వెడల్పు" ద్వారా ఇక్కడ అంతకు ముందు పాదాల్లో వచ్చిన పదగణాలకు రెట్టింపు గణాలు అకస్మాత్తుగా వచ్చాయి. ఇలా రావటం వల్ల - ఈ చివరి పాదం వెడల్పు పెరుగుతుంది. సమర్థుడైన కవి కలం నుండి భావానుగుణమైన నిర్మాణం గల పాదాలు వెలువడతాయని తెలుస్తున్నది.

మహాకవి శ్రీశ్రీ నుండి కూడ ఒక ఉదాహరణ విశదీకరిస్తాను.

"విదూషకుని। వికట। హాసంలో।

కపాలం। పకా। లన్నది।

ఆకలి। అన్నం। వండుకుంది।

హంస। ఆకాశం। అందుకుంది"।

ఇందులో ప్రతి పాదంలోను మూడేసి పదగణాలున్నాయి. నాలుగు పాదాలు ఒకదానికొకటి సమానం. ఇది ఒక యూనిట్. ఇందులోని మొదటి రెండు పాదాలు ఒక సబ్ యూనిట్. చివరి రెండు పాదాలు మరో సబ్ యూనిట్. మొదటి సబ్ యూనిట్‌లోని పాదాలకు పరస్పరం అంత్యప్రాస లేకపోయినా చివరి సబ్ యూనిట్‌లోని పాదాలకు అంత్యప్రాస ఉంది. మొదటి సబ్ యూనిట్‌కు. రెండో సబ్ యూనిట్‌కూ అంత్య ప్రాస ఉన్నది.

డాక్టరు సి. నారాయణరెడ్డి "అక్షరాల గవాక్షాలు" నుండి ఒక ఉదాహరణ పరిశీలిస్తాను.

"జగత్తు। మత్తుగా। పడుకుంది।

తమస్సు। తపస్సులో। వుంది।

సగం। పీల్చి। పారేసిన। సిగరెట్టు।

జ్వలనమే। తన। ధ్యేయ। మంటుంది। "

ఇందులోని మొదటి రెండు పాదాల్లో మూడేసి పదగణాలున్నాయి. చివరి రెండు పాదాలలో నాలుగేసి పదగణాలున్నాయి. మొదటి రెండు పాదాలు ఒక యూనిట్.

చివరి రెండు పాదాలు మరో యూనిట్. మొదటి యూనిట్‌లోని పాదాలకు అంత్యప్రాస వుంది. రెండో యూనిట్‌లోని పాదాలకు అంత్యప్రాసలేదు. కాని మొదటి యూనిట్‌కు రెండో యూనిట్‌కు అంత్యప్రాస ఉన్నది.

ఈ పరిశీలనలో తేలిన విషయాలను ఇక్కడ పొందుపరుస్తాను.

1. వచన పద్యాన్ని కొన్ని యూనిట్లుగా విభజించవచ్చు.
2. ఒక్కో యూనిట్‌లోని పాదాల సంఖ్య నియతం కాదు.
3. సమాన పదగణాలను కలిగిన కొన్ని పాదాల సమూహాన్ని ఒక యూనిట్ అనవచ్చు.
4. ఒకటి గాని, అంతకు మించిన యూనిట్లను గాని వచన పద్యం కలిగి వుంటుంది.
5. పాద విశ్రాంతి సరిపోయేటట్లుగా ఒక యూనిట్ రెండు సమానమైన భాగాలుగా వుంటే ఒక్కో భాగాన్ని "సబ్ యూనిట్" అనవచ్చు.
6. సబ్ యూనిట్ అంటే కనీసం రెండు పాదాలకు తక్కువగా ఉండదు. (అంతకు తగ్గితే దాన్ని ఒక పాదమనే అనాల్సి వుంటుంది. పాదానికి సబ్ యూనిట్‌కి తేడా ఉండటం కోసం ఇలా భావింపబడుతోంది.)
7. ప్రతి యూనిట్‌లోను సబ్ యూనిట్ ఉండాలని లేదు. (ఉదా : రెండు పాదాల యూనిట్ ఉన్నప్పుడు అందులో సబ్ యూనిట్ ఉండదు.)
8. సబ్ యూనిట్లకు గాని, యూనిట్లకు గాని ఆద్యక్షరమైత్రి ఉంటే ఉండవచ్చు, లేకపోతే లేకపోవచ్చు - అలాగే ప్రాస, అంత్య ప్రాసలు కూడా.
9. విశేష భావస్ఫూర్తి కోసం అక్కడక్కడ కొన్ని పాదాల్లో కొన్ని పదగణాలు ఎక్కువగానూ ఉండవచ్చు, తక్కువగానూ ఉండవచ్చు. కాని ఇలాంటి సందర్భాలు భావాన్నిబట్టి ఉంటాయి.

పాదాంత విషయంలో విరామం ఉంటుందన్న సంపత్కుమార అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తాను. ఇలా పదగణాలను బట్టి వచన పద్యాలకు లక్షణాలు భావింపవచ్చు. వచన పద్య లక్షణాలను సర్వసమగ్రంగా నిర్ణయించటం కష్టం. నా పరిశీలనలోకి వచ్చిన విషయాలను ఇలా ఈ వ్యాసం ద్వారా సహృదయులందరికీ తెలియజేసుకుంటున్నాను. రామారావు, సంపత్కుమార ... ఇంకా ఎందరో సాహితీ విమర్శకులు ఈ విషయం మీద చేసిన పరిశీలన ఈ వ్యాసానికి స్ఫూర్తి. వారికి ఈ వ్యాస రచయిత కృతజ్ఞతలు.

*(భారతి, మే 1980)*

# నార్ల రాసుకొన్న 'ఎలిజీ'

చనిపోయిన వాళ్లమీద కవులు రాసే గేయాల్ని స్మృతి గేయాలంటారు. ఒక కవి తాను బ్రతికి ఉన్నప్పుడే చనిపోయాక తనను గురించి నలుగురూ ఏమంటారో భావించుకుని తన మీదే రాసుకున్న గేయాన్ని "స్వీయ స్మృతి గేయం" అనవచ్చు ననుకుంటాను.

ప్రముఖుడు మొదలైన విశేషణాలు నార్లకు తగిలించాల్సిన అవసరం లేదు. ఈ రోజుల్లో పత్రికల్లో పడుతున్న ప్రతి వాడి పేరు ముందు ప్రముఖుడు అనే మాట కనిపిస్తూనే ఉంది. నార్ల అంటే చాలు సహృదయులందరికి తృప్తితో కూడిన అనుభూతి.

నార్లకు లోకం బాగా తెలుసు. ఆయన కళ్లముందు ఎందరో ప్రముఖులు, మేధావులు, దేశ భక్తులు, మహా కవులు వెళ్లిపోయారు. వాళ్ళు మరణించిన సందర్భాల్లో ఎందరివో దొంగ ఏడ్పులు, ఆ ఏడ్పుల వెనుక స్వార్థం కోసం పడే తిప్పలు చూశారాయన. "జగన్నాటకం" అనే కవితా సంపుటిలో ఆయన ఏనాడో రాసుకున్న అద్భుతమైన గేయం "నే మరణిస్తే". ఈ గేయం ఇలా మొదలవుతుంది.

" నే మరణిస్తే<br>
రాస్తాయండి<br>
రాస్తాయి కొన్ని<br>
పత్రికలైనా<br>
ప్రముఖుండొక్కడు<br>
పరలోకానికి<br>
పయనించాడని..."

గొప్పవాళ్ల ఆదర్శాలు, లక్షణాలు ఎవరికీ అవసరం లేదు. కాని ఆ గొప్ప వాళ్ళు చనిపోయిన రోజు మాత్రం పత్రికలు, ప్రచార సాధనాలు వాళ్ల కృషిని గురించి వేనోళ్ల పొగుడుతాయి. బతికున్నపుడు ఆయనను కొన్ని పత్రికలు ఎలా నిందించాయో పాఠకులకు బాగా తెలుసు. ఈ సంగతులన్నీ ఆయన ఏనాడో ఊహించగలిగాడు గనుక ఇలా రాసుకోగలిగాడు.

"నే మరణిస్తే<br>
అంటారండి<br>
అంటారు నేడు

తెలుగు జాతికే
తీరని నష్టం
వాటిల్లిందని
నోటి మాటగా ..."

ఆయన మొగమోటం లేని మనిషి. ఆయన చెప్పే చేదు నిజాలను కొందరు వంట బట్టించుకోకుండా వ్యక్తిగతంగా తిట్టిన వాళ్ళున్నారు. రకరకాల పదవుల్లో కులుకుతూ స్వార్థానికి అంకితమై బురద చల్లిన వాళ్ళంతా నోటి మాటగా సంతాప సందేశాలిస్తారని ఊహించాడు.

"నే మరణిస్తే
చేస్తారండీ
చేస్తారు పెక్కు
ఆంధ్ర సభల నా
ఆత్మ శాంతికై
తడయక తెగబా
రెడు తీర్మానం ..."

మన దేశంలోని కొందరు కుహనా సాహితీ వేత్తలకు కొన్ని "టెక్నిక్"లు తెలుసు. చనిపోయిన వాళ్ళ ఆదర్శాలు, విలువలు, నైపుణ్యాల గురించి ఏ మాత్రం తెలియకపోయినా పత్రికల్లో తమ పేర్లు చూస్తుకునే కండూతితో పెద్ద పెద్ద సంతాప తీర్మానాలు చేసి పంపుతూంటారు. ఆ చనిపోయిన వాళ్ళు ఎందుకు గొప్పవాళ్ళయ్యారో తెలుసుకోవడానికి తమ జన్మలో ప్రయత్నించి ఉండరు. ప్రయత్నించరు కూడా. అది వాళ్ళకు అనవసరం కూడా. అలాంటి వాళ్ళను అసహ్యించుకుంటాడు నార్ల.

"నే మరణిస్తే
వస్తాయి సుమా !
వస్తాయి కొన్ని
ప్రకటనలైనా
ప్రజా కోటి నా
స్మారక చిహ్నం
స్థాపించాలని ..."

గొప్పవాళ్ళ పేర్లు అడ్డం పెట్టుకుని చందాలు వసూలు చేసి స్వాహా చేయడం చాలా మందికి వెన్నతో పెట్టిన విద్య. గొప్పవాళ్ళు చనిపోయిన తరువాత వాళ్ళ పేర్లతో

ఎందరో ఎన్ని రకాలుగానో డబ్బు వసూలు చేస్తుంటారు.

" నే మరణిస్తే
రాను, నిజంగా
రాను సోదెలో
కైనా గిర్రున
అయిదారు నెలలు
తిరగక ముందే
తెలుగు గడ్డపై ... "

చనిపోయిన వాళ్ల కోసం కొత్తలో నానా రకాలుగా ఆర్భాటం చేస్తారు. తమ స్వార్థ ప్రయోజనాలు నెలవేరితే చాలు. అప్పటికి ఆ మహానుభావుడు చనిపోయి అయిదారు నెలలు కూడా గడవక ముందే ఆయనను మరిచిపోతారు. అటు తరువాత సోదిలోకి కూడా రానివ్వరు.

ఏది ఏమైనా విలువైన సత్యం ఒకటుంది. దాన్ని ఆయన మరిచిపోలేదు. అందుకే ఈ విధంగా ఆ గేయాన్ని ముగించాడు.

"నే మరణిస్తే
ఏ నా పాటో
ఏ యెదలోనో
చిక్కని చీకటి
చీల్చగ పెట్టిన
దీపము మాత్రమె
దీటుగ నిలుచును
నే మరణిస్తే"

ఎవరెన్ని రకాలుగా వేషాలు వేసినా సహృదయులనే వాళ్ళు కొందరున్నారు. వాళ్ళు వెలుతురు మనుషులు, చీకట్లకు బలిగాకుండా తమ హృదయ ద్వారాల చెంత నార్ల వారి సందేశాల్ని కాపలా దీపాలుగా ఉంచుకొని రక్షించుకుంటారనే ఆత్మ విశ్వాసం గేయానికి విలువైన ముగింపు. తాను చనిపోతే ఈ లోకం ఎలా ప్రవర్తింస్తుందనే అంశం మీద గేయం రాయటం సాహసం. అలా రాసేటప్పుడు ముక్కుసూటిగా ఈ లోకాన్ని విమర్శించడం మహా సాహసం. ఆయన మూర్తిమత్వాన్ని తెలియజేసే "బ్లూ ప్రింట్" ఈ గేయం.

*(ఆంధ్రప్రభ, 10-3-1985)*

# తొలి వచన కవిత

1939 జూలై ఆగస్టు నెలల మధ్య వెలువడిన పఠాభి "ఫిడేలు రాగాల డజన్" పుస్తకరూపంలో వచ్చిన అసలు సిసలు మొదటి వచన కవితా గ్రంథం అని ఆరుద్రగారు అంటూ పఠాభి వింతరాగాల వెల్లువ దేశం మీద విరుచుకు పడటానికి ఒక ఏడాది ముందుగానే శిష్ట్లా కృతులు నవమి చిలుక, విష్ణు ధనువు అనే సంపుటాలు వెలువడ్డాయని కూడా "వచన కవిత ప్రయోగ వైవిధ్యం" అనే వ్యాసంలో రాశారు. ఆరుద్ర దృష్టిలో వచన కవితకు శిష్ట్లా ఆద్య బ్రహ్మ, నవ్యకవిత్వానికి నాంది పలికినవాడిగా అతణ్ణి ముందు స్మరించాలి. (సమాలోచనం - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, 1980)

అదే వ్యాసంలోనే ఆరుద్ర గారు ఇలా చెప్తున్నారు.

"వాస్తవానికి జయంతి గంగన్న పంతులు గారు 1922 లోనో, 1923లోనో గాంధీ మహాత్ముడు యార్వాడ జైలులో నున్న దినములలో వ్రాసి 1935 జూలై మాసం భారతిలో ప్రకటించిన "పరీక్ష చదువులు" అనే రచనలో వచన కవిత్వ బీజాలున్నాయి" అన్నారే కాని ఈ కవితను ఆరుద్ర గారు ఉదహరించలేదు. ఇందులో వచన కవిత్వ బీజా లెలాగున్నాయో కూడ వివరించలేదు.

నారాయణరెడ్డి "ఆధునికాంధ్ర సాహిత్యము - సంప్రదాయములు : ప్రయోగములు" అనే గ్రంథంలో కవికొండల వ్రాసిన "నక్కాసామిగాడు" అనే వచన గీతికను పేర్కొన్నారు. దాని ప్రచురణ కాలం 1933 జూన్ 17 (కృష్ణా పత్రిక)

ఇలా రకరకాల అభిప్రాయాలను బట్టి చూస్తే 1930కి పూర్వం వచన కవిత రచింపబడలేదేమోనని సహజంగా మనకనిపిస్తుంది. కాని ఇది నిజం కాదు. నవ్య కవిత్వానికి నాంది పలికిన గురజాడ తొలి వచన కవితకు కూడా 1915 కు పూర్వమే ప్రారంభోత్సవం చేశాడు.

"ఖండ కావ్య ప్రక్రియ, గేయ గుణం, ఆత్మాశ్రయత్వం, నవ్యతా దర్శనం - ఇవన్నీ నవ్యకవులకు గురజాడ పెట్టిన భిక్ష, అక్షయ భిక్ష" అని కె. వి. రమణారెడ్డి గారు అన్నారు. (ముత్యాల సరాలు - ఎమెస్కో ప్రచురణ, 1972 - "రసగీతాలు" అనే పీఠిక)

"గణబద్ధ ఛందస్సుల ఫ్యూడలిజం నుండి మాత్రాబద్ధ ఛందస్సుల ప్రజా స్వామ్య

యుగానికి ఆంధ్ర సాహిత్య చరిత్ర గమనాన్ని పరివర్తన చేసిన వాడు గురజాడ" అని శ్రీరంగం శ్రీనివాసరావు అన్నారు. (ముత్యాల సరాలు - విశాలాంధ్ర ప్రచురణ 1965, శ్రీశ్రీ వ్రాసిన "పరిచయం")

వచన కవితకు కూడా అక్షయ భిక్ష పెట్టి, వచన కవిత్వ యుగానికి శ్రీకారం చుట్టిన వాడు గురజాడ అప్పారావే.

విజయనగర సంస్థానోద్యోగులు చక్రవర్తుల తాతాచార్యులు గారు, మహాకవి గురజాడను నీలగిరిలో ఉన్నప్పుడు, తనపై ఒక గీతాన్ని చెప్పాలని అడిగినట్లు, అప్పుడా మహాకవి ఈ క్రింది గీతాన్ని చెప్పినట్లు విశాలాంధ్ర ప్రచురణాలయం వారి "ముత్యాల సరాలు" (1965) 70 వ పుటలో పేర్కొనబడి వుంది. కవిత పేరు "భొట్టు".

**"నూగు మీసపు కట్టు**
**కానరాని బొట్టు**
**నోటాన సిగరెట్టు**
**కోటు వింత కుట్టు**
**చే కఱ్ఱ జిలుగు వెండికట్టు**
**నీలగిరి కొలను గట్టు**
**పై విహరించు వైష్ణవ భొట్టు"**

ఇది వచన కవిత కాదని, మాత్రా ఛందస్సు గల గీతమని వాదింప బూనటం భావ్యం కాదు.

**నూగు మీ / సపుకట్టు /**
**కాన / రాని / బొట్టు /**
**నోటాన / సిగరెట్టు /**
**కోటు / వింత / కుట్టు /**

ఈ విధంగా మొదటి నాలుగు పాదాలకు మాత్రమే తాపత్రయపడి మాత్రా ఛందస్సును నిరూపించవచ్చు. 1, 3 పాదాలలో పదేసి (5 5) మాత్రలు, 2, 4 పాదాలలో తొమ్మిదేసి (3 3 3) మాత్రలు వచ్చాయని సర్ది చెప్పవచ్చు గాని, చివరి మూడు పాదాలు ఈ మాత్రా ఛందస్సుకు లొంగవు. ఇది ఏడు పాదాలున్న కవిత. మొదటి నాలుగు పాదాలలోను మాత్రా ఛందస్సు కాకతాళీయంగా వచ్చినట్టిదే. కనుక ఇది వచన కవిత అనే చెప్పాల్సి వుంటుంది. విశాలాంధ్ర ప్రచురణాలయం వారు ఇది

ఎపుడు రచింపబడ్డదో చెప్పలేదు గాని, గురజాడ 1915 నవంబరు 30వ తేదీన చనిపోయాడు కాబట్టి ఈ తొలి వచన కవిత 1915కు ముందుగా రాయబడిందని మాత్రం చెప్పటానికి అవకాశం ఉంది.

గురజాడకు అక్కడక్కడా ఛందోభంగాలు చేయడం పరిపాటి అని శంకరగంటి రంగాచార్యులు ప్రభృతులు భావించటం సరికాదు. ఛందస్సుకోసం పదాల రూపాల్ని మార్చేవాడు గురజాడ, కాని ఛందోభంగం చేసేవాడు కాడు. "పుత్తడి / బొమ్మను / పూర్ణ / మ్మను ఒక / ముదుసలి / మొగుడికి / ముడి వే / స్రి ..." అన్నారంటే చివరి గణంలో ఛందోభంగం ఉన్నట్లుకాదు. నాలుగు గణాల నడకలో చివరి గణంలో "స్రీ" అని రెండు మాత్రలే అని భావించవలసిన పనిలేదు. "స్రీ" అనే అక్షరాన్ని నాలుగు మాత్రలుగా దీర్ఘం తీసి పలకాలి. ఛందస్సుకు అనుకూలించే విధంగా కొన్ని అక్షరాలు సాగదీయటమూ, కొన్ని అక్షరాలను కుంచించడమూ కూడా మామూలేనని కొందరు వాదించవచ్చు. ఇలా వాదించేవారి లెక్క ప్రకారం ఈ కవిత ఇలా ఉంటుంది.

నూగు మీ / సపు కట్టు
కాన రా / (నీ) బొట్టు
నోటాన / సిగరెట్టు
కోటు విం / (తా) కుట్టు
చే కర్ర / జిలుగు వెం / (డీ) కట్టు
నీ(ల్) గిరి కొ / లను గట్టు
పై(న) విహ / రించు వై / ష్ణవ భొట్టు"

ఇది చాలా కృతకమైన నడక అవుతుంది. గురజాడ మనస్తత్వానికి ఈ నడక విరుద్ధం. ఈ రకంగా అక్షరాలు సాగదీసి రాయటం గురజాడ ఎక్కడా చేయలేదు. భావ విశ్రాంతిని బట్టి భావం స్పష్టంగా ఉండటం ప్రధానంగా చివరి పాదంలో, అదీ చివరి గణంలో కొన్ని మాత్రలు తగ్గించేవాడు. అక్కడ దీర్ఘం తీయడం వల్ల లయ సహజంగా పెరుగుతుంది. కాబట్టి గురజాడ దీనిని గేయంగా రాశాడని చెప్పటానికి వీలులేదు. ఇది నిస్సందేహంగా తెలుగులో తొలి వచన కవిత.

*(భారతి, మే 1980)*

# రేడియో కవిత

"ఒక వ్యాసం, ఒక కథ, లేక నవల, ముఖ్యంగా నాటిక, నాటకం మటుకు రేడియోలో ప్రసారానికి ఒక ప్రత్యేకత కలిగి ఉండాలి. ఈ ప్రత్యేకతనే 'రేడియో టెక్నిక్' అని అంటారు. పత్రికలలో ప్రచురించటానికి యోగ్యమైన వ్యాసం, ఒక రచన, రేడియోలో యథాతథంగా ప్రసారానికి యోగ్యం కాదు. పది మందిని కూర్చోపెట్టుకొని వారికి చెపుతున్నట్టుగా ఉండాలి... నాకు తెలిసినంతవరకు కవిత్వం రాయటమంటూ ఉండదు. గనుక ... క్షమించండి. రేడియో కవిత్వం మటుకు ఇంకా లేదు. వచ్చే అవకాశం కూడా లేదు."

ఇవి పన్యాల రంగనాథరావు యువభారతి ప్రచురించిన "మహతి"లో వెలిబుచ్చిన అభిప్రాయాలు. 'రేడియో టెక్నిక్'కు కవిత్వం ఒక్కటే భిన్నమని, రేడియో కోసం కవిత్వం రాయడం జరుగదని, రేడియో కవిత వచ్చే అవకాశం లేదని ఆయన అభిప్రాయపడుతున్నారు. రేడియో నాటిక, రేడియో ప్రసంగంలాగానే 'రేడియో కవిత'ను కూడా కొత్తగా ప్రతిపాదింపదలుచుకున్నాను. ఆ విషయం సవివరంగా మనవి చేస్తాను. 'రేడియో టెక్నిక్'కు కవితలో కూడా అవకాశం లేకపోలేదని, రేడియో కోసం ప్రత్యేకంగా కవిత్వం రాయడం కూడా ఎంతైనా అవసరమని, రేడియో కవిత వచ్చే అవకాశాలున్నాయని నా భావన. అందుకే ఈ వ్యాసం.

పత్రికల్ని నిరక్షరాస్యులు చదవలేరు. అంటే - జనసంఖ్యలో చాలా ఎక్కువ శాతం పత్రికల్ని చదవటం లేదన్న మాట. భారత దేశంలో నిరక్షరాస్యుల శాతం అధికం. పత్రికలు చదివే పాఠకులకన్న (ఆ పాఠకులూ రేడియో వింటూంటారు) 'రేడియో' వినే శ్రోతలే చాల ఎక్కువమంది అనే విషయం మనం గుర్తుంచుకోవాలి. అందుకే అక్షరాస్యులతో పాటు నిరక్షరాస్యులకు కూడా అర్థమయ్యేటట్లు ఇతర కార్యక్రమాల వలెనే రేడియోలో కవితా కార్యక్రమం కూడా రూపొందింపబడాలి. భారత దేశంలోని నిరక్షరాస్యులైన అధిక ప్రజల దృష్ట్యా 'రేడియో కవిత' ఎంతో అవసరం కూడా. దాని వలన నిరక్షరాస్యులైన ప్రజల్లో కూడా మనం చైతన్యాన్ని తీసుకురాగల అవకాశాలు ఎక్కువగా ఉంటాయి.

ఇక్కడ ఒక చిన్న అనుమానం కలుగవచ్చు. చదువులేనివాడు కవిత విని స్పందించగలడా ? 'సహృదయత' అనేది ఉంటే ఎవడైనా స్పందిస్తాడు. దీనికి, అక్షరాస్యతకు ఎలాంటి సంబంధం లేదు. బాగా చదువుకున్న వాళ్ళలోను 'సహృదయత' లేని వాళ్ళుంటారు. చదువురాని వారిలోను ఎంతో 'సహృదయత' కలిగిన వాళ్ళుంటారు. ఒక్క విషయం గమనించాలి. భాష మాత్రం అందరికీ అర్థమయ్యేలా ఉండాలి. మనం

ఒక చక్కని 'జోకు' విసిరా మనుకోండి. ఒకోసారి బాగా చదివిన వాడికన్న చదువులేనివాడే ముందుగా అనుభూతి పొందటం మనం చూస్తూనే ఉన్నాం. అది వాడి హృదయగతమైన సంస్కారం. కవిత్వం వేరు, జోకు వేరు అంటారా ! ఆనందించగలిగే హృదయం దేనికైనా ముఖ్యం అనేది గమనించాలని మనవి.

ఒక్కమాటలో చెప్పాలంటే 'రేడియో కవిత'కు ముఖ్యలక్షణం స్పష్టత. కవితలో స్పష్టత ఎంత బాగా ఉంటే 'రేడియో కవిత' అంత బాగున్నట్లు భావింపవచ్చు. ఇక్కడ ఒక చిన్న మనవి. స్పష్టంగా ఉన్న కవిత నీరసంగా ఉంటుందని అనుకోవటం తెలివి తక్కువతనం. ఉత్తమ భావాల్ని స్పష్టంగా చెప్తూ ఆలోచింపచటం వలన అనంతమైన లోతుల్ని దర్శింపజేయ గలిగేది నిజమైన ఉత్తమ కవిత. పరిచిత విషయాలను, పరిచిత వస్తువులను కవిత్వంలో ఉపమానాలుగా, సంకేతాలుగా వాడుకుంటూ అపరిచితమైన అనంత భావ సౌందర్యాన్ని దర్శింపజేయవచ్చు (Known to unknown) అన్న ఆధునిక విద్యా బోధనా సూత్రాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. 'ఆపాత మధురం ఆలోచనామృతం' అన్నట్లు ఉంటే అది రేడియో కవిత అవుతుంది. కాని ఇప్పుడు రేడియోలో ప్రసారం అవుతున్న కవితలలో అస్పష్టత, క్లిష్టత ఉంటున్నట్లు ఒక విమర్శ ఉంది.

కవిత్వంలో సహజంగా ఎప్పటికప్పుడు నూతనమైన ప్రయోగాలు జరుగుతుంటాయి. తప్పదు. అలాగే 'రేడియో కవిత'లో కూడా అట్టి ప్రయోగాలు తప్పక పోవచ్చు. కాని ఆ ప్రయోగాలు జన సామాన్యానికి అర్థం కావాలన్న రేడియో కవిత్వ లక్ష్యం పరిధిలోనే జరగాల్సి ఉంటుందనే మాట మనం మరచి పోగూడదు.

పత్రికలో పడిన కవిత అర్థం కాకపోతే నాలుగైదు సార్లు చదివి అందులోని భావం ఎట్టకేలకు గ్రహించవచ్చు. 'రేడియో కవిత' అలా కాదు. కవితలు చదువుతూ ఉండే సమయంలోనే భావాలను శ్రోతలు నిశ్చయంగా గ్రహించగలిగేటట్లు ఉండాలి. అందుకోసం కవి చదవడంలో కూడా 'స్పష్టత' ఉండి తీరాలి. ఒక కవి ఎంత ప్రముఖుడైనా కావచ్చు. చదవటంలో స్పష్టత లేకుంటే స్పష్టంగా చదవగల మరో వ్యక్తితో చదివించటం ఉత్తమం.

'రేడియో కవిత' చదివేటప్పుడు కవి మరో విషయం గుర్తుపెట్టుకోవాలి. ఇది చాలమందికి తెలిసిందే, కాని అందరూ పాటించరు. ఒకోసారి ఆకాశవాణి వారు కూడా నిరుత్సాహపరచటం జరుగుతుంది. 'రేడియో కవిత' లోని ముఖ్యమైన సుందర భావాల్ని వెలువరించే పాదాలను కవి పునఃపఠనం చేయవచ్చు. రేడియో శ్రోతల ఆసక్తిని బాగా ఉద్దీపింపజేయటానికి మనసుల్ని అన్యాక్రాంతం కాకుండా కవిత వైపుకే లాగిపట్టి ఉంచటానికి పాటకు పల్లవి లాగ 'రేడియో కవిత'లో కూడా కొన్ని

పాదాలుంటే మంచిది. వాటిని మధ్య మధ్య పునఃపఠనం చేస్తుంటే బాగుంటుంది. ఆ పాదాలు కవితను ప్రారంభించిన మొదటివైనా కావచ్చు. లేక భావ సౌందర్యాన్ని బట్టి, లేదా భావ ప్రాధాన్యాన్ని బట్టి ఎక్కడ ఉన్న పాదాలనయినా సరే ఈ ప్రయోజనానికి ఉపయోగించుకొనవచ్చు.

సింగరాచార్య ఒకచోట "కప్పూ" అనే మాటకు బదులు "Cup+ఊ" అని, "స్పూనూ" అనే మాటకు "Spoon+ఊ" అని విచిత్రమైన చమత్కారాలు చూపించారు. శార్వరి ఇంగ్లీషు అంకెలలో కొన్నిటిని ఏరి తెలుగు పదాల్ని సృష్టించారు.

"అపాయం 3 తుంది.

6 బైట పడుక్కొన్న ప్రదేశం

జనత 7 స్తుంది"

ఇట్టి చమత్కారాలు పఠితలకు మాత్రమే విశదమవుతాయి. ఈ చమత్కారాల్ని రేడియో ద్వారా మనం శ్రోతలకు అందింపలేము. కాబట్టి ఇట్టి కవితలు పత్రికలలో ప్రచురింపబడవచ్చు గాని రేడియో కవితలుగా మాత్రం పనికిరావు. కాబట్టి 'రేడియో కవిత', సామాన్య కవిత కన్న భిన్నమైనదని మనం అంగీకరించవచ్చు.

మరో ముఖ్య విషయం "మాయకవిత్వం" రాసే కొందరు కవులు ఉన్న సంగతి కూడా ఆకాశవాణి మరచిపోరాదు. మాయకవితల్ని పత్రికలలోనే ప్రచురించవద్దని, కేవలం అస్పష్టత, ఏదో భావాల పులుముడు తప్ప వాటిల్లో చెప్పుకోదగ్గ సుగుణాలు లేవని ఇప్పుడిప్పుడే పాఠకుల నుండి పత్రికల మీదికి దాడులు ప్రారంభమవుతుంటే ఇక జనసామాన్యానికి చెందిన 'రేడియో'లో ప్రసారానికి అవి ఏ మాత్రం పనికిరావనే సంగతి వేరే చెప్పవలసిన పని లేదనుకుంటాను. స్పష్టత గలిగిన 'రేడియో కవిత' జనసమూహాల్ని అలరించటం వలన ఆధునిక కవులు కొందరికి 'అస్పష్టత' పై ఉన్న మోజు కూడా తగ్గిపోయే శుభ పరిణామాలు వస్తాయని ఆశిద్దాం. వర్తమాన కవితారంగం బలాన్ని పుంజుకొని అభ్యుదయం సాధించగలదని విశ్వసిద్దాం.

'రేడియో కవిత' పెంపొందటానికి అన్నింటి కన్న ముందుగా ఆకాశవాణి వారు మంచి రేడియో కవితలను ప్రోత్సహించాలి. అలా ప్రోత్సాహం ఇస్తున్నట్లు ఆధునిక కవిలోకానికి తెలియాలి. పత్రికా కవిత కన్నా రేడియో కవిత ఒకటి ఉందనే దృష్టి ఆకాశవాణి వారికి లేకపోతే మాత్రం రంగనాధరావుగారన్నట్లు 'రేడియో కవిత' వచ్చే అవకాశం లేదు.

*(తెలుగు విద్యార్థి, మే 1981)*

# చెరబండరాజు కవిత

ఈ దేశంలో నెలకొని ఉన్న సర్వ దుర్మార్గాలకు పరిష్కారం ఈ దుష్ట వ్యవస్థను కూల్చడమే అన్న సిద్ధాంతంతో కవిత్వం రాసిన విప్లవ కవుల్లో అగ్రగణ్యుడు చెరబండరాజు. తాను నమ్మిన అభిప్రాయాలను ఆచరణలో పెట్టి చూపించిన వాడే మహాకవి అయితే శ్రీశ్రీ మహాకవి కాకపోవచ్చు. చెరబండరాజు మాత్రమే మహాకవి అవుతాడు. రాజీలేని జీవితం ఆయనది.

"ఏ రోజైనా
ప్రజా పోరాటాల విజయాన్ని రచించక పోతే
ఆ రోజు జీవించినట్లుండదు"

ఇది చెరబండరాజు వ్యక్తిత్వం.

"కలిసి వచ్చే దీన ప్రాణాలు మన వింటి బాణాలుగా మార్చి, స్వంత సుఖములు కోట్ల కష్ట జీవులకు అన్న పానీయములు జేసి నడవాలి, నడవాలి" అంటూ బోధించాడు. కాంగ్రెసు ఉన్నా, జనతా పార్టీ వచ్చిపోయినా, తెలుగుదేశం ఏలుతున్నా అన్నీ ఒకే చెట్టు కొమ్మలుగ భావించాడు. 'ఈ ఒకే విషవృక్షపు కొమ్మలు వేరు పువ్వులు పోసి వేర్వేరు కాయలు కాసి భిన్న రుచుల్ని అందిస్తాయి అనుకోవడం "వెర్రితనం" అంటాడు.

'హక్కు' అనే మినీ కవితలో ఇలా అంటాడు.

"చెట్లలో ప్రాణం వుందని నరకొద్దనను
ప్రకృతి కందమని ఆకులు కొయ్యొద్దనను
కొమ్మలు చెట్ల చేతులని విరవద్దనను
ఎందుకంటే
నాకు గుడిసె కావాలి."

ఇదీ చెరబండరాజు అవగాహన. 'యుద్ధం కంటే తేనె పూసిన ఇందిరా మార్కు చిరునవ్వు వల్లే ఎక్కువ ప్రమాదం ఉం'దంటాడు.

'ఈ మట్టి నాకు
పట్టెడన్నం పెట్టి పాలు తాపింది
రాక్షస భూస్వామ్య రంపపు కోతల్నుండి
తనను విముక్తి చేసి
రుణం తీర్చుకొంటాను'

'ప్రపంచ పురోగతి సొంతం శ్రమజీవి నెత్తుటి బొట్టులోనే యిమిడి వుందని, గొంతులో ఊపిరి ఉన్నంత వరకు బాధ్యతను పూలమాలగా స్వీకరిస్తాను' అంటాడు.

యువతరాన్ని ఉద్దేశిస్తూ ఇలా అంటాడు.

"నవ్వుతు ఉరికంబమెక్కి
సమిష్టికయి చనిపోయే
పీడిత జనపక్షపాత
దృష్టికన్న గొప్ప ఏది !

నీ యవ్వన తేజముతో
ప్రజాపోరు నడవాలి
నీ రక్తం పుష్పించగ
ఈ దేశం ఫలించాలి
యువతరమా, నవతరమా
యిదే అదను కదలి రమ్ము"

ఇంతటి మహత్తర విప్లవ భావాలు చెప్పిన చెరబండరాజు రాసిన మరో గొప్ప కవిత "మా పాప మాట్లాడుతుంది."

విప్లవ కవితా రచనలో వైవిధ్యం లేదనే విమర్శకు తావుండకూడదు. అలాంటిదే ఈ కవిత. ఇందులో భావుకత, ఎంతో అనుభూతి మనం గమనించవచ్చు.

"అమ్మా చెప్పమ్మా !
ఆ నల్ల మబ్బులు కాటుకా !
తెల్లటిది పొడరా !
అవును గదమ్మా !
మెరిసేవి బొట్లమ్మా !
తెచ్చియ్యమ్మా
పెట్టుకుంటాను!"

కథలు, నవలలు, నాటకాలు ఎక్కువగా రావలసిన తరుణంలో తానింకా కవిత్వాన్ని వదలడం లేదని కొంత ఆలోచించాడు ఆయన. విప్లవ ప్రచార అవసరాన్ని వచన కవిత్వం ఎక్కువగా తీర్చలేదని ఆయన అనుభవం చెప్పింది. కాబట్టే పాటలు రాయడం మొదలుపెట్టాడు. "పదిమంది నోళ్లలో నలగటానికి, ప్రతిక్షణం మననం చేసుకోవటానికి పనికి వచ్చే సాహిత్య ప్రక్రియ పాట. ఆ పాట జానపద శైలిలో సరళంగా, సూటిగా కవుల దృష్టితో కాక, ప్రజల దృష్టితో వాళ్ల స్థాయిలో విప్లవ అవసరాల దృష్ట్యా రాయబడినప్పుడు పాట ఎంత బలమైన ఆయుధంగా పని చేస్తుందో" అంటాడు.

"విప్లవ రచయితల్లోని కొందరు రచనలలోని నినాదాన్ని జీర్ణం చేసుకోలేని

వాళ్ళు లేకపోలేదు. ఇలాంటి వాళ్ళు 'ప్రచార సాహిత్యం' అని కొట్టివేసేవాళ్ళ బుట్టలో పడే ప్రమాదం ఉంది. అట్లని విప్లవ రచయితలు కళావిలువల్ని ఖాతరు చెయ్యని వాళ్ళ క్రిందికి ఎంతమాత్రమూ రారు" అని భావించిన చెరబండరాజు జైలుకెళ్ళాక రాసిన పాటలలో విప్లవ భావాలు చాలా కళాత్మకంగా కనిపిస్తాయి. అప్పుడు రాసిన గేయ కావ్యం "గౌరమ్మ కలలు"

భూస్వాముల మనస్తత్వాన్ని ఇలా అంటున్నాడు

"కష్టజీవి అన్నానికి
కాకుల వలె చూస్తున్నరు
పల్లే ఒక పండైతే
మింగాలని తొంగున్నరు."

పీడితుల్ని చైతన్యవంతుల్ని చేస్తూ

"నూటికి ఎనభై మందిమి మనము
పోరాటంలో మునిగున్నాము
ప్రజలకోసమై ప్రాణా లిచ్చే
పవిత్ర యజ్ఞం చేస్తున్నాము
తెగించి ముందుకు పోయేవారికి
కాలం తాగే నీటితో సమమూ
విజయం మనదే ధైర్యమె కవచం
ఆయుధాలె మన ప్రాణవాయువులు"

గౌరమ్మ తన బిడ్డను గూర్చి ఏమని ఆశిస్తున్నదో చూడండి.

"నా బిడ్డ తండ్రి వలె
జండ నిలబెట్టాలి
నా బిడ్డ తండ్రి వలె
ప్రజల బిడ్డవ్వాలి
నా బిడ్డ పేదలకు
కనుపాప కావాలి
నా బిడ్డ కష్టాల
పదునెక్కి పెరగాలి
నా బిడ్డ ఏటికెదు
రీదాలి గెలవాలి

నా బిడ్డ సుఖజీవు
లను బట్టి వొంచాలి
నా బిడ్డ అన్ని పో
రాటాలు చెయ్యాలి"

విప్లవ కవిత్వం నినాదాలేనని భావించేవాళ్ళు చెరబండరాజు పాటల్లోని కవిత్వాన్ని గ్రహించగలగాలి.

పోలీసోళ్ళు గౌరమ్మను భర్త జాడ చెప్పాలని హింసించే సందర్భం

"ఇనస్పెక్టరు తుళ్ళి
విషపు నవ్వులు నవ్వ
ఒక వల్ల భూస్వామి
కన్నుగొట్టుతు నవ్వ
ఒక వంక భూస్వామి
ఒళ్ళు చూసీ నవ్వ
తెల్లవారక ముందె
తేబడ్డ గౌరమ్మ
పులుల నోటికి మేక
పిల్ల వలె దొరికింది."

ఈ వ్యవస్థలో విసుగెత్తిన గౌరమ్మ తన బిడ్డను వదినకు అప్పగించి పోరాటంలో చేరిపోతుంది.

"భర్త తోటి గౌరి కూడ
గెరిల్లాగ మారింది
కర్తవ్యం నిర్వహిస్తు
వార్తల్లో కెక్కింది
జనాభాలో సగం మంది
మహిళలున్న సమాజంలొ
స్త్రీ లోకం ముందు రాక
జన విముక్తి జరగదని ..."

చెరబండరాజును గురించి కుందుర్తి ఇలా అంటారు. "... సౌమ్యుడు, నిరాడంబర జీవి, వివాదాలలోనికి చొరనివాడు. తన విశ్వాసము నందు వీడని పట్టు ఒక్కటే అతని వ్యక్తిత్వానికి బంగారు పూత పూసింది. చెరబండరాజును చూస్తే ఇతని లోపల ఇంత తీవ్రవాద లక్షణం దాగి ఉన్నదా అని ఆయన్ను తెలిసిన నాబోటి

వారికి ఆశ్చర్యం వేస్తుంది". కుందుర్తి దృష్టిలో చెరబండరాజు పాశ్చాత్య కవితా వాసనలకు దూరంగా ఉండి "నేటివిటీ"ని భద్రంగా పదిలపరచుకున్న కవి.

వీధుల్లో ఆయన పాటలు పాడుతుంటే గుమికూడిన జనం మళ్ళీ మళ్ళీ అడిగి పాడించుకునేవారు. పాణిగ్రాహి సుబ్బారావుకు గద్దర్‌కు మధ్య కవిత్వ వస్తువు పరంగాను, రచనారీతి పరంగాను చెరబండరాజు వారధిగా నిలిచాడని కె. వి. రమణారెడ్డి అభిప్రాయం.

"బంజర్లను నరికినం
పొలాలను దున్నినం
మా చెమటలు ఏరులుగ
పంటలు పండించినం
గింజెవడిదిరో
గంజెవడిదిరో
కారణాలు తెలిసినం
ఆయుధాలు చేసినం
మా యుద్ధం ఆపకుండ
విప్లవాలు నడిపెదం
చావు మీదిరో
గెలుపు మాదిరో"

'క' అంటె కన్నీళ్లను, 'వి' అంటె విప్లవీకరించేవాడు విప్లవ కవి అని, అలాంటి యుగ కర్తవ్యాన్ని చాటిన వైతాళికుడు చెరబండరాజని జ్వాలాముఖి అభిప్రాయం.

*(ఆంధ్ర జాతీయ బి. ఇడి. కళాశాల సంచిక, 1985)*

# కుందుర్తితో కాసేపు

కవిత్వంలో భాష సంభాషణ స్థాయిలో ఉండాలి. "ఇమేజరి" అతిగా వుండకూడదు. స్పష్టత, ప్రయోజనం, వ్యంగ్యం, "సింప్లిసిటీ", సామాజిక వాస్తవికత కవిత్వానికి చాలా ముఖ్యం. కవికి పీడితుల మీద జాలి ఉండాలి.

శ్రీశ్రీ సప్తతి ఉత్సవాలకోసం కాకినాడకు వచ్చిన కుందుర్తి ఆ రోజు రాత్రి విశ్రాంతి మందిరంలో నింపాదిగా పడుకొని కవిత్వాన్ని గురించి వెలిబుచ్చిన అభిప్రాయా లివి. ఈ రచయిత అపుడు జరిపిన ఇంటర్వ్యూలో కీ. శే. కుందుర్తి చాలా ఆసక్తికరమైన విషయాలు చెప్పారు.

సమాజంలో "వాస్తవంగా" జరిగేదంతా యథాతథంగా చిత్రించటమే సామాజిక వాస్తవికత అనుకోకూడదని ఆయన ఒక ముఖ్య సంఘటన ప్రస్తావించారు. సమాచార శాఖలో కుందుర్తి చిన్న ఉద్యోగిగా పని చేస్తున్నపుడు కీ. శే. గోపీచంద్ డైరెక్టరు హోదాలో ఉన్నారట. "పతివ్రత" అనేకథలో భర్త చనిపోయిన రోజే భార్య ఆ యింటి పాలేరుతో సమాగమ సౌఖ్యాన్ని పొందినట్లు గోపీచంద్ రాశారు. కుందుర్తి ఆ విషయాన్ని సభాముఖంగానే ప్రశ్నించారట. ఎక్కడో ఒక సంఘటన జరిగినంత మాత్రాన ప్రజలమీద పడే ప్రభావాన్ని ఆలోచించకుండా రచయిత చిత్రించకూడదని, నిర్మాణాత్మకమైన చైతన్యాన్ని కలిగించేదే నిజమైన సామాజిక వాస్తవికత అవుతుందని కుందుర్తి విశ్లేషించారు.

విరసం గూర్చి మాట్లాడుతూ చెరబండరాజు ఒక్కడే పరిపూర్ణమైన విప్లవ కవి అని, చెప్పేది ఆచరించటం ప్రజాకవి బాధ్యత అని భైరవయ్య మొదలైన కవులు కొందరు విప్లవం మొదలైన కబుర్లు చెపుతూ పూజలు చేసుకోవటంవలన బహిష్కరించబడినారని కుందుర్తి అన్నారు. కుందుర్తి తన కొడుక్కి కట్నం తీసుకోలేదు.

అరసం విరసం - ఇలా ఎన్ని రసాలున్నా మార్క్సిస్టు సిద్ధాంతం నమ్మి కృషి చేసే కవులంతా ఒకటి కావాలని కుందుర్తి కాంక్షించారు. తాను, తన మిత్రులు కొందరు రాస్తున్న వచన కవిత్వం మధ్య తరగతి కవిత్వం అని, ఈ మధ్య పాట జనంలోకి బాగా వెళ్ళుతున్నదని ఆయన అంగీకరించారు.

మినీకవితను గురించి మాట్లాడుతూ శ్రీశ్రీ "మహా ప్రస్థానం" రాసి మహాకవి అయినాడు కాని "ఆః" అనే మినీకవిత రాయటం వలన కాదని కుందుర్తి గట్టిగానే సమాధానం ఇచ్చారు.

సామరస్య ధోరణికి మారుపేరయిన కుందుర్తి భావాలను సాహిత్య ప్రియులు చిత్తశుద్ధితో ఆలోచించాలి.

*(ఆంధ్ర పత్రిక, 16-12-1982)*

# ఆధునిక సాహిత్య ప్రతిబింబం - "కవన విజయం"

భువన విజయ ప్రదర్శన చాలమంది చూసే వుంటారు. అందులో శ్రీ కృష్ణదేవరాయలతోపాటు అష్టదిగ్గజ కవులు వుంటారు. ఇందులో రాయలు మీద పద్యాలు చెప్పటం, సమస్యల్ని పూరించటం మొదలైనవి కవులు చేస్తుంటారు. రాచరిక వ్యవస్థ నశించినా ప్రజాస్వామ్య యుగం ఆవిర్భవించినా ఇంకా భువన విజయ ప్రదర్శనలు జరుగుతున్నాయంటే మన బుద్ధులింకా రాచరికంలోని ప్రజల మనస్తత్వానికి దగ్గరగానే వున్నాయనుకోవచ్చు. ఇందులో పాల్గొనేవారు రాచరిక కాలం నాటి వేషాలు కూడా ధరించటం మరింత విడ్డూరం. ఈ ప్రదర్శనలకు లక్ష్యం పాండిత్య ప్రదర్శనతో కూడిన బాహ్య ఆనందానుభూతిని కలిగించడం ప్రధానం.

ఆధునిక కాలానుగుణమైన ప్రజాస్వామ్య భావాలకు దగ్గరగా సాగిన సాహితీరూపకం "కవన విజయం." ఇది భువన విజయానికి అనుకరణ కాని, అనుసరణ కానీ కాదు, పేరడీ అసలే కాదు. ఈ కవనవిజయ ప్రదర్శనకు మూడు ముఖ్య లక్షణాలున్నాయి. ఒకటి నిర్మాణాత్మకమైన ఆనందానుభూతిని కలిగించటం. రెండవది వర్తమాన సమాజాన్ని విశ్లేషించటం. మూడవది ఆధునిక సాహితీ ప్రక్రియల్ని ఉద్యమాల్ని వాటి స్వరూప స్వభావాల్ని మేధావులతో పాటు సామాన్యులకు కూడా విశదమయ్యేటట్లు ఆకర్షణీయంగా వివరించటం.

"ఇప్పటికీ కొందరు పండిత కవులూ, కవి పండితులూ అష్టదిగ్గజాల వేషాలు వేసుకొని మోజుపడి, స్టేజెక్కి భువన విజయ వైభవాన్ని పునఃప్రచారం చేయాలని భావిస్తున్నారు. ఆధునికులు ఆ ప్రదర్శనలు ఆమోదించరు. అందుకే 'వెలుతురు స్నానం' చేసిన నాగభైరవ కోటేశ్వరరావు భువన విజయం ప్రత్యామ్నాయంగా కవన విజయాన్ని సంకల్పించాడు. దాని ఒక ప్రదర్శనం ఇలాటి నాలుగు సమీక్షల పెట్టు ..." అన్నారు ఆరుద్ర కవన విజయ ప్రాశస్త్యాన్ని శ్లాఘిస్తూ.

రాజులు అంతరించాక జమీందారులు సమసిపోయాక ఈనాటి సాహిత్యాన్ని ఆదరిస్తున్నవారు సామాన్యులు. అంటే ఎన్.జీ.వోలు, టీచర్లు, సామాన్య కుటుంబీకులు. వీళ్ళకు ప్రతినిధిగా క్లర్కు సూర్యారావును కవన విజయానికి అధ్యక్షత వహించ వలసిందిగా ప్రయోక్త వేదిక మీదికి ఆహ్వానిస్తాడు. భునవ విజయ ప్రదర్శనలో శ్రీ కృష్ణదేవరాయలు దర్శనమిస్తాడు. ఈ రూపకంలో రాయలుకు ప్రత్యామ్నాయంగా సామాన్యుల ప్రతినిధి క్లర్కు అధ్యక్షస్థానం అలంకరిస్తాడు. ఇది ఈ నూతన సాహితీ రూపకంలోని మొదటి విశేషం.

క్లర్కు వేదిక మీదికి వస్తుండగా అతణ్ణి గురించి నేపథ్యంలో వైతాళిక గీతం

ఆలపించటం జరుగుతుంది.

"జయ సమస్తాఫీసు
భార నిర్వహణాన
బుర్ర తిరిగిన వెర్రివాడా!
గాను గెద్దుగ బతికి
కంచరీ గాడిదై
వృద్ధుండవౌ యువకమూర్తీ!"

ఇలా పాట అయిపోయాక "సగటు మనిషికీ - బహు పరాక్, సామాన్య మానవుడికీ - బహు పరాక్, ఎన్‌జీవో సూర్యుడికీ - బహు పరాక్" అంటూ స్లోగన్లు వినిపిస్తాయి. తరువాత ప్రయోక్త వరుసగా ప్రబంధ కవి పరమేశ్వర శాస్త్రిని, భావకవి భానుమూర్తిని, అభ్యుదయ కవి "ఆశ్లేష"ను, దిగంబర కవి "తిరుగబడు"ను, సినీ కవి సింగినాధాన్ని, హాస్యకవి ఆనందరావును, నవలా రచయిత్రి నాంచారీదేవిని ఒకరి తరువాత మరొకరిని వేదిక మీదికి ఆహ్వానిస్తాడు. ఒక్కొక్కరు వేదిక మీదికి వస్తూ తమ తమ సిద్ధాంతాల కనుగుణమైన పద్యాలు, కవితలూ చదివి కూర్చుంటారు. కవుల పేర్లు అక్షర మైత్రి కలిగి వుండేటట్లు కల్పించటం వలన మరింత ఆసక్తి పెంపొందుతుంది.

క్లర్కు సూర్యారావు మీద కవిత్వం చెప్పాలని ముందుగా కవుల్ని కోరటం జరుగుతుంది. ప్రబంధకవి పరమేశ్వర శాస్త్రి అర్థం కాని సమాసాలతో కూడిన వృత్తంలో ఎన్‌జీవోను దీవిస్తాడు. పద్యం అర్థం గాకపోయినా వింటానికి మాత్రం కమ్మగా వుందంటాడు సూర్యారావు. భావకవి భానుమూర్తి చెప్పిన పద్యంలో ఎన్‌జీవో పేరు వాడుకోవటం తప్ప మిగతా పద్యమంతటా ఊహా లోకాల్లో విహరిస్తాడు. హాస్యకవి ఆనందరావు సామాన్యుడికి ప్రతీక అయిన సూర్యారావును పట్టుకొని ఉత్త చేతకాని వాడివని తీసి పారేస్తాడు. అభ్యుదయ కవి ఆశ్లేష "నీవు ఎక్కదలచుకొన్న రైలు ఎప్పుడూ ఓ జీవిత కాలం లేటు" అంటాడు. దిగంబర కవి "తిరుగబడు" - నీవీ యుగంలో నికృష్టానివి / నీవీతరంలో ముదనష్టానివి /ఈ తరం ఇడియట్‌వి / కొత్త తరం కోపతాపాలకు / నిరంతరం గురవుతూ / రేపటి కడ్డంగా వాదిస్తున్న స్టుపిడ్‌వి" అంటూ సూర్యారావును తిడతాడు. "కవిగారు తిట్టిన తిట్టు తిట్టకుండా తిడితే ఇక నన్నేం మాట్లాడమంటా"రంటూ సూర్యారావు బాధపడుతుంటే వెంటనే విప్లవకవి విరూపాక్ష లేచి "నోరు మూసుకో గుండు చేసుకో నిజంలాగా ధ్వజంలాగా నిటారుగా లేచి భయం వీడి నగ్నంగా బజారులోకి రా" అనగానే "తిడితే భరించాను గాని నగ్నంగా బజారులోకి ఎలా రమ్మంటా"రంటూ సూర్యారావు కంగారుపడిపోతాడు. సూర్యారావుని

దుకోకపోతే ఇక లాభం లేదని సినీ కవి సింగినాథం ఇలా అంటాడు.

"అప్పుచేసి పప్పుకూడు తినరా ఎన్‌జీవో
గొప్పనీతి వాక్యమిదే వినరా ఎన్‌జీవో
దొంగతనం తప్పురా దోపిడీలు ముప్పురా
దొరికినంత అప్పు చేసి మీసం మెలిదిప్పరా !
కొట్టువాడు లెక్కడిగితే
గుట్టుగాను వుండరా
అద్దెవాడు అగుపడితే
ఆ వీధిని వదలరా !"

ఈ పాటతో కాస్త గాలి పీల్చుకుంటున్న సూర్యారావును చూస్తూ నవలా రచయిత్రి నాంచారీ దేవి సూర్యారావుకు ఆకుపచ్చని మేడ వున్నట్లు, భార్యకు పుట్టినరోజు కానుకగా ఫారన్ చీర తెచ్చినట్లు, మల్లెపూలు పెట్టుకొని లిప్‌స్టిక్ కొట్టుకుని ఎదురుచూస్తున్న భార్యను వైలెట్ చెవర్‌లెట్ కారులో హుందాగా కూర్చోబెట్టుకుని సాగిపోతున్నట్లు అలా అలా వర్ణించుకుపోతుంది. సూర్యారావుకు మతి పోతుంది. "బుద్ధి గడ్డితిని నా మీద కవిత్వం చెప్పమని అడిగినందుకు నా పరువు కాస్తా తీసేస్తున్నా"రని సూర్యారావు ఇక తనను వదిలేసి మన దేశం మీద నాలుగు మంచి ముక్కలు చెప్పమని అడుగుతాడు.

భారత దేశ పురాతన వైభవాన్ని ప్రబంధకవి వర్ణిస్తే, భరతమాత ఘనతను అలంకారికంగా భావకవి వూహిస్తే, వర్తమాన సమాజంలోని దుస్థితుల్ని అభ్యుదయ కవి కళ్లకు కట్టిస్తే, దిగంబర కవి "దుండగుల్తో పక్కమీద కులుకుతున్న శీలం నీది ! అంతర్జాతీయ విపణిలో అంగాంగం తాకట్టు పెట్టిన అందం నీది" అంటూ భారత దేశాన్ని తిడతాడు." "స్వాతంత్ర్యం పూదోటలో అదుపుదప్పి ఎగబడ్డ పదవీ రాజకీయాల గొడ్లని తన్ని తరిమేయా"లంటూ విప్లవకవి ప్రకటిస్తాడు. హాస్యకవి "అధికారం కోసం మా కారాటం అసల్లేదు మా కోసం రాజ్యలక్ష్మి మరులు గొన్నదేం చేస్తాం" అంటాడు. "గాంధీ పుట్టిన దేశమా యిది నెహ్రూ కోరిన సంఘమా ఇది" అంటూ బ్రాంది తాగుతూ సినీకవి దేశాన్ని గురించి పాడతాడు. నవలా రచయిత్రి నాంచారీదేవి లేచి భారతదేశం సస్యశ్యామల మైనదని, అందులో కాశ్మీరురాజ్యం మరీ అందమైనదని, అక్కడి సరస్సులో అందమైన జంట రాధ - గోపి ఊగుతూ కైపులో మైమరిచి పగటి కలలు కంటున్నారంటూ సాగిపోతూ వుంటుంది. "దేశాన్ని వర్ణించటానికి కూడా శృంగార వర్ణనే కావాలటమ్మా" అంటూ విసిగిపోయిన సూర్యారావు "అసలు కవిత్వం ఏ ప్రేరణవల్ల పుడుతుందో చెప్ప"మని కవుల్ని అడుగుతాడు.

వరసగా ఒక్కొక్క కవి ఒక్కొక్క రకంగా తనకు ప్రేరణ కలిగించే వాటిని గురించి చెప్తారు.

"నిరుపహతి స్థలంబు రమణీయ ప్రియ దూతిక తెచ్చి యిచ్చు కప్పుర విడెము" ఇత్యాదులు కావాలంటాడు ప్రబంధ కవి. "వియోగపు కైపు పులకింతలే కవితగా పొంగి పొర్లుతా"యని భావకవి చెపుతాడు. "రాబందుల రెక్కల చప్పుడు, పొగ గొట్టపు భూంకార ధ్వని" మొదలైనవి కావాలంటాడు అభ్యుదయ కవి. కాస్త అటూ ఇటూగా దిగంబర కవి, విప్లవ కవి ఇలాంటివే కావాలంటారు. "మాగాయి కంది పచ్చడీ ఆవకాయ పెసరప్పడము తెగి పోయిన పాత చెప్పులు" తన కవిత్వానికి ప్రేరణ ఇస్తాయని హాస్యకవి అంటాడు. "ఆవేశం కావాలి ఆవేదన రావాలి" అంటూ "కనుల ముందు బీరుంటే కవిత పొంగి పారదా" అనేసి బీరు సీసా నోట పట్టేస్తాడు సినీ కవి. ఇల్లు వూడ్చి వంట చేసి పిల్లల్ని ఎత్తుకునే శ్రీవారు కావాలని, పాత కథల్ని కొత్తగా రాయటానికి పాత పత్రికలు ముందుండాలని నవలా రచయిత్రి కోరుకుంటుంది.

చివరిగా సమస్య ఇచ్చి కవుల్ని పూరించమని అడగటం జరుగుతుంది. ఈ సమస్యతో ఇక్కడి నుండి అసలు సమస్య మొదలవుతుంది. ఈ అసలు సమస్యతో "డ్రమెటిక్ టెక్నిక్" సాధింపబడి రూపకం పతాక స్థాయిని చేరుకుంటుంది. దీని వలన రూపకం ప్రేక్షకుల హృదయాల మీద బలంగా ముద్ర వేయగలుగుతుంది.

ప్రబంధ కవి. భావ కవి సమస్యల్ని పూరిస్తారు. కాని అభ్యుదయ కవి, విప్లవ కవి, దిగంబర కవి "ఈ సర్కస్ ఫీట్లు మేం గర్హిస్తాం. మా వచనాలనే దుడ్డు కర్రల్తో మీ పద్యాల నడుములు విరగదంతాం, మీరు మీ పాండిత్యాన్ని విశ్వ విద్యాలయాల పురాతన గోరీల చాటున దాచుకోండి" అంటూ తిరగబడతారు. ప్రబంధ కవికి కోపం వచ్చి "కవితకు కట్టుబాటు కావలె, భాషకు నియతి కావలె" అంటూ వాదిస్తాడు. ఇంతలో నవలా రచయిత్రి నాంచారీదేవి కల్పించుకొని "మిమ్మల్ని, మీ కవిత్వాన్ని ఎవడైనా చదువుతున్నాడా ? తిన్నది అరక్క అర్థం కాని కవిత్వం రాస్తాడొకాయన ! సమాజ స్పృహ అంటూ పనికిమాలిన నీతులు చెపుతా డింకో ఆయన ! బూతులు తిడతాడు మరో కవి ! కేకలేస్తా డింకో కవి ! ఇదేనా మీ కవిత్వం" అంటూ దాదాపు కవులందర్నీ తీసి పారేసి మాట్లాడుతుంది. అపుడు దిగంబర కవి ఉగ్రుడై "నీ వంటయింటి సాహిత్యంతో దేశ సంస్కారాన్ని రేప్ చేస్తున్నా" వంటాడు. "మాటలు జాగ్రత్తగా రానీండి. అందరినీ ఆకర్షించని మీ కవిత్వం కాల్చనా !" అంటుంది నవలా రచయిత్రి. "కాలుస్తాను, నిజంగానే కాలుస్తాను" అంటూ శృంగారపు పాటలతో తిమ్మిరెక్కించే సినీ కవిని, పైటల ఆకర్షణతో అల్లే నవలా రచయిత్రిని, అర్థం కాని కవిత్వం రాసే ప్రబంధ కవిని ఊహా లోకాల్లో ఎగిరే భావ కవిని కాల్చి

పాతేయ్యాలంటాడు దిగంబర కవి. విప్లవ కవి వెంటనే పిస్టలు తీసి వాళ్ళందరినీ కాల్చబోతాడు. క్లర్కు సూర్యారావు అధ్యక్ష పీఠం నుండి జారిపడి అయ్యబాబో అంటూ పారిపోబోతాడు. అంతలో ప్రయోక్త వేదిక మీదికి వచ్చి కవులను శాంతింపజేసి ఇలా స్వస్తి వాక్యాలు పలుకుతాడు.

"మీ మీ సిద్ధాంతాలు రాద్ధాంతాలతో మీ ఇజాల హజాలతో సామాన్య పాఠకుణ్ణి హడలెత్తించి పరుగెత్తి పోయేటట్టు చేశారు. ఎవరైతే మీ కవితా సౌందర్యాన్ని ఆస్వాదించాలో ఆ పాఠకుడు గజిబిజిపడి మీ నుంచి దూరమైపోతున్నాడు. ఎవరో అన్నట్లు మీరిలానే రాస్తుంటే కవిత్వం చదవకుండా పోయే రోజు ఒకటి వచ్చి తీరుతుంది. తస్మాత్ జాగ్రత్త! కవిత్వ ప్రయోజనం ఆనందం కావచ్చు. అంతేకాదు - అంతకు మించి సామాజిక స్పృహ కూడ కవితా ప్రయోజనమే. సాహిత్యం సంఘానికి ఊహించే శక్తి నివ్వాలి, ఉత్సాహ పరచాలి. చైతన్యమే నేటి "కవన విజయం". మీ కవిత్వ కన్యలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు మాత్రమే కాదు. ప్రజాశక్తులు వహించే విజయ ఐరావతాలు కావాలి" ... ఇలా అనే ప్రయోక్త మాటలతో కవన విజయ సాహితీ రూపకం సమాప్త మవుతుంది.

ఈ రూపకంలో ఏ ఉద్యమాన్ని రచయిత బలపరిచాడో స్పష్టంగా చెప్పలేదంటూ కొందరు విమర్శించబూనటం తొందరపాటు చర్య మాత్రమే. అందరికీ అత్యల్ప కాలంలో తెలుగులో ఉన్న ఆధునిక సాహితీ ప్రక్రియల్ని ఉద్యమాల్ని చక్కగా పరిచయం చెయ్యటమే దీని ముఖ్య లక్ష్యం. ఈ రూపకాన్ని కూర్చిన రచయిత నాగభైరవ కోటేశ్వరరావు అ భినందనీయులు. పోతన, చేమకూర, దేవులపల్లి, జాషువా, శ్రీ శ్రీ, ఆరుద్ర, జరుక్ శాస్త్రి, నగ్నముని, జ్వాలాముఖి, దాశరథి, నారాయణరెడ్డి, మాధవపెద్ది, తిలక్, మల్లారెడ్డి, కొండూరి, కస్తూరి మొదలైన కవుల కవితల్ని ఆయా కవుల పాత్రలకు కూర్చి ఆనందింపజేశారు రచయిత. ఈ కవన విజయం దాదాపు వంద ప్రదేశాల్లో ఆంధ్రప్రదేశ్ అంతటా, దేశం లోని వివిధ ప్రాంతాల్లో ప్రదర్శింపబడటం వలన ఈ సాహితీ రూపకానికి లభించిన ప్రశస్తి ఎటువంటిదో సాహితీ ప్రియులు, పాఠకులు ఊహించవచ్చు. రూపకం ప్రారంభించిన మొదటి ఆవృతంలోనే క్లర్క్ సూర్యారావును ప్రగతివాద కవులు కూడా తిట్టడంకోసం, నిరుత్సాహపరచడంకోసం ఎన్నుకున్న కొన్ని కవితలు రూపకానికి ఔచిత్య భంగం కలిగించాయనేది ఒక చిన్న విమర్శ.

*(భారతి, జూలై 1984)*

# సాహిత్యం - ప్రజాభిప్రాయం

సాహిత్యాన్ని గురించి మనం చాలసార్లు సాహిత్యవేత్తల అభిప్రాయాలు వింటూ ఉంటాము, పత్రికల్లో చదువుతూ వుంటాము. కాని సాహిత్యాన్ని గురించి పాఠకు లేమనుకుంటున్నారో మనకు స్పష్టంగా తెలియదు. సాహిత్యాన్ని గురించి పాఠకులైన ప్రజ లేమనుకుంటున్నారో సాహిత్యవేత్తలు, సాహిత్యకారులు కూడా తెలుసుకోవటం చాల అవసరం. ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజల అభిప్రాయాలు తెలుసుకొని వాటిని నాయకులే కాకుండా అన్ని రంగాలకు చెందినవారు కూడా ఆలోచిస్తూ నిర్మాణాత్మకమైన నిర్దుష్టమైన భావనలను ఆచరణలో పెట్టవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది.

సాహిత్యాన్ని గురించి వివిధ వర్గాల ప్రజల అభిప్రాయాలు తెలుసుకునేందుకు ఇటీవల ఒక సాహిత్య సమావేశం "సాహిత్యాన్ని గురించి ప్రజ లేమనుకుంటున్నారు?" అనే అంశం మీద మచిలీపట్నం సాహితీ మిత్రులు నిర్వహించారు. ఇందులో పలువురు వెలువరించిన అభిప్రాయాల పరిశీలనమే ఈ వ్యాస ఉద్దేశం.

డాక్టరు వృత్తిలో ఉన్న పద్మనాభరావు దృష్టిలో - "కళ మనిషికి మెరుగులు దిద్దుతుంది. ప్రాచీన సాహిత్య మంతా పనికిరానిది కాదు. అందులోని మంచిని తీసుకొని చెడు వదిలివేస్తాము. ప్రాచీన కాలంలోను ఆనాటికి చెందిన తిరుగుబాట్లు ఆనాటి సాహిత్యంలో లేకపోలేదు. అంతేకాని ఈనాటి సామాజిక దృష్టితో ప్రాచీన సాహిత్యాన్ని విమర్శించటం అనవసరం. ఉబుసుపోకకు రాసే కట్టల కన్న ఆలోచింపజేసే చిన్న రచనలు చాలు. సాహిత్యంలోని అన్ని ప్రక్రియలూ అవసరమే అయినా నాటకాన్ని, సినిమాని, టీవీని ఆధునిక కళాకారులు బాగా ఉపయోగించుకోవాలి. భావాలను ప్రజలలోనికి తీసుకొని వెళ్ళటానికి జానపద కళా రూపాల్ని వినియోగించుకోవాలి. మన రచయితల్లో ఈర్ష్య ఎక్కువ. రచయితలను ఉత్తమశ్రేణికి చెందిన వారిగా తీర్చిదిద్దే "వర్కుషాప్"లను సాహిత్య సంస్థలు నడపటం మంచిది. కేవలం ఉపన్యాసాలు, సన్మాన సభలతో అవి పొద్దుపుచ్చకూడదు. సాహిత్యాన్ని వైద్యంలాగే ఈ రోజు కొందరు వ్యాపారంగా మార్చుకొనటం చింతించదగ్గ విషయం." ఇవి వారు వెలువరించిన భావాలు.

ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్న నందనవనం సుందర మల్లికార్జునరావు గారు ఇలా అంటున్నారు. - "దూకు దూకు మనేవాడు రచయిత కాదు. మన సంప్రదాయం తెలిసి వుండాలి. సమస్యా పరిష్కార చిత్తం వుండాలి. ఈనాడు నవ్యకవితను విడిగా చెప్పవలసిన పని లేదు. రామాయణం ఎన్నిసార్లు రాసినా

నవ్యకవితగానే ఉంటుంది. సమాజాన్ని చైతన్యవంతం చేసే ప్రక్రియల్లో సినిమా గొప్పది. దానిలో లోపాలుంటే సరిదిద్దుకుందాము. ఈనాడు వస్తున్న మినీకవిత టార్చిలైటు లాంటిదే కాని అది అసలు 'కరెంటు' కాదు" అన్నారు.

ప్రభుత్వ కార్యాలయంలో అటెండరుగా పనిచేస్తున్న గోవిందరావు సూక్తులు కూడా ఉత్తమ సాహిత్య మన్నారు. "నిజాయితీతో కూడిన ధైర్యం ఉన్నవాడు వేమన. వేమన సూక్తులు, ఈనాటి మినీ కవితలు మనిషి మార్పుకు ఎంతో ఉపయోగిస్తాయి" అని చెప్పారు.

నాగేశ్వరరావు ఇంటరు విద్యార్థి. స్త్రీల రచనలలో పనికిరాని ఊహాగానాలు ఎక్కువగా ఉన్నాయని, వారి నవలలకు ఆదరణ ఎక్కువగా ఉండటంతో పురుషరచయితలు కూడా స్త్రీ పేర్లతో అలాగే రాస్తున్నారని ఆవేదన వెలిబుచ్చారు. శ్రీశ్రీ అంటే ఎంతో ఇష్టమట. తాను చదివిన కథలలో ధైర్యం కల పాత్రలుంటే బాగా నచ్చుతాయట, అవి ప్రాచీన రచనలైనా, ఆధునిక రచనలైనా.

మల్లాది రుక్మిణీదేవి అనే గృహిణి వాస్తవికత ఉన్న మంచి రచన నిలబడుతుందని, నేటి పత్రికలోని కథలు నవలలు కుటుంబ సభ్యులు చదివేలా లేవని, ఊహాగానాల రచనలే స్త్రీలు ఎక్కువగా సృజిస్తున్నారంటూ దాశరథి రంగాచార్య రాసిన శరతల్పం, లకుమాదేవి, లల్లాదేవి రచనలు తమ కిష్టమైనవిగా ప్రకటించారు. ఈ నాటి పత్రికలలో ఇతర భాషా కథలు ప్రచురిస్తున్న "విపుల" తమకు నచ్చిన పత్రికట.

పాఠకులు నవలలే ఆదరిస్తున్నందున నవలలనే ముద్రిస్తున్నామని ప్రచురణకర్త ఎమెస్కో సుబ్బారావు అన్నారు. ఈ నవలల్లో ప్రేమ అంటే పెండ్లి కాని వాళ్ల మధ్య తప్ప పెండ్లి అయినాక కాదని అంగీకరించారు. యండమూరి, యుద్దనపూడి తమకు నచ్చిన నవలా రచయితలట. నాగరాజు, కాళీపట్నంలాంటి వాళ్ళు అకాడమీ బహుమతులు తిరస్కరించటం మంచిపని కాదని, ఆ బహుమతుల సొమ్ము ప్రజలదేనని ప్రభుత్వానిది కాదని, సరసం, విరసం, అరసం ... ఇలా ఒక్కో విభాగానికి ఒక్కో అకాడమీ వుంటే అపుడు బహుమతులు కాదనకుండా స్వీకరిస్తారని ఆయన భావించారు.

గ్రంథపాలకుడుగా ఉన్న శ్రీహరిరావు ఈనాటి సాహిత్యానికి మూలం ప్రాచీన సాహిత్య మన్నారు. కవిత్వ పుస్తకాలు కాలేజీ లెక్చరర్లు కూడా చదవటం లేదని, నవలలు మాత్రమే అడుగుతున్నారని, ఇక విద్యార్థులను నిందించవలసిన పని లేదని కాలేజీ లైబ్రరీలోని తమ అనుభవాలు విశదీకరించి చెప్పారు. జనం చూస్తున్నారు గనుక హింసాత్మకమైన, అశ్లీలమైన సినిమాలు తీస్తున్నారని ఆయన అన్నారు. ఈనాటి కళా ప్రక్రియల్లో ఒక్క సినిమాలోనే కాదు, అన్నిటిలోను అబద్ధాన్నే నిజంగా జనం మీద

రుద్దుతున్నారని, నలుగురూ అన్న తర్వాత మేకను కుక్కపిల్లగా భావించి బ్రాహ్మణుడు వదిలేసుకొన్నట్లుగా మనం ఉన్నత విలువల్ని వదిలేసుకుంటున్నామని, ఈనాటి సాహిత్య విమర్శకులు కూడా ఇలాంటివారేనని, తాత్కాలిక విలువలు కాక శాశ్వతమైనవి కావాలని కోరారు.

వ్యాపారి శిర్విశెట్టి సత్యనారాయణకు ఈనాటి కవిత్వం ఎక్కువగా నినాదాలు, ఆవేశం తప్ప ప్రయోజనం లేనిదిగా కనిపించింది. అతి చౌకగా నవరసాలు ఆనందింపజేసే సినిమా ఎక్కువ ఇష్టమట. ఎదిరించటమనేది ఆధునిక కవుల దుర్లక్షణంగా ఆయన భావిస్తున్నారు. శాస్త్రీయ విజ్ఞానాన్ని అందించే రచనలు చేసే యండమూరి వీరేంద్రనాథ్ వీరికి బాగా ఇష్టం.

జర్నలిస్టు, పత్రికా సంపాదకుడు, కార్మిక నాయకుడు అయిన జనార్ధనరావు ఈనాటి సాహిత్యం చదివి జనం చెడిపోతున్నారని, కల్లబొల్లి ప్రేమకథలు, నవలలు, సినిమాలను దుయ్యబట్టారు. పిల్లల్ని పుట్టించటం, పార్టీలు మార్చటం, కథలూ నవలలూ రాసేయటం ఈనాడు అన్నింటికన్నా తేలికయిన పనులని ఆయన చమత్కరించారు. మన రచనలలో సంపన్న వృత్తులున్నవారే నాయకులుగా కనిపిస్తున్నారని, రిక్షా తొక్కే కార్మికులవంటివారు నాయకులుగా కనిపించరని, నవ కవులు - యువ రచయితలు అలాంటి చెత్త రచనలు చదవకుండా మంచి రచనలు చదివి మంచి రచనలు చేయాలని ఆయన సూచించారు. జయప్రకాష్ నారాయణ్ వంటి మహాత్ముల చరిత్రల్ని, ఆదర్శాల్ని సాహిత్యం రాసేవాళ్ళంతా తెలుసుకొని ఆచరించాలని కూడా సలహా ఇచ్చారు.

సాహిత్యాన్ని గురించి ప్రజలంతా నిర్దిష్టమైన అభిప్రాయాలే కలిగి ఉంటారని ఖచ్చితంగా చెప్పలేము. కాని ప్రజలు చెప్పే అభిప్రాయాల్లో కొన్ని సాహితీ వేత్తలకు కొత్తవిగాను, ఆచరణ యోగ్యమైనవి గాను, సరికొత్త వస్తువును అందించేవిగాను, ఆత్మపరిశీలన చేసుకొనటానికి తోడ్పడేవిగాను, ముందు చూపుతో నవ సమసమాజాన్ని త్వరగా మనకు సాక్షాత్కరింపజేసేవిగాను ఉండవచ్చు. అశాస్త్రీయ మనిపించిన భావాలను పట్టించుకొనవలసిన పని లేదు. సాహిత్యాన్ని గురించి ప్రజల అభిప్రాయాలు తెలుసుకొనటానికి ఇలాంటి వేదికలు అప్పుడప్పుడూ ఏర్పాటు చేయడం అవసరం.

*(తెలుగు విద్యార్థి, మే 1986)*

# పిల్లలలో కవితా చైతన్యం

అమ్మను గూర్చి, ఆవును గూర్చి, పూలను గూర్చి మాత్రమే పిల్లలు కవిత్వం రాస్తారని కొందరు విమర్శకులు అనుకుంటూ వుంటారు. పిల్లలు రాసిన కవితల్లో రాజకీయ విషయాలుంటే ఆ కవితలెవరో పెద్దలు రాసివుంటారని అపోహపడవలసిన పని లేదు. సమాజంలోని ఎన్నో సమస్యలను గురించి పిల్లలు ఆలోచిస్తూనే వున్నారు. కొన్నిసార్లు ఆ సమస్యలకు తమకు తోచిన చక్కని పరిష్కార మార్గాలు కూడ చెప్పగలుగుతూనే వున్నారు.

పిల్లలలోని నిజమైన సృజనాత్మక నైపుణ్యాన్ని, కవిత్వ శక్తిని సామాజిక చైతన్యాన్ని పరిశీలించాలంటే కవితల పోటీలు నిర్వహించే సమయంలోనే అంశాన్ని తెలియజేయటం (Spot announcement) మంచిది. అలా అప్పటికప్పుడు రాసిన పిల్లల కవితలలో కనిపించే కవితా విశేషాల్ని పరిశీలించటం ఈ వ్యాస ఉద్దేశం. గ్రంథాలయ వారోత్సవాల సందర్భంగా మచిలీపట్నం ఇనుగుదురు శాఖా గ్రంథాలయంవారు ఏర్పాటు చేసిన కవిత్వ రచన పోటీలలో రైతు అనే అంశం ఇచ్చి అప్పటికప్పుడు కవిత్వం రాయించటం జరిగింది. పిల్లలు రైతును గూర్చి ఎంతో ప్రతిభావంతంగా కవితలు వెలయించారు.

నాగరాజు పదవ తరగతి విద్యార్థి. నేటి కాలంలోని రైతు దయనీయ స్థితిని చక్కగా గుర్తించాడు.

"రైతంటే కేవలం నేల దున్నేవాడిగానే
ఉంది ఈ దేశంలో ...
రైతంటే కేవలం పండించేవాడిగానే
ఉంది ఈ దేశంలో ...
రైతంటే కేవలం నష్టపోయేవాడిగానే
ఉంది ఈ దేశంలో ... "

అంటూ రైతుకున్న వర్తమాన నిర్వచనాన్ని ఎత్తిపొడుపుగా తెలియచేస్తున్నాడు. రైతు బాధలకు అద్దం పడుతున్నది ఈ కవిత. స్వార్థపరుల చేతుల్లో రైతు నలిగిపోతున్నాడని, రైతుకు విముక్తి రావాలని ఆవేదన చెందుతున్నాడు. ప్రతి వాక్యం మొదట "రైతంటే" అనటం, ప్రతి వాక్యం చివర "వాడిగానే ఉంది ఈ దేశంలో " అనటం గమనించాలి. భావానికి తగిన శిల్పంలో కూడా ఈ విద్యార్థి పరిణతి చెందిన వచనకవిలా అనిపిస్తున్నాడు.

"దేశానికి వెన్నెముక గ్రామం
గ్రామానికి వెన్నెముక రైతు

వెన్నెముక ఎప్పుడూ వెనకనే ఉంటుంది.

రైతు ఎప్పుడూ వెనకబడే ఉంటున్నాడు"

అంటూ రైతు వెనకబడినతనం గురించి పాఠకుల్ని ఆవేదనలో ముంచుతాడు. పంట పండించే రైతు దాన్ని అనుభవించేది ఎప్పుడని ఆక్రోశిస్తున్నాడు. గ్రామానికి రైతు వెన్నెముక అని అందరూ అనటంలో దేశానికి అతడు ఆధారం అని, బరువు మోసేవాడని ఉద్దేశాలు. కాని ఇక్కడ ఈ బాలకవి అందరూ అనే ఆ మాటలలోనే - వెన్నెముకను వెనుక ఉంచినట్లే రైతునూ వెనుకబడివుండేట్లు చేస్తున్నారనే చురకను జోడించటం విశిష్ట శిల్పం.

అనిల్ కుమార్ కూడా 10వ తరగతి విద్యార్థే. రైతును ఎలా వర్ణిస్తున్నాడో గమనించండి.

"తలమీద తలపాగా చుట్టి

చేత పెద్ద నాగలి పట్టి

అన్నదానం కోసం

దున్నుతున్నాడు భూమిని ...

అడుగో రైతు ! అడుగడుగో రైతు !!

అతడి చెమటనే పంటకు నీరుగా పోస్తాడు

కండల్ని పిండి పైరు పండిస్తాడు

సర్వశక్తుల్ని యిమిడ్చేస్తాడు పొలంలో

అడుగో రైతు ! అడుగడుగో రైతు !!"

అంటూ రైతును వర్ణిస్తాడు. ప్రజల ఆకలిమంటల్ని ఆర్పేస్తూ, ప్రజల నిండు జీవితాల్ని కాపాడుతున్న రైతు "జీవితాల్ని నిలిపే దేవతవలె" ఉన్నాడంటాడు. నాగరాజు రాసిన కవితకు, అనిల్‌కుమార్ రాసిన కవితకు వాక్య నిర్మాణంలో తేడా వుంది. ఇదే వచన కవిత రాసే కవి నిర్ణయించుకునే 'సొంత శైలి'

ఇలా కొందరు విద్యార్థులు సమస్యల్ని ఆలోచించగల్గుతుంటే, మరి కొందరు అమాయకంగా రైతును సుఖపడేవాడిగా వర్ణిస్తున్నారు. కాని ఇలా భావించేవాళ్ళ సంఖ్య చాలా తక్కువగానే ఉంది.

శ్రీనివాసరావు కూడా 10వ తరగతి చదువుతున్నవాడే. రైతుతో ఇలా అంటున్నాడు.

"నీ యందు కల్మష భావాలుండవు

ఏ బాధలేక సుఖంగా జీవిస్తావు

వేకువనే లేస్తావు
నీ పనులు పూర్తి చేస్తావు
సాయంత్రం ఇంటికి వస్తావు
భార్యాబిడ్డలతో సుఖంగా జీవిస్తావు"

ఒక రకంగా ఆలోచిస్తే ఈ మాటలలోనూ వాస్తవం లేకపోలేదు. రైతులాంటి శ్రమజీవులు తప్ప కొందరు పెద్దమనుషులు నిరంతరం ఎవడి కొంపలు ముంచుదామా, ఎన్నెన్ని మేడలు కడదామా, ఎన్ని పదవు లెక్కుదామా, ఎవరెవరి పదవులు లాగేద్దామా - ఇవే గదా మురికి కంపు ఆలోచనలు. రైతు మనసు మల్లెపూవు. భార్యాబిడ్డలతో రాజకీయంగా మాట్లాడవలసిన పని వుండదు. దువ్వూరి రామిరెడ్డి రైతును గురించి రాసిన పద్యాల ప్రభావం ఇలాంటి విద్యార్థుల మీద ఉందనుకోవచ్చు. తొమ్మిదవ తరగతి పాత తెలుగువాచకంలో రామిరెడ్డి రాసిన "కృషీవల" పద్యాలు ఎందరో విద్యార్థుల్ని అలరించాయి. కొత్త తెలుగు వాచకంలో కూడ బొడ్డు బాపిరాజు గారి పద్యాలున్నాయి. మచ్చు కొకటి :

"కనకగిరి సానువుల పంట కళ్ళములను
చిట్టి ముత్యాల రాసుల సిరులు నీదు
రాకయును గాంచి రైతు వాల్గంటి బోసి
మెడ తడుముకొన్నది గృహస్థు నుడి స్మరించి".

ఇలాంటి పద్యాల ప్రభావం విద్యార్థుల మీద తప్పకుండా పడుతున్నదనటానికి బాలలు రాస్తున్న కవితలే తార్కాణాలు.

కత్తికన్న కలం గొప్పదని అంటుంటాం మనం. 9వ తరగతి చదువుతున్న కె. ఎస్. విశ్వనాథ్ ఏమంటున్నాడో గమనించండి.

"కవి చేతి కలం కన్నయోధు చేతి కత్తి మిన్న
ఓ రైతన్నా! నీ చేతి నాగలియే మిన్న"

రైతు అభిరుచులు సామాన్యమని, జీవనం నిరాడంబరమని, ఆంధ్ర సంస్కృతి వర్ధిల్లుతున్నది రైతు వల్లనేనని, రైతు అభ్యున్నతి జాతికి అభివృద్ధి అని ఈ బాలకవి భావిస్తున్నాడు.

విద్యార్థులు తాము చెప్పదలచుకొన్న భావాన్ని ఉదాత్తమైన భావుకతతో జోడించి చెప్పటంలో కూడ నిపుణు లనిపిస్తున్నారు. ఈ భావుకత లక్షణమే సామాన్య దృష్టికన్న కవి దృష్టిని విడదీసి నిలుపుతుంది. తలపాగాతో భుజంమీద కండువాతో కదలివస్తున్న రైతును చూస్తే 'ఒక దేవత నడచి వచ్చునా' అనిపించినట్లు ఉంటుందంటున్నాడు కె. విజయ్ అనే విద్యార్థి. ఇంకా

"రైతు మొహంలో చెరగని ఆనందం
ఆమడలు దాటుతోంది
దాటుతోంది ఆనందం దాటుతోంది హద్దుల్ని
కండలు కరిగేలా కష్టం చిరకాలం నిలిచేలా"

అంటూ రైతును 'అన్నపూర్ణలా' కీర్తిస్తున్నాడు. రైతు ఆనందం అతని పంట. ఆ పంట ఆమడలే కాదు, దూర తీరాలూ దాటిపోతున్నది, ఇతర దేశాలకు ఎగుమతి అవుతున్నది. అందుకే రైతు మొగం చెరగని, తరగని శాశ్వతమైన ఆనందానికి ప్రతిబింబం.

"రైతు పండించే పంట - చూసే వారికి కన్నుల పంట". అయినా అది రైతు "చెమట - కన్నీళ్ల జంట" అని చాలమందికి తెలియదని అరుణ అనే ఎనిమిదవ తరగతి విద్యార్థిని తన కవితలో రాసింది. ఆడపిల్లలు కూడా సామాజిక చైతన్యం పెంపొందించుకొనటంలో ఏమాత్రం తీసిపోలేదు. రైతును పట్టించుకొనని ఈ దేశం గురించి అరుణ ఇంకా ఇలా రాస్తున్నది.

"నీరు రాదు నీరు రాదు
ప్రభుత్వం పంపదు
ప్రజాస్వామ్యం రాదు
బక్కరైతు దుఃఖం తొలగదు.
ఇంకెక్కడి ప్రజాస్వామ్యం
రావడానికైనా !
అది ఎప్పుడో గాంధీగారితో
వెళ్ళిపోయింది !!"

మన దేశంలో ఇపుడు పిలవబడుతున్న మేడిపండు ప్రజాస్వామ్యాన్ని ఇంత గట్టిగా, ఇంత చురుగ్గా ప్రశ్నిస్తున్నది ఈ అమ్మాయి. గాంధీగారి తర్వాత ఆదర్శాలు వల్లించటమే కాని ఆచరణ లేదు. ఆచరణ గాంధీగారితో సమాధిలోకి వెళ్లిపోయిందనేది వాస్తవం. మరి రైతును ఎవరు పట్టించుకుంటారు ? ఈ అమ్మాయే రాసిన ఈ క్రింది వాక్యాలు చదివితే నిజంగా మన కళ్లవెంట నుండి నీళ్ళు బొటబొటా రాలిపడతాయి.

"కష్టించే బక్కరైతు
పొలం దున్నుతున్నాడు
ఇద్దరు ఆప్తమిత్రులను నాగలిక్కట్టి ...
ఇంతలో పడిపోయాడు
ఒక ఆప్తమిత్రుడు ...

కన్నీటి సాగరం
కట్టలు తెంచుకొంది
ఆ సాగరంలో ప్రజలు
కొట్టుకు పోయారు"

అంటూ రైతు దుఃఖం మనపాలిట శాపం అవుతుందని హెచ్చరిస్తోంది.

రైతు కష్టపడి పండించిన గింజల్ని దోపిడీదారులు తమ గాదెల్లో భద్రంగా దాచినా, వరదలొచ్చి కొట్టుకుపోయినా రైతు బ్రతుకులో తేడా లేదని కడగండ్ల పాలేనని పర్వతనేని శ్రీలక్ష్మి అనే ఎనిమిదవ తరగతి అమ్మాయి తన కవితలో గమనించింది.

రైతు సమస్యల్ని ఇలా రకరకాలుగా భావించిన విద్యార్థులు చాలా మంది ఉన్నారు. ఈ సమస్యలకు పరిష్కారం సూచించటంలో కూడ కొందరు విద్యార్థులు అద్భుతమైన అవగాహన ప్రదర్శించారు.

తారక శ్రీనివాసరావు అయిదవ తరగతి విద్యార్థి. అయినా

"రైతు లేనిదే రాజ్యం లేదు
పంట లేనిదే ప్రాణి లేదు.
రైతు లాంటి రాజుంటే
రైతులందరూ సుఖపడతారు."

రైతులే కష్టపడి మనకోసం ప్రాణాలు త్యాగం చేస్తున్నారని, అందరూ రైతులకు సహకరించాలని ఈ బాలకవి కోరుతున్నాడు.

"రైతులాంటి రాజుంటే
రైతు రాజ్యం వస్తుంది
రైతు రాజ్యం వస్తేనే
రైతుల కష్టాలు తీరుతాయి"

అంటాడు.

రైతు బిడ్డలు చదవటంలో ఏ మాత్రమూ తప్పులేదు. కాని అలా చదివిన బిడ్డలు ఉద్యోగం రాక వ్యర్థంగా కాలం గడపవద్దంటూ తొమ్మిదవ తరగతి చదువుతున్న రమాశేఖర్ -

"ఓ సోదరులారా ! ఇంత చదువు చదివింది
రోడ్లు ఊడ్చేందుకా ! నిరుద్యోగ సమస్య దిగులెందుకు !
దుక్కిదున్నరాదా ! మన అమ్మ భూమాత ఉందిరా !
మరిచిపోకు ! ఇది ఎన్నడూ మరిచిపోకు"

అంటూ బోధిస్తున్నాడు. రోడ్లు ఊడ్వటం అంటే నేలకు తగిలే పొడుగాటి ప్యాంట్లతో

వీధులు తిరగటం అని ధ్వని. ఉద్యోగం రానివాళ్ళు ఉన్న పొలం లోనే కష్టపడి పండిస్తే తమకూ, దేశానికీ ప్రయోజనం కలుగుతుందంటాడు. ఒకవేళ పొలాలు లేకపోయినా నిరుద్యోగులు పొలాల్లో కూలిపనైనా చేసుకొని బతకవచ్చు. ఉద్యోగం దొరకలేదని నిరాశతో ఆత్మహత్య చేసుకొనవలసిన పనిలేదు. దేశంలో నిరుద్యోగ సమస్య ఎంత తీవ్రంగా ఉందనిపించినా పల్లెలలో పొలం పని చేసే శ్రమజీవులు కావలసినంతమంది ఇంకా దొరకటం లేదనేది వాస్తవం. రోజుకు పదిరూపాయల చొప్పున పొలంపనికి వెళితో నెలకు మూడు వందలు వస్తాయని తెలిసినా ఆ పనికి ఖాళీగా ఉన్న యువకులు వెళ్ళరు. ఎవడి కాళ్ళో గడ్డాలో పట్టుకొని, నెలకు వందరూపాయలిచ్చే పట్నం అటెండరు ఉద్యోగం కావాలని వెంపర్లాడే యువకులూ లేకపోలేదు. ఈ స్థితి మారాలి. నిరుద్యోగుల ఆలోచనా విధానం నిర్మాణాత్మకంగా ప్రవహించాలి. ఇవి ఈ బాలకవి భావనలు.

పొలం పండిద్దామంటే నీరులేదని, చల్లుదామంటే విత్తనాలు లేవని, నాటుదామంటే నారులేదని, రైతులు భూస్వాముల చెప్పుచేతలలో నలిగిపోతున్నారని నరసింహారావు అనే పదవ తరగతి విద్యార్థి ఆందోళన చెందుతున్నాడు. పంటలకు అధిపతియైన రైతుతో ఇలా అంటున్నాడు :

"రైతా ! ఓ రైతా ! ఎన్నాళ్ళని ఎన్నేళ్ళని
రెక్కలన్ని వంచి వంచి చెమటోడ్చి
ఎన్నాళ్ళని ఎన్నేళ్ళని ఈ యిడుములు
ఎంత చేసినా కాకుల్లా తన్నుకుపోదురే -
ఎప్పుడయ్యా ! ఎప్పుడు ! విముక్తి ఎప్పుడు !!
ఈ భూస్వాముల అంతమెప్పుడు !!!

అంటూ రైతును దోపిడీ చేసేవారిని ఈసడిస్తూ, పరోక్షంగా రైతులో ఆవేశ భావం పెంపొందింపచేయటానికి ప్రయత్నం చేస్తున్నాడు.

తమ తెలుగు వాచకాలలో "దేశచరిత్రలు" (శ్రీశ్రీ) చదువుతున్న విద్యార్థులు వీరు. విద్యార్థి దశలోనే బాలబాలిక లింత గొప్ప కవితలు రాస్తున్నారు కనుక భవిష్యత్తులో మనకు అనేక శ్రీశ్రీలు, అనేక చెరబండరాజులు, అనేక తిలక్‌లు లభిస్తారని ఆశించవచ్చు. కాని సహజ కుసుమసుకుమారులైన ఈ బాలల కళాహృదయాన్ని ఈ ధనిక దుష్టవ్యవస్థ కబళించకుండా ఉండేలా జాగ్రత్తపడటం మన అందరి బాధ్యత.

*(యువ కవిత, త్రైమాసిక అక్టోబరు - డిసెంబర్ 1986)*

# వార్త సాహిత్య ప్రక్రియ అవుతుందా ?

కుక్క మనిషిని కరిస్తే అది వార్త కాదు. మనిషి కుక్కను కరిస్తే అది వార్త అని లార్డ్‌నార్త్ క్లిఫ్ భావించారు.

"పత్రి కొక్కటున్న పదివేల సైన్యంబు
పత్రి కొక్కటున్న మిత్రకోటి
ప్రజకు రక్షలేదు పత్రిక లేకున్న" ... అన్నది నార్ల మాట.

ఇక్కడ పత్రికలంటే దినపత్రికలని భావించటమే సబబు. పత్రికలు పదివేల సైన్యంగా, మిత్రకోటిగా పని చేయగలుగుతున్నాయంటే - ఆ పత్రికలో వచ్చే వార్తలే ఆ పని చేయగలుగుతున్నాయన్న మాట. వార్తకున్న విశిష్ట శక్తి అలాంటిది. వార్త సాహిత్య ప్రక్రియ అవుతుందా అనేది ఆలోచించదగ్గ విషయమే.

సాహిత్య ప్రక్రియలు అనగానే, మనకు ముందుగా గుర్తుకొచ్చేవి కవిత్వం, కథానిక, నవల, నాటిక, నాటకం వగైరా. ఇవే కాకుండా, వ్యాసాన్ని కూడా సాహిత్య ప్రక్రియగానే భావిస్తున్నారు. ఉత్తరాలను కూడా లేఖా సాహిత్యం పేరుతో ప్రచురించిన రచయితలున్నారు.

దిన పత్రికల్లో కవితలు, కథలకన్నా, వార్తలనే ప్రజలు గట్టిగా పట్టించు కుంటున్నారు. దిన పత్రికలలో కవిత, కథానిక, సీరియల్ నవల వగైరా ప్రచురించే శీర్షికలున్నా, ఎక్కువ స్థానం ఆక్రమించేది వార్తలే. ఈ వార్తా రచన అనేది అంత తేలికైన పనికాదు. కవిత్వం, కథలు బాగా రాసేవాళ్ళు కూడా కొందరు గొప్పగా వార్తలు రాయలేకపోవచ్చు. అలాగే వార్తలు గొప్పగా రాసేవాళ్ళు కొందరు గొప్ప కవిత్వం రాయలేకపోవచ్చు. అందాకా ఎందుకు ? సాహిత్య ప్రక్రియలని అంగీకరించిన వాటిల్లోనే ఒక ప్రక్రియ బాగా రాసే ఆయన, మరో ప్రక్రియ బాగా రాయలేకపోవచ్చు. కవిత్వం రాసే ఆయన కథ రాయలేక పోవచ్చు, బాగా కథ రాసే ఆయన కవిత్వం రాయలేకపోవచ్చు. ఒక సాహిత్య ప్రక్రియ గొప్పగా రాసేవారు మరో సాహిత్య ప్రక్రియను గొప్పగా రాయగలరని చెప్పలేము.

ఇక "సాహిత్య ప్రక్రియ అంటే ఏమిటి" అనే విషయానికొస్తే - ఆయా సాహిత్య విమర్శకులు ఆయా సాహిత్య ప్రక్రియలకు కొన్ని లక్షణాలు గమనించి చెప్పారు. కవిత్వానికని, కథలకని సాహితీవేత్తలు అనేక లక్షణాలు చెబుతుంటారు. అంటే కొన్ని "టెక్నిక్స్" కలిగి ఉండేది "సాహిత్య ప్రక్రియ" - అని మనం స్థూలంగా భావించవచ్చు.

ఈ సందర్భంలో - వార్తను కూడా సాహిత్య ప్రక్రియగా భావించవచ్చునా? అనేది మన ముందున్న ఆలోచన. వార్తకు కూడా కథానికలాగే, కవితలాగే కొన్ని "టెక్నిక్స్" ఉన్నాయని తెలుస్తోంది. కథానికలాగా వార్తకున్న కొన్ని లక్షణాల్ని ముందు గమనిద్దాం.

కథానికలో ప్రారంభం, కొనసాగింపు, ముగింపు అనే మూడు ప్రధానమైన భాగాలుంటాయి. వార్తకు కూడా ఈ లక్షణాలు వర్తిస్తాయి. ప్రారంభం, కొనసాగింపు, ముగింపు వార్తకు చాలా అవసరం. ఇక కథానిక చెప్పే పద్ధతులున్నట్లే, వార్తను రాసేటప్పుడు కూడా, మూడు ముఖ్యమైన పద్ధతులున్నాయి. అందులో కథనాత్మక పద్ధతి ఒకటి. ప్రాధాన్య పద్ధతి రెండోది. ఉత్కంఠ కల్గించే పద్ధతి మూడోది.

ఎన్నికల బహిరంగ సభను గురించి వార్త రాయాల్సివచ్చింది అనుకుందాం. "సాయంత్రం 5 గంటలయింది. నెమ్మదిగా మబ్బులు కమ్ముకుంటున్నాయి. క్రమంగా సన్నని జల్లు ప్రారంభమయింది" ... ఇలా రాస్తే కథనాత్మక పద్ధతి. వార్తలోని విషయ ప్రాధాన్యంబట్టి, ప్రధాన విషయాన్ని ముందుంచి రాసే పద్ధతిని "ప్రాధాన్య పద్ధతి" అనవచ్చు. ఒక సభలో పాల్గొన్న ఒక మంత్రి ప్రసంగ సారాంశాన్ని వార్తగా రాయాలనుకుందాం. మంత్రి చాలాసేపు ప్రసంగించిన తరువాత సబ్సిడీ బియ్యం రద్దు ప్రతిపాదన ఏదీలేదని, ఆ ప్రధానమైన సంగతిని ముగింపులో ప్రకటించినా సరే, "సబ్సిడీ బియ్యం రద్దు ప్రతిపాదన లేదు" అని, ప్రధాన విషయంతోనే వార్తా రచన ప్రారంభిస్తున్నారు. ఈ పద్ధతినే ప్రాధాన్య పద్ధతి అనవచ్చు. ఇక "ఉత్కంఠ కల్గించే పద్ధతి" అంటే, వార్త చదవటం మొదలుపెట్టగానే అది మనల్ని బలంగా ఆకర్షించటం అన్నమాట. ఒక మందుల షాపులో నకిలీ మందులమ్ముతున్నారని, దాని వల్ల ఎందరో ప్రాణాలు కోల్పోతున్నారని, దీని వెనుక ఓ డాక్టరు హస్తం కూడా ఉందని ... ఇంకా ఇలాంటి విషయాలను వార్తగా రాయాలనుకుందాం. దీన్ని ఎలా మొదలు పెడతామనేది గమనించాల్సిన సంగతి.

"ప్రాణం బాగోలేదని డాక్టరు దగ్గరకెళితే, ఉన్న ప్రాణం కూడా ఊడిపోయే రోజులొచ్చాయి ... " అంటూ, వార్తా రచన మొదలు పెట్టవచ్చు. ఇలా మొదలు పెట్టటం వలన పాఠకుడికి వార్త చదవటం మొదలుపెట్టగానే, ఉత్కంఠ కలుగుతుంది. ఇలా వార్తా రచన ప్రారంభించటాన్ని "ఉత్కంఠ కలిగించే పద్ధతి" అని భావించవచ్చు. ఇలా వార్తలు రాసే పద్ధతులు కథానిక రాసే పద్ధతుల్లాగా అనేకం ఉన్నాయి.

ఇక కాసేపు కవిత్వంలాగా వార్తకున్న లక్షణాల్ని చూద్దాం. "అల్పాక్షరముల అనల్పార్థ రచన" అని కొందరు ప్రాచీనులు, కవిత్వాన్ని నిర్వచించారు. పద ప్రయోగశక్తి, భావుకత వుండాలని కొందరంటే ధ్వని, చమత్కారం, వ్యంగ్యం మొదలైన లక్షణాల్ని మరి కొందరు చెప్పారు. తక్కువ మాటల్లో ఎక్కువ భావం చెప్పటం కవిత్వ లక్షణాలలో విశిష్టమైన లక్షణం. వార్తకు కూడా సంక్షిప్తత ప్రాణం. వీలయినంత తక్కువ పదాలలో ఎక్కువ భావాన్ని ఇవ్వాలనేది వార్తా రచన ఉద్దేశం. అనవసరమైన పదాలు లేకుండా ఉండటం వార్తకు పుష్టిని చేకూరుస్తుంది. వార్త ఏదయినా 75 పదాలకు మించటం మంచిది కాదని, ఒకో వాక్యంలో 19 మించి పదా లుండరాదని

కొందరు జర్నలిష్టు లన్నారు. కవిత్వంలో అలంకారాల పాత్ర చాలా ప్రముఖంగా కనిపిస్తూ ఉంటుంది. నేటి దిన పత్రికలు రాస్తున్న వార్తలలో అలంకారాల పాత్ర తక్కువేమీ కాదు. అలంకారాలు రెండు రకాలు. శబ్దాలంకారాలు ఒక రకంకాగా, అర్థాలంకారాలు రెండోరకం. ఈ రెండింటిని కవిత్వంలో బాగా వాడుకోవడం ఆనవాయితీ. వార్తా రచనలో కూడా ఈ రెండు రకాల అలంకారాలు కనిపిస్తున్నాయి. ముందు అర్థాలంకారాలు చూద్దాం. "అవినీతి ఊబిలో కూరుకుపోయిన అధికారి" అనే వార్తలో "అవినీతి" అనేది ఉపమేయం. "ఊబి" ఉపమానం. అవినీతిని ఊబిలాగా పోల్చి చెప్పటం వలన, వార్త జనానికి బాగా ఎక్కుతుంది. ఇలాగే "సమస్యల చీకట్లలోంచి పరిష్కారాల వెలుతురు వైపు దేశం ముందుకు సాగాలి" అని వచ్చిన వార్త కూడా ఇలాంటిదే. "న్యాయదేవత సాక్షిగా అక్రమార్జన" అని అనటంలో న్యాయాన్ని దేవతతో పోల్చటం జరిగింది.

ఇక శబ్దాలంకార విషయానికొస్తే, వార్తా రచనలో మనకు ఎన్నో ఉదాహరణలు కన్పిస్తాయి. "వక్రీకరణలు వద్దు ... వాస్తవాలివిగో ... " అన్నపుడు - "వ" కారం అనేక సార్లు వచ్చింది. ఈ శబ్దాలంకారం వినటానికి ఇంపుగా ఉండి, పాఠకుల్ని బాగా ఆకర్షిస్తుంది. వార్తకు ఈ శబ్దాలంకారం, బాహ్య సౌందర్యంగా పనికొస్తుంది. అతిగా బాహ్యసౌందర్యం ఉంటే, వార్తారచనకే కాదు, కవిత్వ రచనలోను ఎబ్బెట్టుగానే ఉంటుంది. ఈ శబ్దాలంకారాన్ని సహజత్వం ఉట్టిపడేలా వినియోగించుకొనటంలో, కవులకన్నా వార్తలు రాసేవాళ్లే కొంత ముందు చూపుతో వ్యవహరిస్తునట్లు అనిపిస్తుంది. వార్త రాసేవాళ్ళు "శబ్దనాద" మాధుర్యాన్ని జాగ్రత్తగా పట్టుకున్నట్లు అనిపిస్తుంది. "నెలనుంచి రైళ్లలోనే కాలక్షేపం" అనే వార్తలో "ల" కారం అనేకసార్లు వచ్చినా అది ఏమాత్రం కృతకంగా లేదు. చాలా సహజంగా వినిపిస్తోంది. "శేషగిరి లొంగినా వీడని మిస్టరీ" అన్న వాక్యంలో శేషగిరిలో పలుకుతున్న "ఏ" అనే ధ్వని, వీడని అనే పదంలో పలుకుతున్న "ఈ" అనే ధ్వని - ఉచ్చారణ సాదృశ్యం వలన వినటానికి ఇంపుగా ఉంటుంది. "ప్రకృతి వైపరీత్యాలు - పార్టీలకు ప్రచారాస్త్రాలు" అనే వార్తలో శబ్దాలంకారంతోపాటు అర్థాలంకారం కూడా ఇమిడి ఉంది. ఇందులో "ప" కారం అనేక సార్లు వచ్చి వినటానికి బాగుంది. ప్రకృతి వైపరీత్యాలు పార్టీలకు అస్త్రాలవంటివని అనటంలో అర్థాలంకారం వలన పాఠకులకు భావం అందంగా, బలంగా అందే అవకాశం పెరుగుతుంది.

తిక్కన కవిత్వాన్ని గురించి చెప్పేటపుడు ఆయన వాడిన నుడికారపు సొంపును సాహిత్య విమర్శకులు ప్రశంసిస్తుంటారు. అలాగే వార్తా రచనలో సరళమైన వ్యావహారిక భాషతో పాటు చక్కని నుడికారపు సొంపు కూడా కనిపిస్తుంటుంది. "ప్రతిపక్షనాయకుడి అభిప్రాయాన్ని అసత్యాల పుట్టగా మంత్రి అభివర్ణించారు" అనటంలో చక్కని వ్యావహారికం ఉంది. "అసత్యాల పుట్ట" అనేది జనం ఎక్కువగా

ఉపయోగించే పదబంధం. "దిగజారుతున్న ధరతో మిర్చి రైతుల కంట కన్నీరు" అన్న వాక్యంలో "దిగజారటం" అనేది చక్కని తెలుగు నుడికారం. "రెండు పడవల్లో కాళ్ళు పెట్టటం" చక్కని తెలుగు నుడికారం" దున్నపోతుమీద వాన కురిసిందన్నట్లు ఎన్ని విమర్శలు చేసినా పట్టించుకోని సంస్థ" అంటూ వచ్చిన వార్తలో "దున్నపోతుమీద వాన" అనేది చక్కని సందర్భోచితమైన నుడికారం. ఈ నుడికారం వాడటం వలన భావం స్పష్టంగా, సూటిగా, బలంగా పాఠకుల మనస్సులో నాటుకుంటుంది. అలాగే "తలవంపులు తెచ్చిన పాలన", "పేదల పాలిటి అన్నపూర్ణ", "ప్రజాసేవకు నడుంకట్టటం" మొదలైన వాక్య భాగాల్లో తలవంపులు తేవటం, అన్నపూర్ణ, నడుంకట్టటం - అనేటటువంటివి తెలుగులోని మంచి నుడికారాలు. సందర్భానుసారంగా చక్కని సామెతలను కూడా వినియోగించుకుంటూ వస్తున్న వార్తలెన్నో ఉన్నాయి. "అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి" అన్నట్లు మార్కెట్లో ధరలున్నాయి -" అని రాసిన వార్తలోని "అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి" అనే సామెత వలన భావం స్పష్టంగా, సూటిగా పాఠకులకు అందుతుంది.

కవిత్వంలో పునరుక్తి దోషం పనికి రాదంటారు. వార్తా రచనలో కూడా ఒకే రకమైన క్రియను అదేపనిగా వాడరు. సందర్భానికి తగిన క్రియల్ని జోడించి, వాక్యాలను ముగించటం, వార్తా రచనలోని ప్రత్యేకత. "రైతులు పండించిన పంటకు గిట్టుబాటు ధరలు కల్పిస్తామని మంత్రి చెప్పారు" అని వాక్యం ఉంటుంది. తరువాత - "రైతులను మోసం చేసే దళారీ వ్యవస్థను అంతం చేస్తామని ఆయన హెచ్చరించారు", అనటం జరుగుతుంది. అంటే - ఇక్కడ "ఆయన చెప్పారు" అని మళ్ళీ అనకుండా సందర్భాన్నిబట్టి "హెచ్చరించారు" అనటంలో ఔచిత్యం ఉంది. "ఏదైనా ఇబ్బందులుంటే తనకు విన్నవించాలని మంత్రి చెప్పారు". అని "చెప్పారు" అనే క్రియతో ముగించరు. "ఏదైనా ఇబ్బందులుంటే తనకు విన్నవించాలని మంత్రి సూచించారు". అంటూ "సూచించారు" అనే క్రియతో ముగిస్తారు. ఇలా వైవిధ్యంతో కూడిన క్రియలను వాడటం వలన వార్తలు పాఠకులకు బాగా అర్థమవుతాయి.

అసలు సాహిత్యమంటే స్థూలంగా గమనిద్దాం. సాహిత్యం అంటే హితాన్ని కల్గించేదని సాహిత్య విమర్శకు లన్నారు. సాహిత్యం వలన ఆనందం ప్రయోజనం రెండూ ఉండాలని, కొందరు విమర్శకులు చెప్పారు. ఆలోచింపజేయటం, సమాజానికి పనికిరావటం - ఆధునిక సాహిత్యానికి ముఖ్య లక్షణాలుగా ఆధునిక విమర్శకులు చెబుతున్నారు. అలా ఆలోచించినా - వార్త సమాజ హితాన్ని కోరుకునేదే. ప్రజల్ని బాగా ఆలోచింపచేస్తున్నదే. సాహిత్యం లాగా, వార్త కూడా ప్రజల్ని చైతన్యవంతుల్ని చేస్తున్నదే. "టెక్నిక్" లేని కవిత్వాన్ని తాను ఊహించలేనన్నాడు శ్రీశ్రీ. అంటే - విషయంతో పాటు టెక్నిక్ కూడా, సాహిత్య ప్రక్రియకు చాలా అవసర మన్నమాట. వార్తా రచనలో కూడా విషయంతో పాటు టెక్నిక్ కూడా ఉంది కాబట్టి వార్తను

కూడా సాహిత్య ప్రక్రియ అనటానికి అభ్యంతరాలుండాల్సిన పనిలేదని ఒక భావన.

ఇంతవరకు చెప్పుకున్న విషయాలను బట్టి కథానికలో ఉండే కొన్ని టెక్నిక్స్ కవిత్వంలో ఉండే కొన్ని టెక్నిక్స్ వార్తా రచనలో కూడా ఉన్నాయని మనం గమనించాం. ఒకసారి వార్తా రచనకున్న లక్షణాలన్నీ మరోసారి చెప్పుకుందాం. వార్తా రచన లక్షణాలను రెండుగా వర్గీకరిద్దాం. ఒకటి - విషయ లక్షణాలు. రెండు - టెక్నిక్ లక్షణాలు. ముందుగా విషయ లక్షణాలు చూద్దాం. వార్తలోని విషయం "సామాజికమైనది", "వాస్తవికమైనది". ఈ రెండు లక్షణాలతోపాటు "తాజాదనం" అనే మూడో లక్షణాన్ని కూడా వార్త కలిగిఉంటున్నది. ఆలోచింపచేసేదిగా ఉండటం, సమాజానికి ప్రయోజనం కల్గించేదిగా ఉండటం కూడా వార్త విషయానికి సంబంధించిన లక్షణాలే. ఇక వార్తా రచన టెక్నిక్ లక్షణాలను చెప్పుకుందాం. సహజమైన వ్యావహారిక భాషతో, మధురమైన నుడికారపు సొంపుతో, సరళమైన వాక్యవిన్యాసాలతో - "స్పష్టత" ఉండటం టెక్నిక్‌లోని మొదటి లక్షణం. తక్కువ పదాలలో ఎక్కువ భావం వచ్చేలా "సంక్షిప్తత" కల్గి ఉండటం టెక్నిక్‌లోని రెండో లక్షణం. శబ్దాలంకారాలను, అర్థాలంకారాలను వినియోగించుకొనే ఆకర్షణ - టెక్నిక్‌లోని మూడో లక్షణం. ప్రారంభం, కొనసాగింపు, ముగింపు కల్గి ఉన్న "కథనం" అనేది టెక్నిక్‌లోని నాల్గవ లక్షణం. జనాన్ని బాగా ఆకర్షించే శీర్షికలు, ఉపశీర్షికలు ఇవ్వటం టెక్నిక్‌లోని ఐదవ లక్షణం.

ఇలా వార్తకున్న విషయాన్ని బట్టి, టెక్నిక్‌ను బట్టి వార్తను కూడా సాహిత్య ప్రక్రియగా భావిస్తే - వార్తకు గౌరవం పెరుగుతుంది. ఇంకా స్పష్టంగా, సూటిగా, గొప్పగా, వార్తలు రాయాలనే పోటీతత్వం పెరుగుతుంది. వార్త సాహిత్య ప్రక్రియ అంటే, కొందరు అంగీకరించని మాట నిజమే. సాహిత్య ప్రక్రియ అంటే ప్రజలకు అర్థం కాని భాషలో, సంక్లిష్ట వాక్య నిర్మాణ విన్యాసంతో ఉండేదని వారి భావన. సాహిత్యం అందరికీ అర్థమయ్యేది కాదనేది కూడా వారి ఆలోచన. ఈ భావాలన్నీ అపోహలే. ప్రజలకు అందుబాటులో ఉండాల్సినదే ఏ సాహిత్య ప్రక్రియ అయినా. "వార్త కూడా ఓ సాహిత్య ప్రక్రియే" అనే వాళ్ళు సాహిత్యాన్ని ప్రజల కందుబాటులో ఉండేదిగానే భావిస్తుంటారు. సాహిత్యం అంటే అర్థం కానిదనే భావం పోవాలని, ప్రజాస్వామ్యవాదులైన సాహిత్య విమర్శకులు కోరుతుంటారు. గొప్ప భావాలను గొప్ప భాషలో రాయటం గొప్ప కష్టం కానే కాదని వీరంటారు. ఎంత గొప్ప భావాలనైనా సరళమైన భాషలో చెప్పగల్గటమే గొప్ప టెక్నిక్ అని, ఆ గొప్ప టెక్నిక్ వార్త కున్నదని వీరంటారు. అందుకే సాహిత్యంలో కథలాగే, కవిత్వంలాగే "వార్త కూడా ఓ సాహిత్య ప్రక్రియే" అని ఒక ఆలోచన.

*(ఆకాశవాణి, విజయవాడ కేంద్రం 2-4-1999)*

## జాషువా కవితా హృదయం

"తలిదండ్రి లేని బిడ్డల జూచి కన్నీరు
దానంబుచేయు నేత్రములు నావి
జంతుకోటికి గల్గు స్వామి భక్తిని మెచ్చి
తృప్తినందెడు నవ్య దృష్టి నాది
సకల కార్మిక సమాజముల జీవిత కథా
నకము లాలించు కర్ణములు నావి
కఠినచిత్తుల దురాగతములు ఖండించి
కనికార మెలికించు కలము నాది
దొడ్డపదవులెక్కి గడ్డి మేసెడు వారి
ఎత్తి పొడుచు చిత్తవృత్తి నాది
నిఖిల లోకమెట్లు నిర్ణయించిన, నాకు
తిరుగులేదు, విశ్వనరుడ నేను"

కవికి ఉండాల్సిన లక్షణాలన్నీ జాషువాలో పుష్కలంగా ఉన్నాయి. వరసగా పరిశీలిద్దాం.

### ఆవేదనా హృదయం

కవికి వుండవలసిన మొదటి లక్షణం ఆవేదనా హృదయం. ఇది జాషువా పద్యాలన్నిటిలోను మనకు కనిపిస్తుంది. అనుగు లేదూడ అంబారవాన్ని విని పొలాలనుండి పరుగెత్తుకుంటూ వచ్చి అట్టు నాకే ఆవును బడితెతో యజమాని చావబాదుతూ వుంటే జాషువా హృదయం ముక్కలు ముక్కలైపోతుంది. బ్రతికినంత కాలమూ నెత్తురోడ్చి పని చేస్తున్నా కార్మికుడికి పస్తులే గతి. కాలుమీద కాలువేసుకొని కూర్చున్న వాడికి లక్షల మీద లక్షలు పేరుకొంటున్నాయి. నేల మీదున్న సర్వ సంపదల్ని అనుభవించే హక్కు పుట్టిన వాళ్ళందరికీ సమానంగా వుండాలి. వందలాది పేదల "గంజిబువ్వ" దోచేసి అమృత భోజనంగా మార్చుకుంటున్నా డొకడు. వేలాది మంది కార్మికుల పూరిగుడిసెల్ని జీర్ణం చేసుకొని "శృంగార సౌధం" నిర్మించుకుంటాడు ఇంకొకడు. శ్రామికుల్ని లక్షల్లోకి మార్చుకొని అస్థిపంజరాలు మిగిలేటట్లు చేస్తున్నారు స్వార్థపరులని విలపిస్తాడు జాషువా.

### భావుకత

ఆవేదనా హృదయానికి తోడుగా వుండవలసిన రెండవ లక్షణం భావుకత. హిమాలయ పర్వతాలు ఎండకు కరిగి ప్రవహిస్తాయి. ఆ నీరు గంగ మొదలైన నదుల్లోకి జారి కదలిపోతూ వుంటుంది. ఈ సన్నివేశాన్ని ఆయన భావుకత ఎంత రమణీయ భావస్ఫోరకంగా వినియోగించుకున్నదో ఈ క్రింది పద్యంలో గమనించవచ్చు.

"పుట్టిన గడ్డలో భరత భూములలో గజదొంగ వోలె కా
ల్మెట్టుట కింత నేలయును లేక తపించు సుభాసువీర స
మ్రాట్టును జూచి తద్ధిమధరాధర మెంత కలంగి యేడ్చెనో
గట్టులు దన్ని పారు నల గంగ యెఱుంగు నెఱుంగ రెవ్వరున్"

జాషువా ఆవేదనా హృదయానికి ఆయన భావుకత ఏ మాత్రమూ తీసిపోదని పై పద్యం తెలియజేస్తోంది. ఆయన భావుకతకు పదునుపెట్టేది ఆయన "ఉక్తి వైచిత్రి". గాంధీజీ గురించి రాస్తూ "చిర్నగవుటమ్ములు" అంటాడు. బాణాలను, చిరునవ్వులను వైరుధ్యం వున్న రెండింటినీ ఒక చోట చెప్పటం విచిత్రం. బాణాలు ఎంత బాగా గుచ్చుకుంటాయో అంత బాగా చిరునవ్వులు కూడా ఎదుటి హృదయాల మీద బాగా పనిచేశాయని చెప్పటానికి ఈ విధానం బాగా ఉపకరించింది. 'అహింసా ఖడ్గము' 'కలహాంకూరములు' మొదలైనవి కూడా ఇలాంటి ప్రయోగాలే. గాంధీజీ ప్రపంచమంతా గుర్తింపబడినవా డనటానికి "ఖండపంచకమును కౌగిలించినవాడు" అంటాడు. అలాగే కస్తూరిబాను "ఆడురూప మెత్తినట్టి రెండవ గాంధి" అంటాడు. "గోచిపాత కప్పుకొని జాతి మానంబు నిలిపినట్టి ఖదరు నేతగాడు" "ప్రభుత్వ శాసనంబులకు శిరస్సు లేదు" మొదలైనవి కూడా గమనార్హాలే.

## *సామాజిక అన్యాయాలపై తిరుగుబాటు*

కవికి వుండవలసిన మూడవ లక్షణం సామాజికమైన అన్యాయాలను ప్రజలందరికీ తెలియచెప్పటం, జాషువాలో ఉన్నంతగా ఈ లక్షణం నన్నయనుండి నేటిదాకా వున్న ఏ ఇతర పద్యకవిలోను కనిపించదు. సామాజిక అన్యాయాలకు గురియైనవాడు గనకనే (గాంధీజీ లాగా) ఆయా సమస్యల్ని ఖండించటానికి కలం పట్టాడు జాషువా, కవిత్వం కోసం ఆయన కవిత్వం రాయలేదు, జీవితం ఆయనకు కవిత్వంగా అనిపించింది.

"ముసలి వాడైన బ్రహ్మకు పుట్టినారు
నలువురు కుమారులనుట విన్నాము కాని
పసరమున కన్న హీనుడభాగ్యుడైన
ఐదవ కులస్థు డెవ్వరమ్మా ! సవిత్రి"

అంటూ నిరాధారమైన వర్ణవ్యవస్థను నిలదీసి ప్రశ్నిస్తాడు. అంటరానితనాన్ని అంతం చేయకపోతే ఎన్ని చదువులు చదివినా ఎంత విజ్ఞానం సాధించామని చెప్పుకున్నా ఏమీ ప్రయోజనం వుండదని, ప్రపంచ శాంతి స్థాపింపబడదని ఆయన నమ్మకం, గొప్ప దేవుడని గుండ్రాళ్ళు చూపించి బాగుపడుతున్న వాళ్ళే ఎక్కువమంది వున్నారని, బీదవాని కన్నులలోని దైన్యాన్ని తొలగించి వాని జీవితాన్ని బాగు చేద్దామనుకునే వాళ్ళు

లేరని తెలియజేస్తాడు.

జాషువా దీన జన వర్గానికి చెందిన కవి. పెద్దలనుభవించే సంపదలన్నీ పేదలవేనంటూ హేతువాదాన్ని మేళవించి క్రింది పద్యంలో ఇలా అంటారు జాషువా, హేతువాదమంటే ఇక్కడ దేవుడు లేడని వాదించటం మాత్రమే కాదు, సంపదలకు నిజమైన హేతువు శ్రామికులేనన్న అభిప్రాయాన్ని కల్గివున్నవాడు జాషువా. ఒక వృద్ధురాలు ఆకలితో అలమటిస్తూ దిగులుగా ఓ చెట్టు నీడ పడి వుంటుంది.

"ఎవడారగించు నమృత భోజనంబున
కలిసెనో ఈ లేమ గంజి బువ్వ
ఎవడు వాసము చేయు,శృంగార సౌధాన
మునిగెనో యిన్నారి పూరి గుడిసె.

ఎవని దేహము మీద ధవళాంబరములతో
పాసగెనో యిన్నాతి ముదుక పంచ
ఎవడు దేహము సేర్చు మృదు తల్పములలోన
నక్కెనో ఈ యమ్మ కుక్కి పడక

వసుధపైనున్న భోగ సర్వస్వమునకు
స్వామిత వహించి మనుజుండు ప్రభవమందు
ఎవ డపహరించె ఏమయ్యె ? ఈమె సుఖము
కలుష మెఱుగని దీని కొడుకుల సుఖంబు"

ప్రపంచంలోని పంచ భూతాలు, భోగభాగ్యాలు ప్రపంచంలో వున్న ప్రజలందరికీ ఉమ్మడి హక్కు. వాటిని ఏ ఒక వర్గమూ బలవంతాన స్వాధీనం చేసుకోవటం అన్యాయమని జాషువా ఖండిస్తున్నాడు.

## తెల్లదొంగల తర్వాత నల్లదొంగలు

మన దేశానికి అర్ధరాత్రి స్వాతంత్ర్యం వచ్చింది కాని ఇంకా తెల్లవారలేదన్నాడో తమిళకవి. కాని జాషువా స్వాతంత్ర్యం వచ్చిన తొలి రోజుల్లోనే మన బండారాన్ని చూడగలిగిన క్రాంతదర్శి.

"తెలదొంగల్ తినిరందువేల ? మన యాస్తిన్ నల్ల మార్కెట్లలో
నలదొంగల్ తినకుండ జూచుకొని యజ్ఞంబై విమూఢాశయా
కులమైయున్న యనుంగుదేశమున సంక్షోభంబు మాయించి ని
శ్చలశాంతిన్ వెలయించి నీదు ప్రతిభాశక్తుల్ ప్రదర్శింపుమా !"

అంటూ సందేశ మిస్తాడు. స్వాతంత్ర్యం వచ్చాక మూడేళ్లకే ఇలా సూటిగా ప్రశ్నిస్తాడు.

"రాజ్య పీఠ మెక్కి రాజదండము బట్టి
మూడు వత్సరాలు ముగిసిపోయె
దొరల రాచరికమె మెరుగయ్యె ననిపించె
మారుపల్కవేల మంతిరన్న!"

ఎన్నికల సందర్భాల్లో నాయకులు వేసే వేషాలను ఎండగడతాడు జాషువా. దుర్మార్గులైన వారిని నమ్మి ఓట్లు వేస్తే మన జీవితాలన్నీ చీకట్ల పాలుకాక తప్పదని విశదీకరిస్తాడు.

"ఒక పర్యాయము చేయిజారితిరి మీ వోటుల్ దగా దేశనా
యకులన్నమ్మి సమస్త కష్టములపాలై దేశమల్లాడె. వా
లకముల్ మారిచి వారు వారి హితులున్ లాలింపగా వత్తురిం
డ్లకు బండ్లెక్కి ప్రజాహితార్థులవలెన్ ద్రవ్యంబు మ్రింగించుచున్."

నిజంగా దేశసేవ చేసేవాడికి డబ్బుతో గెలవాల్సిన పని వుండదు. సేవ చేయటానికి పదవులుండక పోయినా నష్టం లేదు. వేలు, లక్షలు ఖర్చు చేసి గెలిచిన వాడు రేపు ప్రజలనుండి అంతకు ఎన్నో రెట్లు గుంజకుండా ఉండడనే సంగతి ప్రజలు గ్రహించాలని జాషువా ఆవేదన.

## ధనవంతుల పత్రికలు

ఈనాడు వస్తున్న పత్రికలు ఏవో కొన్ని రాజకీయ పక్షాల ప్రయోజనం కోసమో, ఏవో కొన్ని కులాల స్వార్థం కోసమో, ఏవో కొన్ని వర్గాల దోపిడీ కోసమో పనిగట్టుకొని ప్రచారం చేస్తున్నాయి. ఈ స్థితిని ఏనాడో పసిగట్టగలిగాడు జాషువా.

"స్వీయకులోన్నతిన్ బలికి జిహ్వక లేని ప్రజా జగత్తు క
న్యాయము చేయు నోరుగల యట్టి ధనాఢ్యుల కగ్రపీఠముల్
వేయుచు విశ్వ సత్యమును పిండి జగంబును మేలు కొల్పు మే
ల్ప్రాయసకాంద్ర మేటి ప్రతిభల్ తలపోయరు పత్రికాపతుల్."

## స్త్రీలలో చైతన్యం

స్త్రీలలో చైతన్యం వచ్చినపుడే సమాజంలో రాజకీయ చైతన్యం పెంపొందటానికి వీలవుతుంది. మూఢాచారంలో మునిగి పోవద్దని, ముడుపులు కడుతూ పూజారుల పొట్టలు నింపటం వలన ప్రయోజనం లేదని స్త్రీలను హెచ్చరిస్తాడు.

"నీ కడుపున జన్మించుచు
నీ కమ్మనిపాలు ద్రావి నెగడిన మగ వా
డే కారణమున ఘనుడని
ఊ కొట్టితి వతని వంచనోక్తి స్ఫురణల్"

అని ఆలోచింపజేస్తూ "గుడ్డల్ దొడ్డనగల్ ధరించుకొని షోకుల్ జేసి మోదింతువా

బిడ్డా ! ఎంతటి వెఱ్ఱిదానవు కళావిశ్వంబు వీక్షింపుమీ" అని చురక వేస్తాడు.

## ప్రపంచశాంతి

మతాలు కూడ కులాలవలె పరస్పర విద్వేష కారణాలే అవుతున్నాయని జాషువా భావన.

"కృష్ణమూర్తి పేర ఏసుక్రీస్తుని పేర
భిన్నమతము లుద్భవిల్లునపుడు
విశ్వశాంతి గోరు విజ్ఞుల చిత్తాల
కంటి నీరు కొలువగలవె నీవు ?"

ఈనాడు ప్రపంచాన్ని మున్నెన్నడూ లేనంతగా యుద్ధ భీతి ఆవరించింది. శాంతి స్థాపనకోసం యుద్ధవ్యతిరేక సభల్ని కమ్యూనిష్టు అనేక దేశాల్లో నిర్వహిస్తున్నారు.

"అహరహంబు నూత నాణ్వస్త్రములు చేసి
గుప్తపరుచు నాయకులను జూచి
విహ్వలించుచున్న విశ్వమానవకోటి
కభయమిచ్చు శాంతి సభల మీద
కురియుగాత విజయ కుసుమ వృష్టి" అని ఆశించారు.

## నేటి విద్య

నేటి విద్యావిధానం సర్వ కలుషాలకు మూల కారణం. విద్యను గురించి జాషువా చేసిన విమర్శ చదువుకొన్న దుర్మార్గుల గుండెల్లో బాణంగా గుచ్చుకొని తీరుతుంది. ఈ క్రింది రెండు పద్యాలను సహృదయులు చదివి గ్రహించాలి. వీటిని వ్యాఖ్యానిస్తే చాలమంది మేధావులకు, పెద్ద పెద్ద విద్యావేత్తలకు భుజాలు తడువుకోవల్సిన అవసరం వుంటుంది.

"జనులం జీలిచి పిప్పిచేసెడు దురాచారంబులన్ కాలమ
ట్టని విద్యా బలమేల। విద్యయన మౌఢ్య వ్యాప్తి కింపైన భో
జనమా। మోసపు వ్రాత కోతలకు రక్షాబంధమా ! ఎందుకీ
మనుజత్వంబు నొసంగ లేని చదువుల్ మైరేయపుం మైకముల్ ?"

"పయిపై నవ్వులు పల్కరింపులు మృషా బాంధవ్యముల్ సూపి ఆ
పయి శత్రుత్వముసేయు నాగరికతా భ్రష్ట స్వభావాధముల్
సయితానుల్ చరియింపనట్టి ధర గోష్పాదంబు గన్పట్టి[illegible]న్
దయతో నా కెఱిగింపుమమ్మ యచటన్ నా యిల్లు గట్టించెదన్".

## కవిత్వంలో హాస్యం

జాషువా రాసిన కావ్యాలలో హాస్య ప్రధానమైనవి లేకపోవచ్చు కాని ఆయన కవితల్లో హాస్యం లేకపోలేదు. సామాజిక సమస్యల్ని చిత్రించటం, మన పొరపాట్లకు చురకలు వేయటం జాషువా హాస్యంలో ఉన్న విశేష లక్షణం. హాస్యమంటే ఏదో నవ్వు తెప్పించేదని మాత్రమే కాదు, ఆ హాస్యం పాఠకునిలో చైతన్యం కలిగించటానికి కూడా తోడ్పడాలనేది ఆయన అభిమతం. పిలకను గురించి ఆయన రాసిన పద్యం ఇది. తల మీదున్న క్రాపుకు పిలకకు తగాదావచ్చి ఇలా పోటీపడుతున్నాయట.

"నేనైన నుండవలయున్
దానైనన్ నిల్వ వలయు దలమీద నటుల్
గాని యెడ నుభయ కులములు
ఖూనీగావలయు వట్టి గుండుండవలెన్."

పిలక చాదస్తానికి ప్రతీక. క్రాపు ఆధునికతకు గుర్తు. ఆధునికతపై విపరీతమైన కోపంతో సనాతనులు చేసే మూర్ఖ కార్యక్రమాలను జాషువా ఖండిస్తున్నాడు. పాత కొత్తల మధ్య సమన్వయం కావాలని ఆయన ఆశ. మహాకవి అనే బిరుదును ఇద్దరు కవులకు ఇస్తే అలా ఇద్దరికీ ఇవ్వటానికి వీలులేదని ఎవరికీ లేకుండా చేసే అసూయకు ఈ కవిత పరోక్షంగా చెంపపెట్టు.

ఇద్దరు క్రైస్తవ భక్తులు ఒక పల్లెటూరిలో బోధించటానికి వెళ్ళినారట. వారి బోధ ఎలా వుందో జాషువా చెపుతున్నాడు.

"కొంత యర్థమగుచు కొంత యర్థము గాక
వారి బోధ పల్లెటూరి ప్రజకు
తాత వేసికొన్న తాంబూలమును బోలి
ఉబుసుపోక కోస ముపకరించె".

ప్రజలకు ఏ విధంగా చెపితే అర్థమవుతుందో గ్రహించకుండా ఏదో తాము చెప్పదలచింది చెప్పామనుకొంటే లాభం లేదని అభిప్రాయం. తాత తాంబూలం వేసుకుంటే ఎక్కువ భాగం రసం బయటకొచ్చేస్తుంది, ఏదో కాస్త నోటి లోపలికి పోతుంది. అలా ఆ బోధకుడు చెప్పేది చాల గాలికి పోతుందని చెప్పటానికి ఇంత సహజమైన పోలికను స్వీకరించి హాస్యాన్ని కల్పిస్తాడు జాషువా.

ఆశయాలు వల్లిస్తూ ఆచరణలో శూన్యమైన ప్రవర్తనకు నిశితంగా ఎలా చురక లేస్తాడో చూడండి.

"కులమతాలు లేని బలమైన జాతిగా
మార్చదలచినాము మానవులను
కులమతంబు లెన్నికల కాలములలోన
అడపదడప మాకు అవసరమ్ము"

వివాహమంటే భార్యను కొట్టటానికి తిట్టటానికి లభించిన పట్టాగా భావించే ఒక అల్లుడు అత్తమామలను నానారకాలుగా ఇబ్బంది పెడుతుండేవాడు, అలాంటి వాడికి కూతురు పుట్టి పెద్దదయ్యేసరికి ఇలా అనుకుంటున్నాడు.

"అల్లుడనని నిక్కిన నా
కల్లుడొకడు దాపురించి యధికారముతో
ఇల్లుం జొచ్చెన్ నేనిపు
డల్లుండనుగాను మామనై కూర్చుంటిన్."

అత్తా ఒకింటి కోడలే అనే సంగతి మరువకూడనట్లే అల్లుడూ మరో నాటికి మామేననే సంగతి గుర్తుపెట్టుకోవాలని హెచ్చరిస్తాడు కవివర్యుడు.

జాషువా చిత్రించే హాస్యం వెనుక అనంతమైన ఆవేదన కూడా దాగి వుంటుంది. బడి పంతులు దీనస్థితిని ఇలా వర్ణిస్తాడు.

"పది మంది బిడ్డలును ఒక
ముది నులకల కుక్కి మంచమును కంచంబున్
జిదుగుం జిత్తడి కొంపయు
ఎదిరించెడు పెండ్ల మతని గృహలక్షణముల్"

"నల్లుల కుర్చీయును బడి
పిల్లల యల్లరియు చింతబెత్తము బెంచీ
నల్ల సిరాబుడ్డియు ఒక
బల్లయు ముడి బొమ్మ లతని బడి సామానుల్".

మొదటి పద్యంలో గురువు సంపదగా "ఎదిరించెడు పెండ్లము" రెండవ పద్యంలో "పిల్లల యల్లరియు" అనేవి హాస్యాన్ని కల్గించటానికి ఎక్కువగా దోహదపడే విషయాలు.

చీట్ల పేక ఆడేవాడు ఎంత మహాతత్త్వజ్ఞుడైనా ఆ రంగం అలంకరించే సరికి "అనుగుంబిడ్డడు బావిలో పడియెనన్నా ! లేచి రమ్మన్న తెచ్చునదీ మార్గమెగా యటంచు వచియించున్ జూదగాడు" - అనే స్థితిలోకి వెళ్ళి వ్యసనానికి

బానిసవుతాడని హాస్యం జోడిస్తూ హెచ్చరిస్తాడు జాషువా.

## జాషువా బాష

సామాజిక సమస్యల్ని చిత్రించటానికి ఆయన వినియోగించుకొన్నది సరళ భాష. చక్కని ధారాశుద్ధి, పలుకుబడులు. నుడికారం ఆయన కవిత్వానికి ఎనలేని సంపద. అర్థం కాకుండా అప్రసిద్ధ సమాసాల్తో సమస్యల్ని చిత్రించటం ఆయన కిష్టం లేదు. ప్రయోజనాన్ని ఆశించిన ఆయన పద్యాలు ఆపాత మధురాలు. ఆలోచనామృతాలు కూడా. ఒక బీదరాలు ఓయింటి చెంత కూర్చుంటే ఇల్లుగలావిడ వచ్చి నిందించే పద్యంలో పలుకుబడి, నుడికారం సొంపు గమనించవచ్చు.

"ఓసీ! ఎవ్వతెనీవు? నీ మగని సొమ్మున్నట్లు పాపిష్టు రా
లా! సంసారము బెట్టినావు మొగసాలన్, లేచి పొమ్మంచు ఔ
దాసీన్యంబుగ మాటలాడి జల పాత్రన్ కాలితో తన్నినన్
కాసంతేని కలంక కయ్యుబల సంతానంబు వెంటాడగన్."

నీ మగని సొమ్మున్నట్లు, సంసారము పెట్టినావు, లేచిపొమ్ము, కాసంతేని-ఈ ప్రయోగాలు జనం నాలుకల మీద మనకు సందర్భానుసారంగా దర్శన మిచ్చేవే. నేటి తుంగభద్ర శ్రీ కృష్ణదేవరాయలను ఎరుగనట్లు "నంగనాచివోలె" నడుస్తూ వుందంటాడు.

## పరిష్కార సూచనలు

చివరిగా చెప్పుకొంటున్నామని తక్కువగా చూడరాని ముఖ్య లక్షణం కవికి ఇంకొకటి ఉండాలి. సమస్యల పరిష్కారాల్ని కూడా సూచించటం అత్యవసరం. ఈ రోజు కలంపట్టి కవిత్వం రాస్తున్న ఏ కవికైనా ఈ లక్షణం అత్యంత ఆవశ్యకం. జాషువా ఇప్పటివాడు కాడు. ఆయన నివసించిన కాలాన్నిబట్టి ఆ పరిస్థితుల్ని బట్టి ఆయన ఏ యే పరిష్కారాలు సూచించాడో జాగ్రత్తగా పరిశీలించవలసివుంది. ప్రజలలో మానవత్వం పెంపొందాలని బోధించాడు. దురాచారాలన్నింటినీ ఖండించి హేతువాదం వైపు ప్రజల్ని ప్రయాణం చేయమన్నాడు. అలాగే ధనవంతులు పేదలకు సానుభూతి చూపి సహాయం చేయాలని ఆశించాడు. కాని విషవలయాలకు ఆధారమైన ఈ వ్యవస్థను ప్రజలంతా కలసికట్టుగా కదిలి తిరుగుబాటు చేసి మాడ్చి మసిచేయాలని పరిష్కారం సూచించలేదు జాషువా అని కొందరు విమర్శకుల అభిప్రాయం. ఇది పరిపూర్ణ సత్యం కాదు. జాషువా తిరుగుబాటును ప్రత్యక్షంగా చెప్పకపోయినా ఆయన అంతరంగంలోని అంతరంగంలో ఆ భావం లేక పోలేదు.

"పెరుగుంబాలు ఫలించుచున్ నిరతమున్ విశ్వంబు పోషించు నిన్నఱవం గుత్తుక కోయ దాయలకు ద్రవ్యాశన్ సమర్పించు ముష్కరులన్ కొమ్ముల జిమ్మవేమిటికి" అంటూ ఆవును గూర్చి రాసిన పద్యాలలో తిరుగుబాటును ప్రోత్సహిస్తున్నట్లు ఊహించవచ్చు.

## జాషువా శైలి

జాషువా కవిత్వంలో మరో రెండు ప్రత్యేకతలున్నాయి. నిజమైన కవిత్వం అంటే "Proper words at proper place" అంటాడో పాశ్చాత్య విమర్శకుడు. సముచిత స్థానంలో ఆ సందర్భాన్ని బట్టి కూర్చటానికి ఏదో ఒక పదం మాత్రమే తగివుంటుంది. అంతే కాని దాని పర్యాయపదాలతో ఆ స్థానాన్ని నింపటానికి వీలుకాదు. అలా కక్కుర్తిపడి నింపితే కవి భావించిన విశేష భావానికి దెబ్బ తగలటం ఖాయం. ఎక్కడ ఏ పదం వాడాలో ఆ పదమే జాషువా కలం నుంచి దూకుతూ వస్తుంది. ఇలా వచ్చిన పదజాలం జాషువా పద్యరచనా ధారకు రమణీయమైన సొగసుల్ని వెలిగిస్తుంది. ఎక్కడైనా ఎపుడైనా చాలా అరుదుగా మాత్రమే యతి, ప్రాస, గణం మొదలైన నియమాలకు లోబడకుండా కొన్ని పదాలు వాటిని ఎదిరించి నిలబడతాయి. ఇలాంటి సందర్భాలలో జాషువా కంగారుపడి ఏదో ఒక పర్యాయ పదం పొరపాటున కూడా స్వీకరించడు. సందర్భానికి తగిన ఆ మాటనే తగిన రీతిలో చెక్కి పద్యంలో బిగిస్తాడు. ఈ క్రింది ఉదాహరణలు మనకీ విషయం నిరూపిస్తాయి.

1. వేయి మాటలేల వేషభాషల కాన
   రాదహంబు రామిరడ్డి యందు
2. శ్రీ శకుంతలాంబ శ్రీ రామిరెడ్డిగా
   రాల బిడ్డ ఖదరు రాచతపసి.
3. తగ్గక రక్తపుంజినుకు నష్టముగాని స్వరాజ్య యుద్ధమున్
   నెగ్గిచి నట్టి భారతముని ప్రవరుండు క్షమా ప్రవాసి.

రెడ్డి అనే మాటను రడ్డిగా వాడుతాడే తప్ప ఆ పదం స్థానాన్ని పొరపాటున కూడా మార్చడు. ఖద్దరు అనే పదం భగణం. ఈ గణం ఆటవెలది పాదంలో మొదటి మూడు గణాల్లో రావటానికి వీలులేదు గనుక "ఖదరు"గా వాడి నగణం చేసేశాడు. కావాలనుకుంటే ఒకటి మూడు పాదాల్లో ఉత్తర భాగంలో భగణం వేసుకోవచ్చు. కాని గణంకోసమని సముచిత పదాల సముచిత స్థానాన్ని మార్చబోడు. అలాగే నెగ్గించినట్టి అనే పదాన్ని "నెగ్గిచినట్టి" అని చెక్కి పదాన్ని అందంగా నిర్మిస్తాడు. "బెర్నార్డ్ షా" అనే కఠిన పదాన్ని "బెరనారుడుషా" అని సారళ్యం సాధిస్తాడు.

జాషువాలోని మరో ప్రత్యేకత - ఆయన కవిత్వంలో సూక్తుల్ని మలిచిన తీరు. నన్నయనుండి నేటి దాకా చాల మంది పద్యాల కవులు తమ రచనల్లో ఎన్నో సూక్తులు వెదజల్లారు. వెదజల్లుతూనే వున్నారు. జాషువాకు సూక్తుల్ని చెప్పటంలో వున్న ప్రత్యేకత ఏమంటే అది అర్థాంతరన్యాస అలంకారంలో ఒక భాగంగా సూక్తుల్ని అల్లి సహృదయుల్ని అలరించటం. విడిగా ఊరక సూక్తులు చెపితే జనాన్ని అవి ఆకర్షించవని ఆయన నమ్మిక.

1. మొగలు దొరసాని లావణ్య భూషణంబు
   కన్నుమూయదు సంతాన ఘర్షణమున
   జీవితంబున నొక దుష్టచింతలేని
   సత్యవంతుల ప్రాయంబు జారదండ్రు.

2. తన సంతానము మాతృహీనమయి వంతం గుందుచున్నట్లుగా
   తన రాయండు వియోగభారమున చింతన్ మున్గుచున్నట్లుగా
   తనకై దొడ్డ సమాధి నెయ్యమున పొంతంగట్టుచున్నట్లుగా
   అనుమానించుచునుండె, సత్పతుల ఊహల్ సత్యసామీప్యముల్

3. అహరహము టాజి సౌందర్య మపహరింప
   తడవుచున్నాడు కాలంబు తస్కరుండు
   మొదటి క్రొత్తందనము చెక్కుచెదర దిపుడు
   సత్కృతులపొంత సాగునే సమయబలము.

ఈ విధంగా విశేషాన్ని చెప్పి సామాన్య ధర్మంతో సమర్థించి చెప్పేటపుడు సూక్తుల్ని మేళవించటం ఆయన కవిత్వంలో చాలచోట్ల మనం దర్శించవచ్చు.

చాలమంది కవులు పుట్టాక నేర్చుకొని పద్యాలల్లుతారు, పద్య కవితారచనను సుసంపన్నం చేయటానికే జాషువా పుట్టాడు. పద్యాలు రాసిన కవులందరిలోను జాషువా మహాకవి.

(విశాలాంధ్ర 7-10-1984)

# ఆధునిక సమాజంలో అవధాన కళ

అవధానం అనే అపురూప సాహిత్య ప్రక్రియ ప్రపంచ సాహిత్యంలో ఒక్క సంస్కృతంలోనే ఉందని, తర్వాత అది ఆంధ్ర సాహిత్యంలోకి వచ్చిందని మొవ్వ వృషాద్రిపతి ప్రభృతుల అభిప్రాయం. "శతలేఖినీ పద్య సంధాన ధౌరేయు"డ నని మొదటిసారిగా చెప్పుకొన్నవాడు భట్టుమూర్తి. తర్వాత కాలంలో సహస్రఘంట కవి ప్రభృతులుండేవారు. కాని తెలుగు సాహిత్యంలో ఈ అవధానం అనేది తర్వాత బాగా సన్నగిల్లింది. ఆధునిక యుగ ఆరంభంలో తిరుపతి వెంకట కవులు, కొప్పరపు సోదర కవులు ... ఈ అవధాన ప్రక్రియను తెలుగుదేశంలో మళ్ళీ ఓ వెలుగు వెలిగించారు. ఆధునిక కవిత్వంలో అభ్యుదయ కవిత్వం, విప్లవ కవిత్వం విజృంభించిన దశాబ్దాలలో ఈ అవధాన కళ మళ్ళీ బాగా వెనకబడిపోయింది. 1990 తర్వాత ఆధునిక కవిత్వంలో కొత్త కొత్త ఉద్యమాలు చాల వచ్చాయి. దళిత కవిత్వం, స్త్రీ వాద కవిత్వం, మైనారిటీ వాద కవిత్వం వగైరా ఉద్యమాలు వచ్చాయి. ఇలా విప్లవ కవిత్వ ధోరణి శాఖోప శాఖలుగా చీలిపోయింది. ఈ ధోరణులకు సంబంధం లేని కవులు ఎవరి ధోరణిలో వారు కవిత్వం రాసుకోవటం మొదలుపెట్టారు. ఈ సందర్భంలోనే అవధాన కళ కూడా తిరిగి చిగురించడం ప్రారంభించింది. "అలనాడెప్పుడో 1910 ప్రాంతంలో అవధాన పరంపర జరిగి ఎంతో ఉద్దీప్తంగా సాహిత్యం ఒక ఆరోగ్యకరమైన విద్యాస్పర్థతో వర్థిల్లిందని విన్నాం. మళ్ళీ చరిత్ర పునరావృతమైనది. ఈ శతాబ్ది చివరి దశకం 1990 నుండి ... అవధానాల విజృంభణ జరుగుతోంది" అంటున్నారు దత్తాత్రేయ శర్మ. గరికపాటి నరసింహారావు, మేడసాని మోహన్, మాడుగుల నాగఫణి శర్మ, కడిమెళ్ళ వరప్రసాద్, రాళ్ళబండి కవితా ప్రసాద్, వద్దిపర్తి పద్మాకర్ ప్రభృతులు ఎందరో ఈ అవధానాలు చేస్తూ జనాన్ని ఆకర్షిస్తున్నారు. ఈ సందర్భంలో అవధానాల గురించి, వాటి విలువలు పరిమితుల గురించి, వాటిల్లో వస్తున్న ఆధునిక ధోరణుల గురించి పరిశీలించడం ఈ వ్యాస ఉద్దేశం.

అవధానాలు అనేవి రాచరిక వ్యవస్థకు సంబంధించినవని, ప్రజాస్వామ్య యుగంలో పనికిరావనే విమర్శ ఒకటుంది. ఇదే నిజమైతే కవి సమ్మేళనాలకు రాని జనం అవధానాలంటే ఎందుకు పరుగెత్తుకొస్తున్నారో సాహితీ విమర్శకులు ఆలోచించాల్సిన అవసరం ఉంది. పక్షపాతం లేకుండా ఆలోచించి చూస్తే అవధానాల వలన ఈ క్రింది ప్రయోజనా లున్నాయి.

*1.* భాషాభిమానం : అవధానాలలో వినిపించే పద్యాల వలన, అందులోని చమత్కారాల వలన జనం ఆనందానుభూతి పొందుతారు. అందువలన ప్రజలకు భాషాభిమానం పెరిగే అవకాశం ఉంది.

2. ఆనందానుభూతి : అవధానాల్లో జరిపే అప్రస్తుత ప్రసంగాల్లో దొర్లే హాస్యం జనానికి బాగా ఆనందం కలిగిస్తుంది. ఈ హాస్యం కారణంగా జనం ఎక్కువ మంది ఈ అవధానాలకు హాజరవుతున్నారు. మామూలు కవి సమ్మేళనాలకు రాని జనం ఈ అప్రస్తుత ప్రసంగ హాస్యం కోసం అవధాన కార్యక్రమాలకు హాజరవుతుంటారు.

3. అద్భుత రసస్థానం : విరుద్ధంగా, విడ్డూరంగా కనిపించే సమస్యల్ని, దత్తపదుల్ని, వర్ణనల్ని ఏ రకంగా అవధాని పూరిస్తున్నాడో, ఏ రకంగా వైరుధ్యం తొలగించి పరిష్కరిస్తున్నాడో అని ఉత్కంఠతో జనం ఎదురుచూస్తుంటారు. అవధాని సమస్యను పరిష్కరించే సరికి జనంలో ఆ ఉత్కంఠ ఆశ్చర్యంగా మారి, ఆ ఆశ్చర్యం అభినందనగా మారి, ఆ అభినందన ఆనందంగా మారుతుంది. ఒకో ఆవృతంలో ఒకో పాదం చెప్పిన అవధాని, అవధానం చివర ఆ పద్యాలన్నింటిని ధారణ చేస్తాడు. అన్ని పద్యాలను జ్ఞాపకం చేసుకుని ఒక్కసారే వాటన్నిటినీ సభ ముందుంచుతాడు అవధాని. అవధాని జ్ఞాపకశక్తికి, కంప్యూటర్‌లాంటి అతని బుర్రకు విస్తుపోతారు జనం. మనిషి బుర్ర కంప్యూటర్‌కన్నా గొప్పదనే భావం, దానిని చక్కగా వినియోగించుకొనే చైతన్యం జనంలో బాగా పెరిగే అవకాశం ఉంది.

4. **సాంస్కృతిక పరిజ్ఞానం :** ఈ అవధానాలలో మధ్య మధ్య అవధాని ప్రాచీన కావ్యాలలోని విశేషాలు చెప్తూ ఉంటాడు. సంస్కృతి సంప్రదాయాలకు సంబంధించి ఎన్నో విశేషాలు తేటతెల్లం చేస్తుంటాడు. మరిచిపోతున్న మన సంస్కృతిని తిరిగి జ్ఞాపకం చేస్తాయి ఈ అవధానాలు.

5. విజ్ఞాన కేంద్రం : అవధానం జరుగుతుండగా అవధాని అనేక విజ్ఞాన విషయాలు కూడా చెబుతుంటాడు. ప్రాచీన శాస్త్రాలలోని అంశాలతోపాటు ఈనాటి సాంకేతిక యుగ సమాచారం కూడా అందజేస్తాడు.

ఈ అవధానాలు నిజంగా ఈ ప్రయోజనాల్ని ఎంత వరకు సాధిస్తున్నాయనేది గమనించాలి. సమాజానికి ఆనందం, ప్రయోజనం కలిగించగల ఈ అవధాన కళను కొందరు దుర్వినియోగం చేయటం కూడా చాలా సందర్భాలలో కనిపిస్తున్నది.

1. అప్రస్తుత ప్రసంగం - అశ్లీల సంభాషణలు : అవధాని ఒక పాదం చెప్పిన తరువాత రెండవ ఆవృతంలో రెండవ పాదం చెప్పబోతుంటే "అవధాని గారు ఒక పాదం ఎత్తారు, రెండవ పాదం కూడా ఎత్తబోతున్నారు, అందులో మనకు ఏం చూపిస్తారో" వగైరా అశ్లీల సంభాషణలు జనానికి ఆనందం కలిగిస్తున్నాయని చెప్పడం మనల్ని మనం అవమానించుకోవడమే. ఉదాత్తమైన సినిమా కళను కొందరు దుర్వినియోగం చేస్తున్నట్లే - అప్రస్తుత ప్రసంగ కర్తలు, కొందరు అవధానులు ఈ అవధాన కళను దుర్వినియోగం చేస్తున్నారు. సామాజిక సంక్షేమ దృష్టితో కొందరు

నిర్వాహకులు ఈ అప్రస్తుత ప్రసంగాన్ని ప్రస్తుత ప్రసంగంగా మార్చి ఎన్నో విలువైన విషయాలు రాబట్టేలా ఆధునికత జోడించి అశ్లీల సంభాషణలకు తావు లేని విధంగా రూపొందించే ప్రయత్నాలు చేస్తున్నారు. ఇది అభినందించవలసిన సంగతి.

"నాకు పెద్దిల్లుంది, చిన్నిల్లు కట్టించుకోమంటారా" వగైరా సంభాషణలు స్త్రీమూర్తిని పవిత్రంగా గౌరవించే మన సంస్కృతికి చెప్పుదెబ్బల్లాంటివనే అవగాహన రావాలి. ఎంతసేపు పచ్చి శృంగారమే అప్రస్తుత ప్రసంగం అనుకునే నీచ దృష్టి నుండి అప్రస్తుత ప్రసంగకర్తలు బయటపడాలి. అలా బయటపడలేని అప్రస్తుత ప్రసంగ కర్తల్ని అవధానులు ప్రోత్సహిస్తూ సంస్కృతి విఘాతానికి దోహదం చేయకూడదు. తెలుగు సంస్కృతిని నిజంగా పెంపొందిస్తున్నాం అనుకొనే అవధానులు అశ్లీల సంభాషణల్ని, అలాంటి అప్రస్తుత ప్రసంగ కర్తల్ని నిరుత్సాహపరచాలి. అవధాన సభల నిర్వాహకులు కూడ అలాంటి అప్రస్తుత ప్రసంగ కర్తల్ని దూరంగా ఉంచాలి. అశ్లీల సంభాషణల్ని ప్రోత్సహించే అవధానుల కార్యక్రమాల్ని కూడా నిర్వాహకులు ఏర్పాటు చేయకూడదు. జనం కూడా అలాంటి అవధానుల్ని, అవధానాల్ని తిరస్కరించాలి. అప్పుడే అవధానాల విలువ పెరుగుతుంది. "మన్మథలీలలు" అనే సినిమాలో అంతా అశ్లీలం చూపించి చివరలో ఇలా చేయకూడదని చెప్పినా అశ్లీల ముద్రే జనంలో బాగా పడుతుంది. అవధానాలలో కూడా ఇలాగే అశ్లీల సంభాషణల ముద్ర జనంమీద మిగిలేలా చేస్తే అవధానాల ప్రయోజనం పూర్తిగా దెబ్బతిన్నట్లే. పూర్తిగా దుర్వినియోగ మయినట్లే.

కొన్ని మంచి అప్రస్తుత ప్రసంగాలను గమనిద్దాం. "స్వర్గ లోకంలో శ్రీనాథుడు, శ్రీశ్రీ కలుసుకున్నారనుకోండి. వారేం మాట్లాడుకుంటారో చెప్పండి" అని ఓ అప్రస్తుత ప్రసంగ కర్త అడిగాడు. దానికి అవధాని ఇలా స్పందించాడు.

శ్రీశ్రీ : "మీలోకంటెను నాలో
శ్రీలే మరి అధికమయ్యె శ్రీనాథయ్యా !

శ్రీనాథుడు : శ్రీలను ముందుగ గల్గియు
శ్రీ లేకనె పోయినాము శ్రీ శ్రీ గారూ !"

అంటూ అవధానికి పద్యం చెప్పాలన్నంత ఉత్సాహాన్ని అప్రస్తుత ప్రసంగ కర్త ప్రశ్న అందించింది. శ్రీశ్రీ, శ్రీనాథుడు మాట్లాడుకుంటున్నారట - మీలోకన్న శ్రీలు ఎక్కువగా ఉన్నాయని శ్రీశ్రీ అంటే దానికి సమాధానంగా శ్రీనాథుడు - మనలో శ్రీలు ఉన్నా శ్రీలేకుండానే వెళ్ళిపోయాము గదా అన్నాడట. ఇద్దరు కవులకు పేరులో శ్రీ ఉందిగాని దరిద్రంతోనే కవులిద్దరూ చనిపోయారనే విషయాన్ని చమత్కారంగా ఆశువులో పండించటం అవధాని ప్రత్యేకత.

పొగ త్రాగనివాడు దున్నపోతై పుడతాడన్నారు కదా, మీరేమంటారని అవధానిని అప్రస్తుత ప్రసంగ కర్త అడిగితే, అవధాని - ఇక్కడ దీనిని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి, "పొగతాగనీ, వాడు దున్నపోతై పుట్టున్" అని అర్థం చేసుకోవాలని చక్కగా విరిచి నిర్మాణాత్మక భావాన్ని వెలువరించటం అవధాని ప్రత్యేకత.

2. **అశ్లీల సమస్యలు:** సమస్య ఇవ్వటం అనేది అవధానాల్లో ఒక ముఖ్యమైన అంశం. చాలా చక్కని సమస్యలు ఇస్తున్న సందర్భాలు బాగానే ఉన్నాయి. అంతేకాని "అంగము చేతబట్టుకొని ఆడిరి పండితులెల్ల రుద్ధతిన్", "రవికను పట్టిలాగె ఒక రమ్య గుణాత్ముడు స్త్రీలు మెచ్చగన్" అనే సమస్యలు మంచివి కావు. ఇందులో అశ్లీలం లేదని, అవధాని ఈ అశ్లీలం పరిహరించి అందంగా చెప్పగలడని వాదించే అవధాన దురభిమాను లుండవచ్చు. జనం మనసుల మీద ముందుగా అశ్లీల ముద్ర వేసి తరువాత ఎంత అందంగా చెప్పినా మొదటి ముద్ర ప్రభావం, ఆ దుష్ఫలితం అంత తేలికగా పోదని గుర్తించాలి. మానసిక శాస్త్ర పరిజ్ఞానం లేనివాళ్ళు ఇలా వితండ వాదాలు చేస్తుంటారు.

కొన్ని చక్కని సమస్యలు చూద్దాం. "పుస్తక పఠనంబు చెరచు బుర్రల నెల్లన్" అని అడిగితే అవధాని చెప్పిన పూరణ ఇది.

"మస్తకముల సుస్తీలను
జాస్తిగ వదిలించునట్టి చరితలు గల మా
పుస్తకములు చదువుడు, చెడు
పుస్తక పఠనంబు చెరచు బుర్రల నెల్లన్"

అంటూ అవధాని చాలా చక్కగా సమస్యను పూరించాడు. "కోతిని పెండ్లియాడె నొక కోమలి స్నేహితురాండ్రు మెచ్చగా" అనే అద్భుతమైన సమస్యకు అవధాని అందించిన అద్భుతమైన పూరణ గమనించండి.

"భీత మృగాక్షి యొక్కతె వివేచన కోల్పడె చర్మ బాధచే,
నాతికి పెండ్లి కాదని వినాశన మౌనని నేస్తులెంచుచున్
జాతకముల్ గుణింపగ, భిషక్కుని సాయము పొంది మందో మా
కో తిని పెండ్లియాడె నొక కోమలి స్నేహితురాండ్రు మెచ్చగా"

చర్మవ్యాధి ఉన్న ఒక అమ్మాయికి పెండ్లి కాదని అన్నారట. కాని ఆ అమ్మాయి మంచి వైద్యుడు దగ్గర మందో, మాకో తిని పెండ్లి చేసుకోగలిగిందట. "కోతిని" అనే మాటను "మందో, మాకో తిని" అని విరిచి సమస్యను సరిచేశారు అవధాని. అట్లాంటిదే మరొక మంచి సమస్య - "ఆడ పిల్లల గనుట అన్యాయమగును".

"తల్లియై మురిపాల ముద్దలను పెట్టి

చెల్లిగా అనురాగంపు మల్లెలిచ్చు
సుదతి దేవత, కామంపు చూపుతోడ
ఆడపిల్లల గనుట అన్యాయమగును!"

అంటూ ఆడపిల్లల్ని ప్రసవించకూడదని ఇచ్చిన సమస్యకు, ఆడ పిల్లల్ని కామంతో చూడకూడదని చక్కగా సందేశ మిస్తూ సమస్యను పరిష్కరించారు అవధాని. "కనుట" అనే చక్కని తెలుగు మాటలోని శ్లేషను బాగా ఉపయోగించుకున్నారు అవధాని. పైగా ఈ పూరణలో చక్కని కవిత్వం కూడా పరిమళిస్తున్నది. తల్లిగా స్త్రీ మురిపాలనే ముద్దలను పెడుతుందట. అనురాగం అనే మల్లెపూలు ఇస్తుందట. స్త్రీ దేవతామూర్తి. ఆమెను గౌరవించాలనే సందేశాన్ని అందించిన అవధాని అభినందనీయులు.

**3. అశ్లీల దత్తపదులు :** దేశభక్తులు, సంఘ సంస్కర్తలు ఎందరో ఉండగా అదేపనిగా సినిమా హీరోయిన్ల పేర్లు ఇచ్చే తామర తంపర అలవాటు పృచ్ఛకులలో పెరుగుతోంది. ఇది ప్రజల్ని తప్పు త్రోవ పట్టించటమే. ఇటీవల జరిగిన ఒక శతావధాన సభలో ఐదారుగురు పృచ్ఛకులు సినిమా హీరోయిన్ల పేర్లే కలవరిస్తూ ఇవ్వటం శోచనీయం. జనానికి దుష్ట సంస్కృతి పట్ల మోజు పెంచే పనులవుతాయి ఇలాంటివన్నీ.

కొన్ని మంచి దత్తపదులను చూద్దాం. దోసె, పూరి, వడ, సాంబారు అనే పదాలిచ్చి వీటిని ఈ అర్థాలలో రాకుండా పార్వతీ కళ్యాణం గురించి పద్యం అడిగితే జనానికి ఆసక్తి, ఆకర్షణ, ఉత్కంఠ పెరిగాయి. దీనికి అవధాని చెప్పిన పద్యం గమనించండి.

"**పూరి**ంచెం గద దివ్యశంఖమును శంభుండల్లదే అద్రిపై
ప్రారంభించిరి శైవ ఘోషలట **సాంబా రు**ద్ర యంచున్ సదా
స్మేరాస్య ప్రథితాప్తి తా **వడ**కుచున్ సిగ్గిల్లగా పార్వతిన్
చేరెన్ శంభుడు పెండ్లి వేళను ఎ**దో సె**ప్పంగ తా ప్రేమతో"

"పూరించెను" అనే పదంలో 'పూరి'ని, "సాంబా రుద్ర" అనే సంబోధనలో 'సాంబారు'ను, "వడకుచున్" (వణుకుతూ) అనే పదంలో 'వడ' అనే పదాన్ని, "ఎదో సెప్పంగ" అనే పదాలలో 'దోసె'ను యిమిడ్చి పార్వతీ కళ్యాణాన్ని అందంగా వర్ణించి చెప్పారు అవధాని. ఏక్, దో, తీన్, చార్ అనే పదాలిచ్చి వరకట్న సమస్య గురించి పద్యం అడిగితే

"ఎక్కడ ధన బంధంబో
అక్కడ **దో**బూచులాడు వ్యాపారంబే
మక్కువ యువ**తిన్** గాంచిన

అక్కటా! పెంచారు రేట్లు, హా ! వరు లౌరా !"

హిందీలో ఇచ్చిన అంకెల్ని తెలుగు పదాలుగా మార్చుకున్న తీరు అభినందనీయం.

4. **శుష్క కవిత్వం :** సమస్యలు, దత్తపదులు, వర్ణనలు ... పృచ్ఛకు లడిగిన ప్రశ్నలకు అవధాని అప్పటికప్పుడు చెప్పవలసిరావటంతో పద్యం పూర్తి చేయటం ధ్యేయంగా పెట్టుకుంటాడే కాని అందులో చక్కని కవిత్వం పండించే అవకాశం తక్కువ. ఇది అవధానాల మీద వస్తున్న మరో ముఖ్య విమర్శ.

ఇందుకు అపవాదంగా గరికిపాటి నరసింహారావు, రాళ్ళబండి కవితా ప్రసాద్ మొదలైన అవధానులు మంచి కవిత్వాన్ని పండిస్తున్న సందర్భాలుండటం ఆనందించదగ్గ విషయం. బందరు శతావధానంలో - త్రిమూర్తులు మనుషులుగా పుడితే ఏం చేస్తారు అనే ఓ పృచ్ఛకుడు అడిగిన వర్ణనకు కవితాప్రసాద్ అందించిన పద్యం ఎంత గొప్పగా ఉందో గమనించండి.

"క్లోనింగన్న అదేమిటో తెలియగా కోరుంగదా బ్రహ్మయే,
ప్లానింగన్న అదేమిటో తెలియగా ప్రార్థించు ఆ విష్ణువే,
హానింగూర్చెడు బాంబు సంగతులనే అర్థించు ఆ శంభుడే,
జ్ఞానంబంతయు నేర్తు రీ మనుజులై జన్మంబులన్ పొందినన్."

బ్రహ్మ సృష్టికారుడు గనుక ఆధునిక శాస్త్రవేత్తలు రూపొందించిన క్లోనింగు గురించి తెలుసుకొనడానికి ఉబలాటపడతాడు. పరిపాలన చేసే విష్ణుమూర్తి గనుక మన ప్లానింగ్ గొప్పతనాన్ని తెలుసుకొనగోరుతాడు. లయకారుడైన శివుడు బాంబుల సంగతుల పట్ల ఆసక్తి చూపుతాడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మనుషులై పుడితే ఎవరి తత్త్వానికి తగిన జ్ఞానాన్ని వారు పొందజూస్తారని చెప్పటంలో అవధాని అద్భుతమైన ఔచిత్యం పాటించారు. మనిషిని దేవునికన్న మిన్నగా భావించారు. ఆయన శతావధానానికే ఈ పద్యం హైలైట్ అని భావుకులు మెచ్చుకున్నారు.

అవధానాల్లో ఎక్కువగా వినిపించేవి నిర్మాణ శిల్పంలేని బోలు పద్యాలే. ఇలాంటి ఉదాత్తమైన పద్యాలు చాల తక్కువగా వస్తుంటాయి. అవధానాల్లో మంచి కవిత్వం పండాలనే ఉద్దేశంతో కవితాప్రసాద్ నవరస నవావధానం, అలంకార అష్టావధానం అనే నూతన ప్రయోగాలు చేశారు. అవధాని చెప్పే పద్యంలో ప్రత్యేకించి ఏదో ఒక రసం కాని, అలంకారం కాని ఉండాలని పృచ్ఛకులు నిర్దేశించటంతో అవధాని చెప్పే పద్యాలన్నీ తప్పకుండా కవిత్వం అయ్యే అవకాశం ఉంటుంది.

**అవధానుల్లో పోటీ - అనారోగ్య ధోరణులు**

ఈ రోజు అవధానుల్లో పోటీ పెరిగిపోయింది. ఒకరు అష్టావధానం చేస్తే, మరొకరు శతావధానం చేస్తున్నారు. ఇంకొకరు ద్విశతావధానం చేస్తున్నారు.

మరింకొరు సహస్రావధానం చేస్తున్నారు. ఇంకా మరొకరు మహా సహస్రావధానం లేదా పంచ సహస్రావధానం కూడా చేయబోతారు. కాని అవధాన కళను శాస్త్రీయంగా ఎందరు చేస్తున్నా రనేదే జనం ముందున్న ఆలోచన.

అసలు అవధానం అంటే ధార, ధారణ, సృజన అనే మూడు ముఖ్య లక్షణాలు ఉండి తీరాలి. ఈ రోజుల్లో ఓ శతావధానమో, సహస్రావధానమో చేస్తున్నట్లు ఓ కరపత్రం అందంగా పంచ వర్ణాలలో ముద్రించి పంచేస్తే చాలు. అవధానంలో ధారణ లేకుండా అవధాని ముగించినా శతావధానో, సహస్రావధానో అయిపోతున్నారు. ధారణ సరిగా చేయకుండా ఇలా ముద్రలు వేసుకుని తిరుగుతున్నారు కొందరు అవధానులు. అలాంటివారు అవధానాన్ని శాస్త్రీయంగా చేస్తున్న గరికపాటి నరసింహారావు ప్రభృతుల్ని చూచి బుద్ధి తెచ్చుకోవటం మంచిది. ధారణకు దమ్ముంటే అవధాన ప్రదర్శన లివ్వాలి. లేకుంటే మానేయాలి. అంతేకాని సమయం లేదనో మరేదో వంకతోనో ధారణ దాటవేయటం శాస్త్రీయం కాదు.

అవధానం అనే ఈ కళను మరికొందరు ధారణ వాచస్పతులు మరోరకంగా దుర్వినియోగం చేస్తున్నారు. ఏదో ఒక కావ్యం బట్టీపట్టి ఎక్కడ ఏదడిగితే అది చెబుతుంటారు. దీనికి కూడా వాళ్ళు అవధానం అని చెప్పుకుంటున్నారు. ధారణ అనేది అవధాన లక్షణాలలో ఒక్కటి మాత్రమే. ఇలాంటి ధారణ ప్రదర్శనల్ని అవధానాలని పిలవడం శాస్త్రీయం కాదు.

ముగింపులో చెప్పేదొక్కటే. అవధాన కళ ప్రజల్ని ఆనందింప చేయగలదు, ఆలోచింపచేయగలదు. అందుకే ఈ అవధాన కళను అవధానులు, నిర్వాహకులు నిర్మాణాత్మకంగా ఉపయోగించుకోవాలి. సంస్కృతిని రక్షించే సాధనాన్ని సంస్కృతిని ధ్వంసం చేసేదిగా వాడుకోకూడదు.

మరో మాట - అవధానుల్లో పద్యం పట్ల మక్కువ ఎక్కువగా ఉండటం మంచిదే. అంత మాత్రాన అవధాన సభల్లో ఇతర సాహిత్య ప్రక్రియల్ని - ముఖ్యంగా వచన కవిత, మినీ కవిత, హైకూలను కించపరుస్తూ మాట్లాడటం భావ్యం కాదు. ఎవరో పద్యాల్ని విరగదంతామని అన్నారని ఆలస్యంగా కోపం తెచ్చుకొని ఆధునిక కవుల్ని తిట్టనవసరం లేదు. ఎవరి ప్రక్రియ వారిది. అందరూ సాహిత్య ప్రయోజనం కోసమే కృషి చేయాలి. రాళ్ళబండి కవితాప్రసాద్‌లాంటి కొందరు అవధానులు తమ అవధాన సభల్లో ఆశువులుగా వచన కవితలు, మినీ కవితలు, హైకూలు, గేయాలు కూడా చెప్తూ సమన్వయ దృష్టి ప్రదర్శిస్తున్నారు. ఈ వైఖరి ప్రశంసనీయం. మిగిలిన అవధానులకు ఆచరణీయం కూడా.

* * * * * * * * *

# ఉపయుక్త రచనలు


1. **"వచన పద్యం - లక్షణ చర్చ"** (వ్యాసాల సంపుటి)

   చేకూరి రామారావు, సంపత్కుమార - నాగార్జున ప్రింటర్స్ హైదరాబాద్,1978

2. **"చిక్కనవుతున్న పాట"** (దళిత కవితల సంపుటి)

   సంపాదకులు : జి. లక్ష్మి నరసయ్య త్రిపురనేని శ్రీనివాస్

   కవిత్వం ప్రచురణలు. విజయవాడ 1995

3. **"శతావధాన కవితా ప్రసాదం"** (రాళ్లబండి కవితాప్రసాద్ శతావధాన పద్యాలు)

   సంపాదకులు : డా॥ రావి రంగారావు - సాహితీ మిత్రులు,

   మచిలీపట్నం - 1999

4. **"మహా సంకల్పం"** (కవితల సంపుటి)

   చైతన్య భారతి, విజయవాడ 1975

5. **"ఇంటింటి పద్యాలు"** (కవితలు)

   ఆరుద్ర - నవోదయ పబ్లిషర్స్, విజయవాడ

6. **"యుగ సంకేతం"** (కవితలు)

   మాదిరాజు రంగారావు - విజయ ప్రెస్, హనుమకొండ 1969.

7. **"చితి - చింత"** (కవితలు)

   వేగుంట మోహన ప్రసాద్ - శేషాచలం అండ్ కో, 1969.

8. **"ఖడ్గ సృష్టి"** (కవితలు)

   శ్రీశ్రీ - విశాలాంధ్ర ప్రచురణలు, విజయవాడ 1966.

9. **"అక్షరాల గవాక్షాలు"** (కవితలు)

   సి. నారాయణ రెడ్డి - శేషాచలం అండ్ కో, 1965.

10. **"వచన పద్యంలో వ్యాకరణం"** (వ్యాసం)

    చేకూరి రామారావు - భారతి, ఫిబ్రవరి 1980 . . .

